# శిష్ట్లా ఉమామహేశ్వరరావ్

## కవిత్వం: సమాలోచనం

[విష్ణుధనువు - నవమిచిలుక]

సంపాదకుడు
డాక్టర్ ఏటుకూరి ప్రసాద్

ప్రచురణ:
శ్రీ శ్రీ స్మారక సంస్థ
ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం
1998

శిష్ట్లా ఉమామహేశ్వరరావ్ – కవిత్వం: సమాలోచనం
డా॥ ఏటుకూరి ప్రసాద్

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 1998



ముఖ చిత్రం: చంద్ర

వెల: రూ. 45-00

సోల్ డిస్ట్రిబ్యూటర్స్: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్–500 001.

ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్ –29. ఫోన్: 597831

# అంకితం



స్వాతంత్ర్య సమరయోధుడు
అభ్యుదయ రచయితల సంఘ
ఉద్యమ వైతాళికుడు
కామ్రేడ్ తుమ్మల వెంకటరామయ్యగారికి

# ప్రచురణకర్తల మాట

శ్రీశ్రీ స్మారక సంస్థ, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం సహకారంతో 1983 నుండి ఇప్పటి వరకు ఈ కింది 5 గ్రంధాలను తెచ్చింది.

| | | |
|---|---|---|
| 1. | సాహిత్యాభ్యుదయం | 1985 |
| 2. | సాహిత్యం వాస్తవికత ఓ మార్క్సిస్టు దృక్పథం | 1986 |
| 3. | మాచిరాజు దేవీప్రసాద్ పేరడీలు | 1986 |
| 4. | కొంపెల్ల జనార్ధనరావు జీవితం – సాహిత్యం | 1987 |
| 5. | పొయిట్రీ వర్క్‌షాప్ | 1993 |

అధ్యయనం – పరిశోధన – ప్రచురణలు లక్ష్యాలుగా 1983లో ఏర్పడ్డ శ్రీశ్రీ స్మారక సంస్థ; పలువురు దాతలు – సంస్థల ఆర్థిక సహాయ సహకారాలతో ప్రతిష్ఠాత్మకమైన ప్రచురణలను తీసుకరాగల్గింది. వారందరికీ మా కృతజ్ఞతలు – అయాగ్రంధాల రచయితలకూ – సంపాదకులకూ ధన్యవాదాలు.

వచన కవితకు ఆద్యుల్లో ఒకడూ – అతినవ్యకవిత్వానికి తన తిరుగుబాటు ద్వారా అహ్వానం పల్కినవాడూ శిష్ట్లా ఉమామహేశ్వరరావు. అతడు అతిచిన్న వయస్సులో మరణించాడు. కానీ ఓ గొప్ప తిరుగుబాటు జండాను కవులచేతి కందించే తాను కన్నుమూశాడు.

ఆ తిరుగుబాటు తత్వ ప్రతీకలు విష్ణుధనువు –నవమిచిలుక కావ్యసంకలనాలు. 1938లో తొలి ప్రచురణల తర్వాత మళ్ళీ వాటి ప్రచురణకు ఎవరూ పూనుకోలేదు. అందరూ అతని కవితా శకలాలను మాత్రమే ఉదహరిస్తున్నారు.

శ్రీశ్రీ స్మారక సంస్థ వ్యాపార దృష్టిలేని సాహితీ సంస్థ. అందుకే ఆర్థికంగా ఎలా ఉన్నా సరే ఈ సంకలనాలను నేటి యువతరానికి అందివ్వాలని భావించింది. శిష్ట్లాను అంచనా వెయ్యటానికి – ఇప్పటికీ అందులో కృషి చేసిన వారి శ్రమనూ – అలోచనలను కూడా ఇందులో చేరిస్తే నేటికవులకు సొంతంగా సరైన అంచనాకట్టడానికి అవకాశం లభిస్తుందని వాటినీ ఈ సమాలోచనంలో చేర్చాం.

ఈ గ్రంధానికి కూడా సాహిత్యాభిమానుల ఆదరం లభిస్తుందని భావిస్తున్నాం. ప్రచురణల్లో నిత్యం తోడ్పడుతున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి కృతజ్ఞతలు.

\- శ్రీశ్రీ స్మారక సంస్థ

# వచన కవితకు పురిటి నొప్పులు

పాతను వదిలించుకోటానికి ఎంతో ధైర్యం ఉండాలి. ఆత్మస్థైర్యం ఉండాలి. కొత్తను ఆరంభించడానికి నిశితమైన చూపూ, ఎన్నో సంవత్సరాల ముందును చూడగల నేర్పూ; విమర్శలను తట్టుకో గల సంప్రదాయబలం ఉండాలి. ఇవి ఏ రంగంలోని వారికైనా అవసరమైన లక్షణాలు. ముఖ్యంగా సాహిత్య రంగంలో వారికి అవశ్యకాలు.

శిష్ట్లా ఉమామహేశ్వరరావు తెలుగు కవితారంగంలో ఆధునికతను – నవ్యతను ముందుతరాలవారికి అందించిన అతినవ్యులలో అతినవ్యుడు. వచన కవితకు ఆరంభకుడు. ఊపిరులూదిన వాడు. బొడ్డుకోసిన వ్యక్తి. "మేం మాత్రం కవులంకామా" అని ప్రతి ఒక్కడూ విర్రవీగుతున్న కాలంలో, భావకవిత్వం బావుటా రెపరెపలకింద తెలుగు సాహిత్యం – ముఖ్యంగా కవిత్వం – నిద్రజోగుతున్న సమయంలో; అతినవ్య కవిత్వం కొరడా ఝళిపించి మత్తువదిలించి "అదిగో చూడండి రాబోవు యుగం కాంతి రేఖలు. ఇదిగో ఇవీ ఆ యుగాన కవితారేఖలు"– అంటూ కళ్ళుతెరిపించి బలవంతాన చూడమన్న వాడు శిష్ట్లా. జానపద వాఙ్మయం సింగారాలు ఉగ్గుబాలతో చూసినవాడు. సంప్రదాయరక్తం ఉరకలెత్తే నరాల బిగువున్న వాడు. ఆంగ్ల సాహిత్య అంగారం దర్శించి చేతులు కాలేలా – స్పర్శించిన వాడూ ఉమా విజయ మాహేశ్వరం.

మాటలకు అర్థాలు మార్చాలంటాడు. సమాసఘటనలు వదులుగా ఉన్నా ఫరవా లేదంటాడు. కవిత్వంలో వ్యాకరణంతో వ్యభిచరించే స్వేచ్ఛ ఉండటం న్యాయం అంటాడు. కావ్యానికి రమ్యత ప్రాణం అన్నది శిష్ట్లా కవిత్వతత్వం. ఇలా అంటూ తన కవితల్లో – తనకు బాగా వంటబట్టిన తెలుగు సాంప్రదాయ జానపద గాన ఫణితులనూ, తాను అధ్యయనం చేసిన ఆంగ్ల గానగతులనూ కలగలిపి శ్రావ్యసౌభాగ్యం ప్రవేశ పెట్టాడు.

1930లలో ఆరంభించిన కవితా వ్యవసాయం తొలిపంట విష్ణుధనువు 1938 జనవరి నాటికి శిష్ట్లాలో ఉన్న – అస్పష్ట కవిత్వ దార్శనికత; తన రెండో పంట నవమిచిలుక 1938 చివరి నెలలకల్లా – నిర్దిష్టతను సంతరించుకుంది. మొదటి సంకలనంలో కనిపించే భావ కవిత్వపు ప్రభావం – ఆత్మాశ్రయ లక్షణం, ప్రేమ – తనదిగా చేసుకున్న కొత్త తరహాలో "ఉద్భ్రాంత ప్రేమ" రూపం పొందింది. ఆత్మ నిర్వాణం ప్రేమ అన్న అలౌకిక తాత్వికత దర్శనమిస్తుంది. ప్రేయసి "మనః పద్మవ్యూహమును" ప్రవేశించే అభిమన్యుడుగా తనను సంభావించుకుంటూ, "ప్రేయసీ నీ చూపులో తోడు కలిగించున దదేదో ఉన్నదే! అదే మిటదేమిటే" అన్న విచికిత్సలో పడ్డాడు కవి. తన ప్రేయసి "అర్థోదయాంబుధి కన్య" అంటాడు. తనది "భ్రమ, భీతి, ఆవేదనా ప్రణయ ఆనందము" అంటాడు. ఈ భావననే శివశంకరులు ఉద్భ్రాంత ప్రేమ అన్న కొత్త తరహాది అంటూ పాలపొంగులాటిదన్నారు.

శిష్ట్లాయే అన్నట్టు – ఈ సంకలనంలో కొత్తలో ప్రతికవీ పదాల డమరుక విన్యాసం చేసినట్టు తానూ "Philology కీ అలంకార శాస్త్రానికీ సంబంధించి"న పలు ప్రయోగాలు చేశానన్నాడు. జ్వాలాభీలాంతర్గతకణములు, పల్లవీ వల్లవోల్లాసాను పల్లవీ రాగములు, తురీయ జగదనుష్ఠానాలు, వ్యక్త్యభావ వైరాగ్య నిర్వాణం – వంటివే ఇందుకు దాహరణాలు. జానపద బాణీ నడక సాగినచోట "నడిజాము వేళలో, నడిగడియ విడిదిలో, అడుగులను వెన్నాడి, అలసటే లేకుండ వచ్చెదను సొక్కుతూ సోలుతూ పిల్చెదను"– అంటూ చిన్న చిన్న పదాల పోహళింపు కనిపిస్తుంది. తనదైన దారికోసం కవి వెతుక్కోటం మనం చూస్తాం. కాలం కొద్దేకావచ్చు. కళ్ళముందు మసక మసగ్గా కవిపిస్తున్నదారి స్పష్టం – నిర్దుష్టం కావటానికి; నిత్యం ఆలోచన – అనుశీలన – అంతర్మథనం సాయపడ్తుంది. కనుకనే 1938 సంllరం చివరికల్లా కవి సంకలనం చేసి ప్రచురించిన 'నవమిచిలుకలో' "ప్రాహ్లాద కవిత్వమిది... ప్రౌఢత్వ మున్నది... పామరత్వమున్నది. దేశి విదేశీ నేస్తమున్నది" అంటూ ఓ లక్షణం చెప్పుకోగల్గాడు. "ఆరిపోయే దీపాన్ని రగుల్పుతుంది. పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది"– అంటూ నిర్దిష్టమైన కవితాలక్ష్యం వెల్లడించాడు. తన చొరవతో తన తెలివితో యముణ్ణి సైతం అర్థించి, ప్రార్థించి, గీపెట్టి – భయపెట్టి, పదాల మెలికల్లో అర్థాలు చూపెట్టి తన సత్యవంతుణ్ణి బతికించి తెచ్చుకొన్న సావిత్రి సాహసం, సావిత్రీ సత్యవంతుల ప్రేమైక జీవితం – తన కవితలో ఉందంటూ; తన కవిత "తాను నిలుస్తుంది" – ఎవరి పోటీకర్ర ఊతమూ అక్కర్లేదన్నాడు ఉమావిజయ మహేశ్వర వినాయక్. శీర్షికల నుంచీ కవితల్లోని చాలా పాదాలవరకున్న పదాల్లో; చక్కని–చిక్కని తెలుగుతనం, సీదాసాదా వ్యావహారిక భాషాతనం మన గుండెలను రగుల్పుతుంది. ఉచ్చారణానుసారం పదాలను సంఘటించడం కనిపిస్తుంది. "అగ్రహారప్పడితె, సాయిబ్బోయి సాయిబ్బోయి! సెయిసిక్కంగా యేస్కో, నేపాళం మాత్రెయ్యే లేత్తాడు పిల్లోడు... సంకురాంతి పండక్కు నేపాళం సెట్టెక్కిరా" – లాటివి ఎన్నెన్నో...

భావకవిత్వం భావనాబలం వదిలించుకోవాలన్న తపనను పెంచుకుంటూ, అతినవ్యతను సాధించాలనుకుంటూ తన మనో నేత్రాన్ని సారించిన విష్ణుధనువుకు; అందుకే కాబోలు సాంప్రదాయానికి సాష్టాంగ పడినా ఆనాటి కున్న ఆధునికతకు ఆహ్వానం పలికే శివశంకరులు, విశ్వనాథల అభిప్రాయాలను సంకలించాడు శిష్ట్లా. తన కవిత్వ దిశ–దశ; లక్షణం–లక్ష్యం తెలుసుకున్న నాటి నవమి చిలుకకు, పాతను తెగేసుకున్న హేతువాది అప్పటికి పురోగామి గోపీచంద్ విమర్శను సంపాదించుకున్నాడు వినాయక పండితుడు. శిష్ట్లాలో కనిపిస్తున్న – ప్రొలిటేరియన్ జీవితం నుండి తీసుకొన్న కథావస్తువునూ, భాషనూ; అతని అంతరంగంలో రేగుతున్న సంఘర్షణనూ, "ప్రోలిటేరియన్ విప్లవం" చెయ్యడానికి సిద్ధపడే మనస్తత్వాన్నీ అందుకవసరమైన కవితా అస్త్రశస్త్రాల సంపాదననూ – పసిగట్టి మనల్నీ గమనించమన్నాడు గోపీచంద్. విష్ణుధనువులో ఉద్భ్రాంత ప్రేమ ప్రవక్తగానూ, నవమి చిలుకలో ప్రాహ్లాదకవితా ప్రయోక్తగానూ మనకు దర్శనమిస్తాడు ఉమా.

విష్ణుధనువును 128 ప్రతులు మాత్రమే అచ్చేశాడు. దానికో కథ చెప్పారు అతని సమకాలికులు. నవ్యసాహిత్య పరిషత్తు గంటూరు పక్షాన అచ్చైంది. 64 పుటల గ్రంథం రెండు ప్రెస్సుల్లో అచ్చెయ్యాల్సి వచ్చింది. మిత్రులు పూలపల్లి వెంకట వల్లభాచార్యులు, వేదాంతం పూర్ణానందం, పణిహారం రామమూర్తి గారలకు అంకితం ఇచ్చాడు. ఈ గ్రంథాదిలో "ప్రేమయనగా"...అంటూ ఆరంభించిన కవితలో సీత యెవరో అన్ని యుగాలలో అన్వయిస్తూ 'కలిలో నాలక్ష్మి'– అంటాడు ఉమామహేశ్వరం. శిష్ట్లా భార్య పేరు రామలక్ష్మి. ఆమె వైణికురాలు గుంటూరులో సంగీతపాఠాలు చెప్పకుంటూ జీవించింది. బహుశా ఆ లక్ష్మి ఈ రామలక్ష్మి కావచ్చు.

నవమిచిలుక ఎన్ని ప్రతులు అచ్చేసిందీ తెలీదు "మాధవపెద్ది వెంకట్రామయ్య బాబాయి"కి అంకితమిచ్చాడు. స్వయంగానే అచ్చేసుకున్నట్లు ఉంది. సంవత్సరం 1938 చివరలో కావచ్చు పత్రికల్లో వచ్చిన సమీక్షలను బట్టి. రాబోయే గ్రంథాలంటూ "జలకన్నె–అను విష్ణుధనుష్టంకారము; జలకన్నె – అను విష్ణు ధనుర్గాండీవము; రంకులరాటము – కథలు" అని పేర్కొంటూ (ఇవి అచ్చైన దాఖలాలు లేవు); "వెలువడిన గ్రంథము విష్ణుధనువు" అన్నాడు. 'నవమిచిలుక' మొదటి రచన, ఆ తర్వాతిది "విష్ణుధనువు" అంటారు శ్రీ సోమసుందర్. కానీ; అంతర్ సాక్ష్యాలను చూసినా, భాషమీద మమకారం వదుల్చుకుంటూ భావానికి ప్రాధాన్యాన్నివ్వటం – అప్పటికి అందిన సామ్యవాద సాహిత్యాధ్యయనం వల్ల కల్గిన "ప్రొలిటేరియన్" భావప్రస్తారం గ్రంథం నిండా ఉండడం – చూస్తే 'నవమిచిలుక' విష్ణుధనువు తర్వాతిదనే అనాలి. సంకలనం చదివితే పాఠకులూ ఓ నిర్ణయానికి రావచ్చు. కొద్ది కాలమే అయినా శిష్ట్లా నడిపిన 'శాంతి'ని (1942) పత్రిక లభిస్తే మరిన్ని వివరాలు దొరికే అవకాశం ఉంది. జలసూత్రం; భారతిలో చేసిన విమర్శ చూస్తే (1942 ఏప్రిల్) ఆ పత్రిక ఆయుస్సు తక్కువే అనిపిస్తుంది. సంపాదకుడు ఉమేశ్వరరావు. దసరా దళం (నాటిక), ఆత్మహత్య (నాటిక – 1935 జ్వాల); గోరింటరాక్షసుడు (కథ); సిపాయి కథలు (1946); ఆకాశవాణి కథలు అంటూ అపోహ – నమ్మకాలదిమ్మ (1946 భారతి); థియెడార్ డ్రైజర్ శేముషీ విశేషాలు (వ్యాసం. భారతి) వంటి రచనలూ – వాటి ప్రస్తావనలే ప్రస్తుతం లభ్యమవుతున్నాయి. 'విష్ణుధనువు – నవమిచిలుక' కవితా సంకలనాలు సరేసరి. కాళింగి పాటలు అని శ్రీశ్రీ, కాళింది పాటలు అని కొందరూ అన్నది ఒకటే. కళా – ఇంగితం కలిపి 'కాళింగి' సమాసం చేశానని "ఉమ్మాయ్" చెప్పినట్టు శ్రీశ్రీ సాక్ష్యం దొరికింది. కానీ కాళింగి కవితలోనే ఆ వ్యాఖ్యానం ఉంది మీరే చూడండి. శ్రీశ్రీ మాటల్లోనే "వచన కవిత్వం ఆదిమదశ" ఇతని కవితలు. దీనిని కళాత్మకం చేసిన వాళ్ళలో శ్రీశ్రీ ఒకరు. ఈ ఆదిమ దశ వచన కవితలను 1930 దశకానికి ముందే శివశంకర శాస్త్రి, ఆ తర్వాత ముద్దు కృష్ణ తెలుగు కవులకు ముఖతః అందించారు. 1933లో జరిగిన బరంపురం సభల్లోని కవులు – ఈ కవితలను పరోక్షంగా విని 'షాక్' తిన్నారు. తేరుకొని తెలుగు కవితారంగంలో తిరుగుబాటు జండా పాతి, నవీన పంథాలో నడవడం ఆరంభించారు.

1909లో గుంటూరు జిల్లా మంచాళ అగ్రహారంలో శిష్ట్లా జన్మించాడు. శిష్ట్లా జననమరణాల తేదీ, నెలలు, సంవత్సరాల నమోదు ఇంతవరకూ స్పష్టంగా తెలీడంలేదు. ఆరుద్ర 1912–1953 అన్నారు. కురుగంటివారు (1912) అన్నారు. బాగా ఎరిగిన తల్లావఝుల, విశ్వనాథ, గోపీచంద్ లు ఆ ప్రసక్తి తేలేదు. అలాగే నారాయణబాబు. శ్రీ శ్రీ – కాస్త అటోయిటో తన వయస్సుకు – అనే స్పృహ కల్పించాడు. సోమసుందర్; శిష్ట్లా జననం 1912 అన్నాడు కానీ, మరణం 1946–47 ప్రాంతంగా గుర్తు చేసుకుంటున్నాడు. బొమ్మకంటి తెలుగు విజ్ఞాన సర్వస్వం, రేడియో ప్రసంగాలలో 1912–1953 అనే ప్రస్తావించారు. ఆచార్య జి.నాగయ్య 16–5–1906 – 2–1–1965 అంటూ తన సాహిత్య సమీక్షలో నమోదు చేశారు.

తెలుగు అకాడమీ ప్రచురించిన తెలుగు సాహిత్యకోసం (ఆధునికం)లో సంపాదకులు శిష్ట్లా జననాన్ని 2–11–1909 గా ప్రచురించారు.

భారతీయ సాహిత్యం అంతర్జాతీయ విజ్ఞాన సర్వస్వం ఆంగ్లంలో తయారుచేసిన 5వ సంపుటం తెలుగు విభాగంలో 1909–1953 గా నిర్ణయించారు.

ఇన్ని ఊహల మధ్య అసలైన జనన సంవత్సరం తెలుసుకోవాలి. వరద రాజేశ్వరరావు కథనంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం 1926లో ఏర్పడింది. మొదటి 3–4 సంవత్సరాలలో అతను శిష్ట్లాను గుంటూరులో సెలవల్లో కలిసేవాడు అంటే అప్పటికే 1929–1930 లలో బెనారస్‌లో M.A. పట్టా ఆంగ్లంలో పుచ్చుకున్నాడు శిష్ట్లా. కనుక ఎంత కాదన్నా [15+2+2+2] 20–21 సంవత్సరాలు శిష్ట్లాకుండాలి. 1929 సంవత్సరానికి 20 సంవత్సరాలంటే జననం 1909 అయ్యే అవకాశం ఉంది. శివలెంక శంభుప్రసాద్, శిష్ట్లాకు బెనారస్‌లో సహాధ్యాయి. ఆయన M.A. చదివిన కాలం కూడా అదే అన్నట్టు – శంభు ప్రసాద్‌గారి జీవిత చరిత్ర కొద్దిగా వివరిస్తూ తిరుమల రామచంద్రగారు ఋజువులు చెప్పారు. వీటన్నిటికీ మించి; గుంటూరులో S.V.L. నరసింహంగారు ప్రముఖ అడ్వకేటు శిష్ట్లాకు సోదర సమానుడు – ఇప్పటికీ ఆరోగ్యంగా ఉన్న వారి – స్మృతి రేఖలు.

1997 కు శ్రీ నరసింహంగారి వయస్సు 86 సం॥లు. తనకన్నా "ఉమ" రెండు సంవత్సరాలు పెద్ద అన్నారు. అంటే ప్రస్తుతం 88 సంవత్సరాలుండాలి. ఈ లెఖ్ఖన ఉమా జన్మ సంవత్సరం 1909 కాక తప్పదు. ఉమా; పూనాలో మిలట్రీలో పనిచేసే సందర్భంలో ఒక "అవాంఛనీయ కేసు"లో ఇరుక్కుంటే ఈ S.V.L. నరసింహం గారెళ్ళి కోర్టులో వాదించి, విడిపించి తెచ్చారట. కవిత్వాన్నే యోచిస్తూ – ధ్యానిస్తూ – జపిస్తూ – కొత్తదనానికి తపిస్తూ నిత్యం పలవరిస్తూండేవాడన్నది ఈ అడ్వకేటుగారి జ్ఞాపకాల పొరలు విడదీస్తే తెల్సిన అంశాలు. పెనుగొండ లక్ష్మీనారాయణగారు సేకరించి పంపిన శిష్ట్లా హరివంశవృక్షం కూడా ఇదే 1909 నే బలపరుస్తూంది. నవ్వుతూ పేలుతూ ఉంటూ; క్షణంలో సీరియస్ అయ్యేతత్త్వం. ఇంటిపట్టున ఉండకుండా మిత్రుల ఇళ్ళల్లోనో, రూముల్లోనో గడిపిన ఎత్తుడి సంసారి

ఈ ఉమామహేశ్వరనాయకం. మరణ సంవత్సరం విషయంలో చాలా మంది 1953 తోనే ఏకీభవిస్తున్నారు.

తండ్రి వెంకటకృష్ణయ్య, ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ 1920 ప్రాంతాల్లో ఆ ఉద్యోగానికి స్వస్తి చెప్పి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు. ఆతర్వాత తన జీవితాన్ని ఖాదీ ప్రచారానికి అంకితం చేసుకున్న స్వాతంత్ర్య సమరయోధుడు. ఉమా మహేశ్వర్రావు మద్రాసులోనూ, బెనారస్‌లోనూ చదివి ఆంగ్లంలో M.A పట్టా పొందాడు. ఓ కంపెనీలోనూ, కళాశాలలోనూ, స్కూలులోనూ, మిలట్రీలోనూ అనేకానేక ఉద్యోగాలు చేశాడు. గాంధీ మనవడు పెట్టిన Moral Rearmment Association (M.R.A) సంస్థలో కొన్నాళ్ళు పనిచేశాడు. దివ్యజ్ఞానసమాజంలో సభ్యుడుగా ఉన్నాడు. సంగీతం, జ్యోతిష్యం లాటి నానారకాల వ్యాపకాలూ ఉండేవి. స్థిరమైన ఉద్యోగం, క్రమమైన జీవితం లేని 'అనార్కిస్టు'. సూడోమిస్టు. శివలెంక శంభుప్రసాద్ సహాధ్యాయి కనుక ఆంధ్రపత్రిక (మద్రాసు)లో (1940) కొంతకాలం సంపాదక శాఖలో పన్జేశాడు. ఆరోజుల్లో కూడా ఆదినుంచీ అంటుకున్న నాటుసారా బిగింపులో ఆఫీసులో ఉండే వాడని తిరుమల రామచంద్రగారి జ్ఞాపకం. దేశరాజు కృష్ణశర్మ గారికి మంచి మిత్రుడు. ఆ నెపం మీద గుంటూరులోఉండే రోజుల్లో ఉదయంనాస్తా ఆయన వంతుగా దబాయించి పూర్తిచేసేవాడన్నది ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారి సాక్ష్యం. బెల్లంకొండ రామదాసు, శిష్ట్లాకు ఆప్తమిత్రుల్లో ఒకరు. 'శిష్ట్లా' అంటూ తన ఇంటిపేరు రాసే వాడు.

ఉమామహేశ్వర్రావ్ వ్యక్తిగత జీవితం గురించి ఎంత తక్కువ తెలుసుకుంటే అంత మంచిదన్నది అతని సమకాలికులా, బంధుమిత్రుల అభిప్రాయం. ముఖ్యంగా గుంటూరులో ప్రముఖ న్యాయవాది, మాజీ పార్లమెంటు సభ్యులు, వామపక్ష రాజకీయాభిమాని శ్రీయస్వీయల్ నరసింహారావుగారితో ఇప్పుడు మాట్లాడినా అంటారు. ఉమాకు ఓ తమ్ముడుండేవాడు. దత్తతకెళ్ళాడు. ఒక కూతురు మాత్రం ఉండేది. గుంటూరుజిల్లా పిడుగురాళ్ళ గ్రామంలో ఓ ఆశ్రమం ఉంది. అందులో ఉండే ఓ స్వామీజీతో (వీరే కేశవదాసుగా మారిన దండమూడి కేశవరావు) శిష్ట్లాకు పరిచయం. తరుచు ఆయతీంద్రుల దగ్గరికెళ్ళేవాడు. పెదకూరపాడు (గుంటూరు జిల్లా)లో ఉపాధ్యాయుడుగా ఉన్నకాలంలో (1953) కొందరు శిష్యులు కాపుసారాయిలో విషం కలిపి ఎవరినో హత్య చెయ్యాలని భావిస్తే – దాన్ని ఉమామహేశ్వర్రావు తాగి మరణించాడని మిత్రుల కథనం. నాటి కవిలోకం కానీ – పత్రికాలోకం కానీ వీరి మరణం పట్టించుకున్న దాఖలాలేదు.

జీవించిన కొద్ది కాలంలో కొత్తమార్గం కవిత్వానికి చూపాలని సాహసించాడు. ఎవరు ఒప్పినా ఒప్పకున్నా ఆ కొత్త మార్గం రాబోయే తరందన్నధీమా ప్రకటించాడు. ఎందుకు అంగీకరించరని శ్రీశ్రీ లాటివారిని (అప్పటికి మహాప్రస్థానం గీతాలు పత్రికల్లోనే నిద్రబోతున్నాయి అన్న శ్రీశ్రీ మాటల్లో) తన కవితా సంకలనాల ద్వారానూ, శారీరక దార్ఢ్యం ద్వారానూ దబాయించాడు. అబ్బూరి అన్నారని అన్నట్ట 'కవితారంగంలో రౌడీ వేషం' వేసిన వ్యక్తి శిష్ట్లా ఉమామహేశ్వర్రావ్.

శివశంకర శాస్త్రి నుంచి నేటి తరంలోని వాళ్ళ వరకూ తన శక్తిని అంచనా వెయ్యండంటూ ప్రశ్నిస్తూ వెళ్ళిపోయిన అతినవ్యుల్లో అతి నవ్యుడైన చారిత్రాత్మక కవి శిష్ట్లా. నవ్యసాహిత్య పరిషత్‌తో సత్సంబంధాలు. ఆజానుబాహుడూ - అందగాడూ, మాటకారితనం, అభినయకౌశల్యం ఉన్నవాడు. మంచినటుడు.

ఉమామహేశ్వరరావ్ కవితల సంకలనం ఇలా తేవడంలో ఉద్దేశం - నేటితరం కవులకు - ఇతని సాహసాన్ని గురించి తెలియ చెయ్యాలనే! ఏ విమర్శకులు రాసినా శివశంకర శాస్త్రి, గోపీచంద్‌ల ఆధారంగానే; నవమిచిలుక మున్నుడి! కవిత ఆలంబనంగానే తప్ప పలువురు రెండు కావ్యాలూ చదివినట్టు అనిపించలేదు - కారణం అలభ్యాలు కనుక. వీరి కవితలూ - దానిమీద; అందినంత వరకూ వచ్చిన విమర్శలూ ఓ సంకలనంగా ఈనాటి కవులకు అందిస్తే ఎవరికి వారే అంచనాల షరాబు కావచ్చన్న ఊహలే దీనికి నన్ను ప్రేరేపించాయి.

నవోదయ ప్రచురణ కర్తలు శ్రీరామమోహన రావుగారు ఈ కవితలకు హక్కుదారులు. వీరు దయతో, ఒక ఎడిషన్ - శ్రీశ్రీ స్మారక సంస్థ పక్షాన అచ్చేయడానికి అనుమతిచ్చారు. ఇదివరలో వీరొకసారి కవితల సంకలనం ప్రచురణకు పూనుకొన్నారు. వారికి సర్వదా కృతజ్ఞుణ్ణి. ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య, మిత్రుడు డా॥ అక్కిరాజు రమాపతిరావు, ఆర్వీరామారావు గార్లు శిష్ట్లా కవితలు నా కంద జేయడంలో సహకరించారు. ఈ సంకలనంలో "ఉమ్మాయ్"ని గురించి వివరాల కోసం ఆరుద్ర, తిరుమల రామచంద్ర, బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యంగార్లతో అనేక పర్యాయాలు చర్చించాను. ముఖ్యంగా అరసం రాష్ట్ర నిర్వాహక కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణగారు శిష్ట్లా వారి బంధువులనుండీ - దశాబ్దం కిందట శిష్ట్లా రామలక్ష్మిగారి నుంచీ అనేక వివరాలు, ఫొటో సేకరించి పంపారు. అబ్బూరి ఛాయాదేవిగారు శిష్ట్లా అపురూపమైన ఫోటో ఒకటి ఇచ్చారు. సమాలోచనంలో స్వీకరించిన వ్యాసాల రచయితలు తమ అంగీకారాన్ని సహృదయంతో తెలియజేశారు. మిత్రుడు మల్లిక్ తన సలహాల నందించాడు. సుందరయ్య విజ్ఞాన కేంద్రం గ్రంథాలయం, తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయం, శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం, వేటపాలెం గ్రంథాలయం నాకు సాయపడ్డాయి.

ఈ సంకలనం; శ్రీశ్రీ స్మారకసంస్థ, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘప్రచురణగా తేవడానికి ఆ సంస్థలు వెన్నుతట్టి ప్రోత్సహించాయి. విశాలాంధ్ర ప్రచురణాలయం మేనేజర్ శ్రీ పి. రాజేశ్వరరావ్‌గార్కి, కంపోజింగ్ చేసిన ట్వంటీఫస్ట్ సెంచరీ అధినేత వి. శ్రీనివాస్, ప్రముఖ చిత్రకారుడు 'చంద్ర, మల్లిక్' వంటి మిత్రులు అడుగడుగునా నాకు సాయం అందించారు.

ఓర్పుతో, నేర్పుతో ఇంతకాలం నుండీ నాకు అన్నివిధాల నా శ్రీమతి కుసుమ తోడ్పాటునందిస్తోంది.

అందరినీ మించి, నేను చేస్తున్న కొద్దిపాటి సాహిత్య సేవను సాహితీ మిత్రులు ఆదరిస్తున్నారు.

వీరందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు. - ఏటుకూరి ప్రసాద్

# ఇలా కవితామయమేనోయ్...

## కవిత్వం



## సమాలోచనం



## సమీక్షలు



## వ్యాసాలు

★ ★ ★

ప్రేమయనగా
చూచుటగాదు,
పలుకుటగాదు,
విప్పాల చిత్తముతో
వాపోవుటగాదు!

ప్రేమయనగా
మంత్రముగాదు,
తంత్రముగాదు,
ఆత్మనిర్వాణముచే
ఆరాధించుటయే!

అనగనంగా
ప్రేమయనంగ
అపూర్వగాథ!
పూర్వకర్మపరిపక్వ
మహాగూఢ గాథ!

సీతయనగా
చెంచీతయనగ
త్రేతాయుగపు
పరాశక్తి! ద్వాపరలక్ష్మి!
కలిలో నాలక్ష్మి!

జన్మతో జన్మించునోయీ
జీవేచ్ఛలన్నీ
జన్మాంతము జీవించునోయి!

జనకుని గృహమున
నున్న సీత, నా
కలలో, వెన్నెలజల్లారు భూమిపై
నడువగా కాలి
గొలుసుల విలాస
రాసకళ లీలలు
నన్ను నిలువున చెంగుటుయ్యాలల
ఊంచి మేల్కొల్పు!

ధరణిని వహించి
మందగమనయౌ

జగశ్శక్తి, శ్రీశక్తి! సీతను
చూచి సహించలేను!

ఎంతభారమో
కనుమూయక మోయు,
క్షేత్రవతి, సీత స్వేదవనము
వైకుంఠము దహించు!

చెమట బిందువుల
చెదిరించి రాల్చు
పయ్యట వీవగా రాలు ముత్యాల
తలంబ్రాలెన్నడో!

ఎన్నడో పడతి
కీనీడ వెనుక
వెనుకగా, వెనుకగా, వెనుకగా వెన్నాడి
కవ్వించి నవ్వించి

సీతా! మైథిలీ!
వైదేహియని
పేర్లతోకూర్చి కాగిటజేర్చి వైకుంఠమును
భూమికి దెచ్చుటెపుడో!

చెమటలన్ చిమ్ముచు
ముత్యాలబిందు
వుల ఒడలు, భారమున కృంగిన
ఒడలు, నడువగా, నా
గుండె దడదడ యని
జగద్భారమును
ధరించు ధరణిజయే తొట్రుపడిన
జగతి యేమౌనంచు
మూడుకోట్ల కండ్లు గలవాడనై, ముజ్జగముల
వీక్షించుచూ
ఆత్రుతార్తి
హృదయుడనై
క్రుంగుచుంటి!

★ ★ ★

సర్వమానవ సమిష్టి బాధ్యతను
వెలలేని వెన్నెముకపై
మోయుచున్నది సీత!–– అడుగు
పడినపు డామేర ఆమేర
కూకటివేళ్ళతో పాతాళము కదిలినటుల
కృంగగా, కృంగగా, నాహృదయము
కూలుతూ కుప్పగ దొంత్ర దొంతరలుగ కూలిపోయె!

అష్టదిగ్గజములార! సీత
యీ క్షితిని మోయుచున్నది లెండు!
సాయ మొనర్ప రండు లేనియెడ
వైచెద యెదురులేప శర పరంపరల!

★ ★ ★

చాయ చేమంతివిరుల విదజల్లు లల్లుకొనురీతి
చంద్రికలు రాలినవి పచ్చికలనేలపై తుమ్మిపూవులపై;
పూలపై యీనుకుని తళుకుజిలుగులుజేయు మిణుగురులు
నీ కాలి బంగారు గజ్జలేనా! ప్రేయసీ వెనుదిరిగి జెప్పిపోవే!
వెనుతిరిగి చనుతెమ్ము వెన్నెలతో నేతెమ్ము
లయలగలదానా లాలిపదాలదాన!
వెలలు దాటివచ్చితిని నీవురావా?

★ ★ ★

ఓ సౌమిత్రి!
రాడదేమోయీ! విశ్వామిత్రుడేడోయీ! పోయి
స్వయంవర
వైదేహీవయోవిలాసలాస్యలావణ్యధనువు
ధరించుటకు
నర్తనలతో భుజకీర్తు లదరుచున్నవి, రెక్కలువచ్చి
ఉప్పెనలెత్తుచున్నవి!!

తల్లివలె చల్లని కనులతో జూతువుగాన
తల్లీయనగ తప్పలేదు!
చెల్లెలివలె చనవుమీర సరసజేరుదువుగాన
చెల్లీయన చేటురాదు.

మేధామద విదళిత వికసితవుగాన
మైథిలివందు!
ఆత్మాంతరమున 'విట్' దేహవాసివిగాన
వైదేహివందు!
చాళుక్యహాయసాల చినచోడాంబవుగాన
సాలగ్రామసీతవందు!
కుండలినీ షట్చక్రతతికి యధిపతివిగాన
క్షేత్రవలివందు!
అందును, ఎందునులేని నామముల నేరికూర్చి
గడియకొకరీతి పిలుతు
అదియునుగాక అన్నిటికి మిన్నయౌ
శ్రీవి నీవేయని
పురుషకారమే పరశురామమందు! నేనేరాముడ!
ఇదియ నాయింగితము
ఇదియ నావిష్ణు సంగీతము!

తిరుగంధ జలకలశ హస్తయగు కలధౌత పాదుకల ప్రభాతదేవి వలె,
తిరుగంధ జలములు గల కలధౌతపాత్రపై కడియాలతో లలన
నృత్యాలద్రొక్కగా వెన్నెల్లో, ముత్యాలురాలినవి వెన్నెల్లో,
మ్రోగినవి తప్పటడుగుల విడెపు దండకడియాలు!

కూర్చిన ముత్యాలకుప్ప చెదిరినరీతి,
రంగైన రత్నాలరాశి పరిచినరీతి,
చిలికిన జలకములు ఒలకగా గాలిలో చినుకులైనై!

కడియాల జవరాలి తప్పటడుగుల విడెపు దండకడియాల మేల్కొల్పునకు
నా యడదవీధిలో ముత్యాల నామనసు ముగ్గు
లేసింది! రత్నాల నామనసు రంగు
లేసింది! జాగారాల నామనసు చెంగల్వ
రంగవళులల్లుకొని నిరీక్షించినది–సంక్రాంతిగౌరి కరహారతుల మురిపెములకై!

కోయిలల కూయిలై పోయినయ్యి!
వాలుకొమ్మల పైని కలలలో తిరుగుతూ
ఏవాడ నీడనో
ఏకాకి జీవులై
ఏడనో
పున్నాగ గ్రీవులై
కష్టనిష్ఠూరాల ప్రాణులైనయ్యి!

"ఈవెన్నెలరేయిలో" భావాలు పొంగుతూ
చంద్రికలతో కలిసి మబ్బులో పెరుగుతూ
ఈవెన్నెలలో నన్ను ఊపుతున్నయ్యి!

చంద్రుడా! నాశరీరమొకదానినే
"ఈవెన్నెలరేయిలో" నిశ్చేష్టిగా జేసి
కలలోనాతలపు
ఇంద్రధనస్సై
నావలపు
ప్రేయసిమనస్సై,
సప్తవర్ణాలై యామెనొకదానినే,
నా హృదయమందు చిత్రితము జేసి,
నా మనోరాగ మంజూషగా జేసి,
సర్వవిశ్వమున ఆమెనొకదానినే

నా సంగీత సర్వవిషయము జేసి,
సప్తస్వర నాగస్వర మెత్తితిని
"ఈవెన్నెలరేయిలో" భావాలు
రాగాలాపనలు జేసినవి!

గలగలల వాలుకొమ్మల పైన మేలుకొను
కిలకిలల చిలకపలుకులు విని
మేల్కొను విలవిలల కోయిలకూయి
విని మేలుకొను నామనసు, వాసంత ఉదయ
సమయమునందు, వాలుకన్నులతో,
కోయిలగొంతుతో, చిలకపలుకులతో,
రాదారిపై బోవు రాచకన్నెను జూచి "వాదాడి
వస్తినే చెంచీతా!" అనుటకై ఆరాటపడుతుంది;
వెర్రితో నామనసు
గలగలల కిలకిలల
విలవిలల వన్నెలతో
వసంతాలాడ్తుంది!

ఇసూృలసోలుతో సేదకైవాలు నాశరీరము
మధ్యాహ్నపు వేడినిట్టూర్పుతో
రాట్నమై ఊహాపోహలను వడుకుతుంది!

గలగలల వాలుకొమ్మలపైన చేరుకొను
కిలకిలల చిలకపలుకులు విని

చేర్కొను విలవిలల కోయిలకూయి
విని, చేరుకొను నామనసు, వాసంత సంధ్య
సమయమునందు, సోలుకన్నులతో
కోయిలకంఠపు చిలకపలుకులతో
రాదారిపైబోవు రాచకన్నెను జూచి "ఏవూరి
కమ్మరీ చేసినాడేభామ నీచేతి యల్లులూ," అనబోయి
వెర్రితో నామనసు
వేయి ఊహలమనసు
వాలాడు వెన్నెల్లో
వెలవెలా పోతుంది!

★ ★ ★

ప్రేయసీ! నిన్నూచి నీవాలకపు పోలికల జూచి నాచిత్తప్రవృత్తులు
తిల్లాణ తాళయుత గీత సంగీతముల తేలుతూ తురీయావస్థతో
ప్రతిధ్వనుల జేయ, తురీయ జగదనుష్ఠాన గంధర్వదేవతలు
గుమిగూడి వచ్చి నృత్యాల ద్రొక్కినారే!
వెలలేని ముత్యాలహారాల వెదజల్లినారే!
ముత్యాలు ముగ్గులైనయ్యే!
నాచిత్తప్రవృత్తులు సిగ్గులైనయ్యే!

నునుసిగ్గుల
చిరునవ్వులు
రాలగా,

చంద్రికల
జల్తారు వ
ల్లెలతో,

చకోరాలు
ఆడుకున్నవి
పాడుతూ!

పూపలవల
చిరు చలవలు
వీవగా,

గంధర్వులు వెన్నెల్లో విభ్రమపడి నిమీలన నిమ్నులైరి!

ప్రేయసీ! ని న్దలచి, నీవాల్గన్నుల బిలిచి, వలచి, వెన్నెలై నామనసు,
గంధర్వదేవతల జగతిలో, ముత్యాలముగ్గులగు చంద్రికల చేమంతి
వనములో వాలాడి, పల్లవీ వల్లవోల్లాసానుపల్లవీ రాగముల
తీయ, దేవతలు జాలితో వెల్లువలైనారే!

ఎడలేక నిన్పిలుచు వడగాడ్పు సడిగుండె
వలపులు, వడగండ్ల వలపులైనయ్యే!
వడగాడ్పు వడగండ్ల వెన్నెల విన్నావే?
వెన్నెల్లో
వడగండ్లు
రాలినై!
వెన్నెల్లో
వడగాడ్పు
వీచింది!
వెన్నెల్లో
నీకై నీ
చూపుకై
నామనస్సు
వగలాడి
వెలవెలా,
వెన్నెల్లో విడిపోయి విడి పోయిపోయి ఎగురుచూ వెలిసింది!

మంచుబిందువుల ముసుగులో మల్లెపూవులవలె;
చిరులేత దుకూలముల జలతారు విరులవలె;
జలజలారాలిన వేవేల చేమంతి రెబ్బలవలే;

రావేయని వాపోవు గజప్రాణోత్సాహియై వేగ,
శ్రీపరిచేలాంచలము విడక, పరుగెత్తు హరివెనుక
శంఖమూ, చక్రమూ పరివారమూ గలసి శ్రీహరుల
వెన్నాడివచ్చు అపాల్కడలి కెరటాల తరకలల్లే

పూర్ణిమాచంద్రికల తరంగాలుప్పొంగిపారగా,
రావేయని పిలవగనే పర్వెత్తివచ్చు నిన్జూచి ఉప్పొంగి
ఉయ్యాలవెన్నెల్లో నామనసు ఉబలాటలాడింది;

రావేయని పిలచినది నేనేయని తెలుసుకొని, సిగ్గుతో,
పరివార సహితుడై పరిహాసాస్పదుడై పోవు శ్రీహరిని
నేజూచి నీకు చూపించి నవ్వించి నవ్వగా
ఉయ్యాల నామనసు ఉర్రూతలూగింది!

మదనపంచమి నవ్వుచినుకుల కోలవెన్నెల్లో
ఒప్పుకుప్పల నవ్వుమూటల నాగకన్యలు
పాడుతారోయి నవ్వుమూటల కీరవాణులు
ఆడుతారోయి కీల్జడల కొప్పుకోలాటం!

అడుగడుగు పడుగు పేకల అల్లబల్లగి అల్ల
వేరుపోతే వడకపెండ్లిండ్లోయి! మెల్లగ
దగ్గిరిలితే పెండ్లిపెండ్లిండ్లోయి! చల్లని
మదనపంచమి నవ్వుచినుకుల కోలవెన్నెల్లో!

కోలవెన్నెల్లో పూలతావుల పిల్లవాయువు,
నాగకన్యల, కీరవాణుల, వాల్జడల
కీల్జడల నవ్వుమూటల పిల్లవాయువు,
వేళాకోళం మరదలల్లే చెవిలో కొక్కొరోకోయి మని
పిలిచి పోయిందోయి!

★ ★ ★

రంగురంగుల రథసప్తమి!
వెన్నెల్లో రథసప్తమి!
త్రిపురాసుర రక్తముతో
రంగురంగుల రథసప్తమి!

కంగుకంగున గంటలతో
అమరావతి నగరంబున
ఉత్తరమున వెన్నెల్లో
పారువేటల రథసప్తమి

రంగురంగుల వస్త్రంబుల
ధరియించిన రక్తారుణ
నేత్రంబుల శంకరునికి
రంగురంగుల రథసప్తమి.

రంగురంగుల రణరంగపు
జయహారము కొనితెచ్చిన
వీరులకే వెన్నెల్లో
హారతితో రథసప్తమి!

రంగురంగుల రణరంగము
వెళ్లిన నే వచ్చెదనో
రానోనే, ప్రియురాలా,
రంగముకాదిగనే వెన్నెల్లో ఇవ్వుము నీహారతి!

★ ★ ★

పాలలో వెన్నెలవలె, పైడిపళ్ళెములోని జున్నువలె,
జాబిల్లి మబ్బుపై మోహినీరూపియై నామనసు
రంజింపజేయ వెన్నెల్లో,
కొంచెమై నామనసు వెన్నెల్లో
పిచ్చెత్తి వెన్నెల్లో పరుగెత్తి వెన్నెల్లో వర్ణాల విరిబారి,
సౌవర్ణ వీణయై
రాగాలాపనల జేసి, నీ చిరునవ్వు మందార చెక్కిళ్ళ
నునుసిగ్గు చిరుపూతలన్నూచి, చిదుముడుల
నామనసు వెన్నెల్లోన,
బాలా! నిన్నూచీ, విరి
వాయు వొయ్యారముల ఊగి నీపైట జారగా,
జాబిల్లి జతవంటి
చన్గవల జూచియూ, చీరియూ, మందార మకరంద
మాధుర్యముల దేలు మధుపంబునగు నాకు జాబిల్లి మాదమేలా!

★ ★ ★

విరిగిన పాలతరకల తీరు విచ్చుకొను చంద్రికల
చాయ చామనచాయ నీతొడలపై చిగురించగా,
చిగురులో చిరునవ్వులున్నవని తొడపై తలవాల్చి
నిద్రించితిని; చంద్రికల చిలుకు చూపులను నాకనుల
పై కురిపించితివి; కలలలో, ఒరిగిన పెరుగుతరకల
తీరు, వేరుకొను, చంద్రికల చాయ చేమంతిచాయతో
నామనసు వ్యాపించినది, అందు పరాచికాలకు
వేగువీచికలతో ఊగు విరులవెన్నుల వలె,
వెన్నెల వెన్నులు, వరసగా వాయిగా, వేవేలు
వ్యాపించినవి! -- ప్రేయసీ నీచూపులో
తోడు కలిగించునది అదేదోఉన్నదే! అదేమిటి దదేమిటే! ఏమిటే!

ఈ సుదిన ఉదయాన నా సదనఉద్యాన వనములోన
మెల్లని గమనముల ఒయ్యారముల వెలదుల
సిందూర తిలకముల,
నెమ్మోవి హాసముల ఎన్నెనో జూచియూ
బాలా! నీనెత్తావి నెమ్మోవి కానరాలేదనీ,

నాగుల్లచవితికి నిగనిగల నాగమై వెన్నెల్లో,
నామనసు, నెలవంకవంపుగా పడగెత్తి,
ఉదర కుహరమునుంచి
వగవగల ప్రణయాగ్ని నిట్టూర్పుల
బుసబుసలతో లేచి చంద్రికల చూచె! చూచె!

అడుగులైనై నావి! చవితిచంద్రుని చూపు
చిగురించినది మొదలు
చతుర్ముఖుడ నైనాను! చవితిచంద్రుని చాయ
కనుల కన్నది యాది, నిలువుటద్దములోని
నిట్టూర్పు నీరులాగ, నీలాపనిందనై,
కాటుక కన్నులకు, కాలాల కబురులో
మరుగునైనానే!

లలనా! వెన్నెలవేళ తీయని ఏలపదాలూదు గాలిలో
గంధర్వుల గానకళా కౌశల్యము న్నేర్చితిని; వెన్నెల వచ్చెను;
నీవు లేవు; గద్గదికముతో నా ఏలపదాలు బయల్వెడలి
అల్లిబిల్లులను తిరుగునేమే? మరల నాదరికే ఏగుదెంచి
ఏలలు ప్రతిపదాల ఊదునేమే? ప్రతిపదముల శబ్దమందు
వినంబడు నవ్వులు హాస్యమునకా! ప్రణయముతోనా లేక
ఆదిశ పొలిమేర మీద లోకులు జేరి జేయు అపహాస్యములా?
కాక, అటు, ఆటలనాడు దయ్యములు, విశ్వమున ప్రణయములేమి?
వెన్నెలలేమి? యని చేయు కరాళ హాసనములా? పల్కవేమే?

★ ★ ★

ఝంఝూమారుత ఝర్ఝరీధ్వనులు జముకుచు జముకుచు
అలలై, లయలకెరటాల రీతి ఎగురుచు విరిగిపడుచు పోయి
జాబిల్లి ఆలయ ఆవరణమును జేరి మేళము జేయు సమయాన
గాజుల ఝణత్కారములు గూడ వినబడును, ప్రేయసీ! ఎవరివవి?
ఆ కా శా న
నిగనిగల నీలిజుంజురులు జిగి యల్లుకొని
భ్రమరముల నాహ్వానించుచున్నయవి, ఆనీలి
జుంజురుల జిగి
జాబిల్లిదేనా? నేనా నమ్మనది! పోనీ, అల్లికలు దగ్గిరిల్లి దగ్గిరిల్లి,
కొప్పు కుదిరిన పిదప, జలజల జారి మిగిలినవి చంద్రికల ప్రోవులా?
ఐన, నాచేతులలోని కేలాగీ జాజిపూవుల మాలికలు వచ్చెను?
ప్రేయసీ! పరిహాసములందు స్త్రీలు బహూటక్కరు లందు నీవు గజటక్కరివి.

అటు నిటు శుక్ర బుధులు కావడిచిందు లాడ
భాసిల్లు భాస్కరు పగిది,
గంగా పార్వతీ సతీ పతివౌ ఓ మహాశివా,
నాళిం జెందె నామనము ప్రియురాలి కొర
కనశన వ్రతము సల్పి ఉద్యాన మయ్యె హృదయము!

కటి నున్న యీ మన్మధ బడబానలమున కోర్వజాల!
జయించుట కిమ్ము నీ త్రినేత్రమును,
తుద కనుగ్రహింపుము పాశుపతాస్త్రమైన!

• * •

ఏడోయీ అబ్రహ్మ మున్నాదినే
యేలా వ్రాయగలేదు నెన్నుదిటిపై
నాకు న్నామెకు ప్రబంధమౌ నటుల?
పుట్టిన వెంటనే నోటన పెట్టుకొనియె వాణిని,
అచుప్పనాతి కెవ రోయీ యిచ్చిన దీ విశ్వనిర్ణయము?
ఇచ్చిరా, ఆతనికే జాతక నిర్ణయముల్ గూడ — ఛీ!

• * •

ఏ మహాటవి జొచ్చెనో నామనస్సు, ఏ చండమహాసేనుని
భద్రగజంబు భ్రమ ల్గొల్పెనో!
నీ యడుగుల నడుగు వైచుచు ఏ వ్రేపల్లె వాడలో
దారి దప్పెనో, ఆ శనైశ్చరు మరుని యురులకు
జిక్కక శంభుని మాడ్కి ఏయడుసున విడిసెనో!
కామకళావిచార నిమగ్నత కరముల్ బాసి,
లక్ష్మీనరసింహ స్తోత్ర లక్ష్యమున నుండెనో!
నాయందు లేదు, ఎందున్నదో యెరుగుదువా ప్రేయసీ!

అట అట జేరి యారాటపడుచు చిత్రించితి
ప్రేయసి ప్రతిబింబమును నామనసుపై ఆ యెలనాగ
మోము వీక్షించకనే వినుమాటలు బట్టి!
చూచితి నొకనా డాసుకుమారి నొక తరుశాఖాం
తరమున నేకైక రూపమున నుండె నామెయు నామనో
బింబ మని మూర్ఛిల్లితి ఆనిముసముననే ఈరోజు
వర కావేళకు సరిగ మూర్ఛిల్లుచుంటిని! కలలో
నిట్టి విచిత్రములు గలవా!

• * •

నాకు నేనే రావణుడ నేమో యనునటుల
అణచిన నణగక చంచలమై దశముఖముల
చూడ్కులు నిగిడించు నాచిత్తముపై నీ చిరు
వీక్షణ కటాక్షముల కటారి పోటులు
శిరముల ద్రుంచుగాని మరల న్మరల

ప్రాణములు వచ్చు, అటుగాదు నీ హృదయ
వైకుంఠమున నున్న మూలబలముతో
నొకేసారిగ వేయుము నా గర్భకుహరాంతర
కుండలినీ నాడిపై, నీయందు గలియుదు
వివశప్రాణినై నెచ్చెలీ సీతా!

• * •

ఒకమూల పులికాపున చూచితిని! ఆమూల
క్రీగంట గాన్పించితివి! వేరొకమూల వేయి
నయనముల వాడ నైతి! ఎదుట న్నిల్చి చూతును
గదా తల వాల్చి తిరిగి తిరిగి చూచుచు నీవు
నిలుచున్నచోట నొక చిరునవ్వు విడిచి పోతివి!
విడువలేక నే నాస్థలిని దొంగగ త్రవ్వుకొంటి!
కలలోగూడ ఇట్టి పరిహాస మేమి సీతా!

• * •

మింటజూచి యా నీలమేఘచ్ఛాయలు నీదు పయ్యెద
చెంగులో చెంగుల విసరులో యని తలచి వలను
పిట్టలు తన్నుకుపోవ నేలపై పర్విడు బోయవాని
పగిది కొనయూపిరి యాసతో పర్వులెత్తితిని!
విసిగి వేసారి నిట్టూర్పులతో నిలబడిన నాకు
కనుచూపు మేర నెటుతిరిగిన నేవేవో అవేవో
నీ మేని కళలే కనుపించును -- అదేమదేమి ప్రేయసీ?

• * •

తొలకరిమెరుపు చాయల జల్తారు చీరె చెరగు
హొరంగు తళుక్కుమన ఒయ్యారముగా సందె నీడ
జాడలలో నటునిటు తిరుగు నీవు సంధ్యావందన
మొనరించు నా దోసిట జలముపై ఛాయాదేవిగ
అగుపడితివి! తదేక ధ్యాననిమగ్నుడనౌ నేను
చీకటి కమ్మినను దోసిలి వదలలే దందలి నీబింబము
మాయలేదు! నీవో -- నూతన వసనముల వికసించి
క్రొత్త యొయ్యారముతో ప్రభాతదేవివై యగుపించితివి!
నీదు కుంతలాక్రాంత కుంకుమ తిలకమును జూచియే
గదా వదలితి అర్ఘ్యప్రదానము ప్రేయసీ!

• * •

తలవాల్చి నిదురైన పోవలేదు నిన్ను కలగనిన
వేళనుండి ఉదయాస్తమయములు తెలియవు
నాకు — నీకేమైన తెలియునా సూర్యు డెటు పోయె
నో చంద్రు డేడో! ఆ ఒక సూర్యుడు సమస్త
జీవులకు తానొక్కొక్కడై తోచునని గదా యం
దురు! నా రూపురేఖ గైకొని యేల నీకగు
పడడు? ఛీ యాతనితో స్నేహ మేల — క
ళలకు నిగ్గు కనుపించిన వారి నెల్ల సిగ్గుపడ
జేయు! కాంతల మనఃశ్శీతలములకు (సీతా
విను విను!) కామవికార కారముల నిచ్చు ఆ
తారాధినాధుడు కలిగించుగాక నాకు న్నిదుర
నీ బాహులతా పర్యంకమ్ముపై!

• * •

నిబిడాంధకార జీమూతవాహనుడనై ప్రి
యురాలిని వెదకుచు వీధులన్బడితి వీధు ల్వన
ముల జొరబడియె! అట నొక పున్నాగ మానును
కౌగిలిడి యది కఠినమై తోచ ఏమో
ఎప్పటికైన యాపె యిట కేతెంచు నేమో
యని ఉదయమౌ సరికి దానిని సున్నిత
పరిచి సహృదయ జేసితిని!

• * •

నినుం జూచినదాది నిమీలిత నేత్రుడనౌ నాలో
కుండలినీయోగవిలాస ముల్లాసము జెందె!
షట్చక్రములు సక్రమములయ్యె! తెరచాపగ
పడగను విప్ప శేషుని శయ్యాతలమున నీవు
వీణామృదుపాణివై ఈపాలకడలిని దాటుమని
కేరింతలాడుచు పోవుచుంటివి! దరిజేరుటకు
ఎండమావివలె దూరము సరాసరి యయ్యె శాప
గ్రస్తులమో మనము ప్రేయసీ!

• * •

నయనముల నలకలు దీయ జాలు నేవళములౌ
నీపాదాంగుళములను శాలుడనై విశాలహృదయ
ముపై నెన్నడు మోతునో యని దినదినము వెన్న
పూసి సున్నితముగ జేసితి నాయెదను విదియను

మాయను జెందె నామనము! మఱుమాయల మారి
ఆ ఆ రాకుమారిని గాంచి మోహిని వెంట నంటు
మహేశుని మాడ్కి దిగంబరి యాయె హృదయము!
కటుకటు మని గుండె కొట్టునపుడెల్ల అటు పోటుల
కెరటాల కట్టిటులౌ నావవలె వగపుటూడ్పులతో
తనువు తూలుచు తేలిపోవు నాహా! ఆహా!

• * •

దాగుడుమూత పడ వీ మనస్సంచారములు!
కత్తెర బెట్టినన్ తెగవు! ఎక్కడ కేగుచుంటి రని
పోవునపు డడిగిన నవి పకపక నవ్వు! అక్కడ
నేమి చేసితి రన సిగ్గుచే నోరమోమున లోనికి
జొత్తురు వెంటనే యుప్పెన వచ్చినట్లు మహా
ర్ణవమి పిల్లలవలె అల్లరి చేతురు ఈ హృద
యమునకు నీతి యెక్కడ ప్రేయసీ!

• * •

బాహువులకు ఉష్ణ మెక్కె! మనము పెన మయ్యె!
ప్రణయాక్రాంత విద్యుల్లతలచే హృదయ
యంత్రము లారావముల్ చేయుచు మెరుముల్
చెలరేగ నోర్వజాల నీబాధకు! అంగజా! నా
యంగిట నెంగిలిపడిన నీ వాయంగన కొక ము
ద్దిచ్చి రమ్ము! రాజులు కత్తికి బాసికము కట్టరా!

• * •

తరుణు ల్లేరె వేరు నిన్నే తలచి యేల యీ
దుర్గతి నాకని క్లేశ మొంద నొకనాడు
ఆనాడు మాత్ర మిచ్చితి వొక మందహాసమును
దాని శిరసా వహించి, తన్మయుడనై, తనువు
కూలగ నేల బడితి -- శివపాదాంగుళముచే
నొత్తబడిన కైలాసశైలము ఎత్తి ఎత్తలేక
పడిన రావణు విధముగా!

• * •

లేదా నీ కిసుమంతయైన ప్రణయ విచా
రము -- నాకై నేనే నిను వెదకుచు వచ్చి
ఈ కలలో కనుగొంటి నిక
విడువజాల నిను --విడువజాల నని తూ
ష్ణీకరింతు వేమో!.... ఐన ఎన్నా ళ్ళా
జనకగృహ అశోకవన దుఃఖము నీకు నా కీ
దర్భశయ్య సీతా?

● * ●

ఎందులకు కుందలబడుదు వీవు నే లేనా నీ
వెనుకనే యంచు పదిలముగా పార్శ్వమునకు
జేరి వీవు జరచుచు మక్కువ మీర చెక్కి
ట చెక్కిలి జేర్చవలె గాని తగు దంచు నీ
మది నీకైన దెలియక నట నేకాంతముగ
నీవు నిట నేకాంతముగ నేను ఏల
యీ ఏకాంతవాస కంసచెరసాల?

● * ●

సీతా! న న్నీచెర విడిపింపు మిపుడు -- అపు
డు నే విడిపించెద!

● * ●

నిను చూడగనే ప్రణయి ఉదయుడయ్యె!
ఆ బాలు నిట తెమ్ము దోసిట నిమ్ము గాసిలి
పెంచి పెద్దగ జేసి ప్రేమి యని పిల్తుము గాక
వాని నీ యాశా ప్రవాసమున మక్కువ
తీర సాకుదము లేకలేక లేక కలిగె
యాతడు ఉర్విని లేని ముదము నిచ్చు
మనకు పాణిగ్రహణ మౌనంతవరకు
అంతవరకు.........

● * ●

ఒకనా డాలేమ వాల్జెడ విడుచు, నొకదినమున
నొప్పగ కొప్పువెట్టు, అభ్యంగన మాడిననా
డారవేయగ నిగనిగలాడు కురులు కురుల
నడుమ గల ఆ ముఖము గ్రహణాభ్యంగన

మాడిన జాబిల్లి బోలు! ఇవ్విధి వేర్వేరు గతి
నా మన సంతలోన కవిత గీతా తరంగముల
నుత్తుంగమై అంతన ముకుళించి లయించు
పడతే నీ బాధకు విద్ధాత్మకుడనై!

• * •

ఏ ప్రవరాఖ్యుడేని నీ మనోలగ్నతను నగ్న మొన
రించెనా వచింపు మాతని రూపలతా విలాసమున
వికసించి వచ్చెద నోమచ్చెకంటీ! నీతో స్నేహ
మున కెయ్యది సూత్రమో బదులు పలుకుము!
విరసన విరసప్రవాహమున నీట ముంతువో,
అధర మధురారసంపు వసపల్కుల పాల ముంతువో
ఆ పుణ్యాపాపములు నీకే నీ వశ మైతి నన్ను
ఏమి చేసిన సరే! ఏం చేసినా సరే! సరేలే!!!

నిరాశా నీరస సముద్రాంతర్గతం బయ్యె నా
మేధ స్సైంధవము నే కపిలుడు బంధించెనో
కాకోలమున, నాతని కనుంగు కూతుర వేమో
నీవు! నీ కపచారము సల్పెనా నా మనస్సంకల్ప
రక్షకసైన్యము? -- కానీ నీకిసుమంత యైన
ప్రేమ గలదేని నీకు మురిపెములు చేయడా
యతడు? రుషి యైన కణ్వుడు చేయలేద?
కేలు కేలు గల్పి సాష్టాంగ మొనరింత మతనికి,
రమ్మా, భక్తి మెయి నే భగీరథుడ నయ్యెద ప్రేయసీ!

• * •

దారులు పదివేలు లేవు నీ మనఃపద్మవ్యూ
హమును జొచ్చుటకు! గడి గడికి గడియకు
ఏ యతిరథ మహారథు లడ్డెడుదురో
యుద్ధమునకు నే నొంటరివాడ! మత్పూర్వు
ల్పిత్రులు లేరు బీడుపడిన యాకలి
సంగ్రామభూమి ప్రవేశించితి బాలకుడ
నైన నేను! వెనుదిరుగుట రాదు మా
వంశమున! ఆరంభించిన కార్యమాపుట
మాయింట స్లేదు! అయిన, ఐనను, అన్నిటికి
నిన్నే యుత్తరవాది జేసి నే డీకొందును
దారులు పదివేలు లేని, కోటి

మూటపదారు దారులు లేని, నీమనః
పద్మవ్యూహమును ప్రేయసీ!

ఏ వెనుకటి జన్మముననో కూడుంగూడు
కాపురము చెడగొట్టితి! లేనియెడ ఈ
విడబాటేల నాకును ఆమెకు! కన్య లనేకులకు
వివాహము జేసెద చేతులారంగ!
ఈయంగన మాత్రము నాకే ఒనకూడ
రాద! ఒనగూడి రావా సీతా! రాని
యెడ నీవేమో సుకుమారివి గావు!
[(కర్కశ) (కఠిన) (కఠోర) (శిలా) (ప్రతిమవు!)]

• * •

ఇది యే మన్యాయమే! సుమతులు చేయు మంత
నము లివియా! అంతలో నవ్వి అంతలోననే
దిగ్భ్రమ చెందితి వాశపెట్టి యాకాశము
చూపుటకు నేనేమి బాలకుడనా! నీ కది
తెలిసీ తెలియని గర్వమా, తెలియక తెలియు
ననిపించు నాగరిక శృంగారమా?

• * •

నావేదనం దెలుపుటకు దూతికా మరాళములు
లేవు! ఇది నల దమయంతుల యుగంబు గాదు!
వలపు తలంపులతో పలవించు నా యడందలోని
రసగంగాధరీ ఝురులు వలపు విలాసముల
కింకను సొర మొనగూర్చు! అక్కడనే జనించి
అక్కడనే యుగిరిపోవు నిర్జన శైల వాపీ తటంబుల
పైరులు నా విచారములు! భావనారూఢవై
యేల యింక నీ యశ్వమేధ యాత్రలు మనసా?

ఏయాకేనియు చలింపని ప్రమానికైవడి నిశ్చేష్ట
మాయె నాతనువు తను ఉద్దీపింప నెట
నుంటివో ప్రియ! గీతారహిత భారత గతి
నీరసమయ్యె నాహృదయగ్రంథము -- నీహృద
యమున నేయే వ్రాతలు గలవో ప్రియ! విగత
కౌస్తుభాభరణ అశ్వత్థామ శిరము పోలె నిస్తేజ
మయ్యె నామస్తకము -- నీప్రేముడి ముద్రలేక!

కృష్ణుడు లేని యర్జునుని రథము విధి నా జీవిత
మెటకో యీడ్చుచున్నది గదే ప్రియా
ప్రాణేశ్వరీ! నీ విసుమంతయైన లేని నా
వక్ష స్సవతారత్వమున విష్ణువు లేని వైకుంఠ
మయ్యె! జాలి కల్గదా!

• * •

హృదయమా! ఈ నీ పద్యరచన లామెకు చేరవు!
చేరినను ఆమె చదువబోదు! పిమ్మటనైన
నిర్మల ప్రణయోషః పీయూషధారలచే
ఉప్పొంగు నిన్ను తెలుసుకొనజాల దిస్సీ!
బాధలు పొందుచు నైన విడువక వ్రాయు
రచన లివి యేల! ఏల యీ మువ్వజవ్వనము!?

ఆనదికి అద్దరిని ఇద్దరం కలుద్దాము
ఇవ్వాళో రేపో!
అంధకారము దాటి అద్దరిని కలుద్దాము
ఇవ్వాళో రేపో!
అద్దరికి జేరుకొని నాగస్వరము ఊదుదాము!

ఆదరీ ఈదరీ స్వరముతో ఆనందమయ మవగ
ఆనదీతరంగాల నీది, ఒడ్డునకు ఎగబ్రాకి, అలిసినా
సొలిసినా, అద్దరిని కలుద్దాము!
కలవకన్నుల వలె, కోల వెన్నెలలో, కలిసి మెలి సుందాము
ఇద్దరం అద్దరిని!

• * •

ఇటు వెన్నెల
వడి శిరసుకు
ఇటువెన్నెల
చిరునవ్వుల
ఇటు వెన్నెల
విరులల్లిన
ఇటు వెన్నెల
చెంగల్వల
ఇటు వెన్నెల
ఈశ్వరునికి
ఇటు వెన్నెల
ఆకాశము

అటు వెన్నెల
శ్రీ వెన్నెల
అటువెన్నెల
కల వెన్నెల
అటు వెన్నెల
జడ వెన్నెల
అటు వెన్నెల
జిగి వెన్నెల
అటు వెన్నెల
తల వెన్నెల
అటు వెన్నెల
మొల వెన్నెల

ఇటు వెన్నెల　　　　　　　　　　అటు వెన్నెల
　　మనసుల్లో　　　　　　　　　　　　మరు వెన్నెల
ఇటు వెన్నెల　　　　　　　　　　అటు వెన్నెల
　　ఎటు చూచిన　　　　　　　　　　　కను వెన్నెల
ఇటు వెన్నెల　　　　　　　　　　అటు వెన్నెల

పిచ్చెత్తే వళ్ళంతా వెర్రెత్తే దిక్కులకై పరుగెత్తే నా మనసున
వెన్నెల్లో ప్రేయసిలేక
అమావాస్య!　　　　అమావాస్య!　　　　అమావాస్య!

మ హా ల య　అ మా వా స్య!

వెన్నెలలు వల్లెవాటు వేసి
　　వల్లెవాటు వేసి
　　యాదవ వల్లెవాటు వేసి
అష్టభార్యల కళలు ఏకకళయై
　　సీత చెంచీతయై
నిశీధ సౌందర్య మూర్తి యయ్యె

వెన్నెలలు వల్లెవాటు వేయ
　　వల్లెవాటు వేయ
　　యాదవ వల్లెవాటు వేయ
మాధవుడనై — మత్స్యావతారినైతి!
　　నా మన సవినాశియై
అ.....అవినాశియయ్యె......అవినాశి!

(+ + + + అవినాశీ! x x x x)

నడిజాము వేళలో,
నడి గడియ విడిదిలో,
అడుగులను వెన్నాడి
అలసటే లేకుండ
　　　　　　వచ్చెదను!
సొక్కుతూ సోలుతూ
　　　　　　పిల్చెదను!

ఒడుదుడుకు లేకుండ
వడగండ్లవానలో,
వేడినిట్టూర్పుతో,

వెనువెంట పరుగెత్తి
వచ్చెదను!
నీనీడ చాయ కలిసి
చొచ్చెదను!

* * *

నీ ముఖమునే నీకళ్ళనే
చూచిచూచీ చిల్లులై
నీ వంకనే నిలిచి నీరై
చీకలైన నాకళ్ళ కేమీ
అగుపడదె ప్రేయసి!
ఆకసమే లేదె నాకు!

ఆట లాడే చిలక
మాటలే విందునా?
నాలోనె నవ్వుకొని
మాయగా తలచనా?

మాయలో మాయనై
చేయ గలిగిం దేది!
నిర్జీవ ప్రతిమనై
వర్జ్య మై పోనా!

సీతా, నిశీథమూర్తి!
స్ఫూర్తిరహిత వర్తినై
ముక్కనై చెక్కనై
మోడునై యుండనా!

సౌందర్యమూర్తీ
సుధాధార లిమ్మా!
నిర్విచారమూర్తీ!
నీకురుల 'కుటీచకుడ'!

కవలఅద్దాల వలె వెల్గు మన యాత్మ బింబములలో
తుదిదాక ప్రణయాగ్ని కణములను
విధిదూతల వలె కన్పెట్టుకొనుచు
ఇర్వురి హృదయాలు అలయపు ధూపముల వలె వెల్గితే
ఆ ధూప జ్వాలాంతర్గతములై
అందే యొకటిపై నొకటి మిళితమై

నూతనాకాశాల నీడ పుష్పించు దివ్య కుసుమముల!
అనిముషమున నానుండి నీలోనికి
సన్నసన్న ప్రేమకిరణాలు జొచ్చు :
చిత్త మేకమై విడిపొందు ప్రియుల నిట్టూర్పు ఊద్పుల వలె.
మోహినీ! నిశీధ సౌందర్యమూర్తీ! ప్రణయ
వాహినీ ఉష్ణవాయువులలో మునిగి
మత్తెక్కి యుండగా మన ప్రేమశయ్యయే మన మృత్యుతల్పమగు!

ఆ మృత్యుశయ్యనే స్తంభితావస్థలో దేహాల వదలి,
నీ నీడ నామనసు నా నీడ నీమనసు
వెన్నాడి, నీ నీడ నా నీడ యేకమై,
ఆ మృత్యుద్వారాల వెడలి, మబ్బుతో సాటి నీ చీర గప్పుకొని
వినీలాకాశ వీధుల విహరించు వేళల
నానాసహ్య వాసనలతో పూర్వప్రేతాలు
వైతరణీ వాహినుల అల్లాడుచూ అడిగినవి నన్ను......అంత,
నిశీధ సౌందర్యమూర్తీ! నీ చీరచెరగుతో ఉరిపోసి నాతెలివి తప్పించితివి!

అనాధబాలికల జీవాలు అనాఘ్రాత కుసుమాలు రాలినరీతిగా
నిరాధారాలెట్లో,
నిష్ప్రయోజక ప్రతిభావంతుల జీవితాలు అట్లే, నిష్టూరాలుగా
నా దేశ జనులలో నిలిచిపోయినవి!
నాదేశ జనులలో నిలిచిన నిష్టూరాలే, నా జీవితాంతం వరకూ
తరుముతున్న దయ్యాలు!
దీర్ఘాయు దీలుతో దీన వదనాలతో దూపిల్లు దయ్యాలు!
దోగాడు దయ్యాల దీనాలాపాలు
పూదోట విహరించు
క్రూర సర్పాల బుసబుసల కుసుమ సువాసనల వలే
భయాన్ని భ్రాంతినీ పురిగొల్పుతున్నవి!
నిశీధ సౌందర్య మూర్తీ!
మైమరచి నీయధర చుంబనానందితుడనైనా
నిష్టూర సర్పాల నిశ్వాస కుసుమవాసనలు
న న్నారాటపెట్టి కారాడి కారాడి నా జీవాల రాపాడు చున్నవిగదే!

• * •

మీశూరతేజాలు, మీవీర విజయాలు
మీతోనే పోయినవి!

మీస్థైర్య ధైర్యాలు, ఔదార్య త్యాగాలు
మీతోనే మట్టిలో గలిపితిమి!
అని నేను వారితో ననగా,
నామనసు కలిపేసి,
నిశీధ సౌందర్య మూర్తీ,
నీయెదమీది ధవళముల దహనమున దాసునిగ
నీధ్యాసునిగ జేసితివి!

స్వప్నాల సామ్రాజ్య దుఃఖాల రాణివి
నిశీధ సౌందర్య మూర్తీ!
ఎన్నేని నేరాలు చేసినా పశ్చాత్తప్తుడ నైనా,
సాక్షాద్రూపవతీ దేవివై,
ఏనాడు గూడా విశాలమై వెలయు
నాదృష్టి నీడనే విశ్రాంతి నీకు. ఔ!

• * •

ఓహో సౌందర్య సామ్రాజ్య నిశీధ మూర్తీ!
తరాలనుంచి వ్యాపించి వచ్చు విచార వ్యాధిగ్రస్తుడౌ
సామ్రాజ్యాధిపుని బోలుదును నేను;
తరాల విచారము నాహృదయాన ప్రవేశించి వ్యాపించి
సమాధిచేసె నాపుష్పాల శయ్యను!
నిర్జీవ కార్యాలుగా నుండు మృతజీవి నౌ నే జేయునవి!
ఏమందువా ఓ నిశీధ సౌందర్య మూర్తీ!
నారక్తనాళములో పసరెక్కి పేరుకొన్నది విపరీత వైతరణి!

• * •

బోనులో చిక్కుకొని మూలుగుతూ ఉండు
సింహాల స్థైర్యమున్నది నాలో!
వణికించు వానలూ, వేడివేడి గాడ్పులు
ఊహలై నాలో వ్యాపించుతవి!
అనంతమైన శాంతిలో మిళితమై నాయాత్మ
దుఃఖాలను స్తంభింపజేయును!

తోగాడు స్వప్నాల దుఃఖాల జ్ఞాపకము
పశ్చాత్తప్తుగా జేయు జీవునికి
ఆకాశాల అఖాతాలు తెరుచుకునే మాదిరి
స్వచ్ఛమై చొరరాని యాత్మావరణ

వికలమై నల్లనై వ్రక్కలై వేడివాయువుల
వీచుచూ విడుచుకొని విశాలమౌను.

● * ●

నిశీధ సౌందర్య మూర్తీ!
ధీరకవి హృదయమున
సిగ్గుచే తలవంచి
రాత్రివలె జీవించ
పగలు పుష్పాలు పుట్టునా!
సౌందర్య నిశీధ మూర్తీ!

● * ●

నిశీధ సౌందర్య
సామ్రాజ్య మూర్తీ!
దహనములలో కెల్ల
ప్రత్యుత్తరము లేని
ప్రణయ దహనమే
అతి దుఃఖకరము :
ప్రేయసీబింబమునకై ప్రతిబింబమున కై
ప్రియుడు రెంటికీ తర్పణములీయవలె.

చెప్పవోయ్ చూదాము ఏమాయ రూపముగ
సమృద్ధ సామ్రాజ్య శిల్పకళా కోవిదులు
శాతకర్ణీరాజు లేదారి పోయిరో!
శౌర్యోదారులై రాష్ట్రకూటులూ వీరపల్లవులూ,
సాహస ధైర్యస్థైర్యోపాసకు లాఓరుగంటి ఒంటరులు,
వాఙ్మయ పోషక విజయనగరాధిపతులు, పల్నాటివీరులు,
చాళుక్య సింహాలు, బొబ్బిలీ బెబ్బులులు, నాయక ప్రభువులు?
నిరుడు నిష్ఠతో నిలబెట్టిన, నీటిలో నీరైన, సంక్రాంతి దేముడేడీ?
ఏవోయ్ శత్రు మనస్సంభితాకారాలు దుర్గప్రాకారాలేవీ!
శోణితపు వాహినీ అల్లకల్లోలానంద రూపిణౌ
కృష్ణవేణీ ·ఉదకంబు కన్నీటి జలకంబులాయె నేమోయ్?
ఒకచే పురాణంబు నొకచే త్రిశూలంబుతో వీరశంఖారావ
ప్రచండ వాయువుల పురిగొల్పు దోర్వీర శైవు లేరోయ్?
నిరుడు నీటుతో నిలబడిన నీటిలో నీరైన సంక్రాంతి దేముడేడీ?
సౌ మి త్రీ!

నిరుడు మడిగట్టి నిలబడియు మట్టిలో మట్టియైన సంక్రాంతి దేముడేడీ?
విశ్వ మా!
నిరుడు, ఆ క్రిందటియేడా క్రిందటియేడు, సంక్రాంతి దేముడేమయ్యె?
సౌందర్యనిశీథమూర్తీ!
నిరుడు నిష్ఠతో నిలబడిన నీటిలో నీరైన సంక్రాంతి దేముడే
కాష్ఠానపోయె?

• * •

పోరాడు జీరాడు సౌగంధ సర్పాల స్వరాలు
నలుదెసల విసరగా నాట్య స్వరూపిణివై నే నుండు
కర్కశ శ్మశానముల కైలాసకేళీ కరాళతకు
భయభ్రాంత చిత్తవై సప్తప్రాకార గోపురాంతఃపుర
వైష్ణవాలయమున నీవు గర్భగుడి చేరినా
ఏదినముకైనా, వైష్ణవ ప్రియము లౌ పుష్పహారాల
వెన్నాడి నాకంఠహార మగు నాగము నీమృత్యుశయ్యనే
చేరి, ఓంకార ప్రేమలతో నాగస్వరములను వినిపించును.

• * •

నిశీథ సౌందర్యమూర్తీ!– దూరాన భ్రమగొల్పు
మృగ తృష్ణ మాదిరి శ్మశాన సైకత స్థలములో
సంభ్రమ భ్రాంతిచే నేను విపరీత బాధపడ,
గణమెక్కి సురతాగి కేరింతలాడే, ఆడే,
గంధర్వ గానాల నవస్వర మూర్తివి!
ఓహో సౌందర్యనిశీథ సామ్రాజ్య లక్ష్మీ!
నీదారుణ స్తన్య దావానలంబును
నాచేత తాగించు! తాగించితే స్వర్గ
ప్రాకారాల నరక ద్వారాల నైనా దాటి
అపరిచిత ప్రదేశ గర్భాంతమందైన
ఏవేని నూతన విషయాలు వెదకుతూ
పోయెద! నీయెదమీది దివ్య భూషణాలల్లో
నేరాలు కిణి కిణి ధ్వానాలతో నివసిల్లు!
నీనున్నని గుండ్రని కాలికడియాలలో భీతి,
భ్రాంతి, మట్టెలల్లే ముద్దుటలంకారాలు!
మృత్యుదేహచ్ఛాయా సౌందర్య నిశీథమూర్తి!
శీతల స్మశానపు ఏకాంతానందము వలె
నీతోటి స్నేహము నిర్మల విహార సమమని
నీ శిరోజశయ్యపై అని కలగనే నాకే తెలుసు!

కలగంటి నసడ భావనా స్వర్గాల
సామ్రాజ్య సౌఖ్యాల కనుగొంటి!
కనుగొంటి నీనేత్ర నీలబింబములో
నీ నా భావా లేకమే ఔనని కలగంటి!

నీ నిమ్న దృష్టి చిత్రకళలకు విపరీత పుష్టి!
నీ మందహాసములు సమ్మోహ నాస్త్రములు!
వివస్త్రవై నీవు భుజంగాంగన వలె ఒయ్యారివై
వన్నె వన్నెల రీతి ఎన్నెన్నో విన్నాణముల జేసి,
ఘనమైన వక్షువ చనుదోయి ఉబుకుచూ,
ముడివదలి చిడిముడితో విడిపడిన నీకురుల
గప్పికొని, చక్కనౌ బాహువుల పైకెత్తి భావాల
జూపుచూ, భావాల కనుగుణ్యమౌ రీతి కెంపారు
నేత్రాల అభినయించుచు, బంగారు మురుగులతో
మట్టె మోతలు గప్పి, కడియాల కుణుకుణులు
గాజుల కిణికిణులు ప్రస్థార స్థాయిపై
రాగాను గుణ్యమౌ తాళాలు వేయుచూ
మిళితమవ, ముద్దుగా లావణ్య మొప్పగా
తొడపైన తొడవైచి రింఝురిం ఝురింఖణతో
శృంగార రసధారలను చినుకు నృత్యాలు జేయుచూ
నీవు నవరాత్రి పండగరోజులలో మైమరవ
నవలక్ష నక్షత్ర రాశి జీవులు గూడ నీ
నీల శరీరంపు నిగనిగల నిమజ్జనములు జేసి
కల్లు నీళ్ళం ద్రాగి కైపెక్కి
ఒళ్ళు విరగపడుచు మత్తెక్కి
దుఃఖాల దిగదుడిచి జీవించుచుందురు!

నిశీథ సౌందర్యమూర్తి! నీవు కైలాస
వాసివైతే నేమి, వైతరణీదేవి వైతేనేమి?
నే ప్రేమించితే గాని చూచి తెలియని
స్వారాజ్య సర్వ వ్యాపకత్వము నిమ్ము!

సౌందర్య నిశీథమూర్తీ!
కలగంటి నీలీలల గూర్చి --
చిగురాకు కొనయీాన నునుపులో నుగ్గులను బోసి
చిరురేకు కొనయీాన నునుపులను విదళించు
కుసుమముల సృష్టించి,
చిరుపూత చైత్రముల చిగురించి, బీజముల
విదజల్లి, ప్రకృతీదేవివై

లావణ్యలలితవై బంగారు చాయలను నూర్వారబరిచి,
నాహృదయ మాన్యములో ఒప్పుల కుప్పవై
ఒయ్యారి భామవై
కళ్యాణి కీర్తనల కురుజంపె తాళాల నర్తనల కర్తవై
నాట్య స్వరూపివై
నా యెదను దహనమౌ యజ్ఞములో హైమవతి హోమమై
మైమరిచి కలలలో కైలాసమును జెందు నానీలి కలలలో
కీటమణి తళుకువైనావు!

• * •

నిశీధ సౌందర్యమూర్తీ!
కన్యకాపరమేశ్వరీ మనఃపరమేశ్వరీ శక్తివై
కన్యాత్వ అనల స్వచ్ఛత్వమున కాధారమై

ఆంధ్ర కన్యాత్వ ముద్ధరింపుము ఉద్ధరింపుము! "ఉత్తముని పేరేమి
ఊరి పేరేమి
సత్యవనితను గన్న సాధ్విపేరేమి?--

★ ★ ★

నిశీధ
సౌందర్య
మూర్తీ!
బీజము
త్పన్నమై
మృతయై
మృతిలో
కన్గానును
నూతన
జీవితము :
దహనమై యాత్మీయతను పొందు జీవుడు!

* * *

వేగూచుక్కా వెలగామొగ్గా
కాళ్లాగజ్జా కంఖాణముపై
కరహాట కరములతో కరవాలధారివై,
ప్రణయాట్టహాసివై,
కంఠీరవాకార కేయూర వయ్యారివై,
కూలంకషాకాళ కేళీకరాళవై కాళివై,
అనలముల కళకళల అందాలచిందువై
నాయంకపాళిలో దహనమైతే నీవు
పరపురుష రహితముగ
ఇల అనలముల జల్లి
దహనమయ్యేదను ఎదపైని ధవళాగ్నిలో!
పురములో పండినగద వన్నెలం దేలుట!

నీశారీర సద్గంధ వాసనలతో మరచి నీఎదమీద పవళించు నామీద
పరిమళవాయువుల వీచుచూ పవనుండు ఆకాశ
మార్గాన ప్రాణాల గొంపోయి దూరాన విడిచితే,
నీయదమీద దహనమౌ దేహాన్ని దూరాన దూపిల్లు
ప్రాణాన్ని వీక్షించి, వ్యాకులమనసియౌను జీవాత్మ!
జీవాత్మ దుఃఖమునుజూచి పరిహాసపడుతుంది
విధికాంత; జీవాత్మ దుఃఖాన్ని విధికాంత హాసమును
వినడు పరమాత్మ; పనికిరాని పరమాత్మ ఉండేమి
లేకేమి! నాహృదయ రోదనము నాలోనే నిట్టూర్పు
విడిచితే నాకెందు కీదైవ సంబంధం? దేముడబద్ధం!
దయ్యాలు సత్యం! దయ్యాలరాణీ! నీశారీర సద్గంధ
వాసనలలో ముంచి నీనగ్నహృదయము మీదనే నిర్మించు
నా జీవభవనాన్ని! ఆ భవనాంతరాళమందొకచోట
నాటుదము దయ్యాలపూదోట; పూదోటపందిళ్ళ
క్రిందనే నాపూర్వవీరుల ప్రతిభావంత ప్రేతాల
విపరీత దాహాన్ని అర్పుకొరకై సాంవత్సరీకాలు
జరుపుతూ ఉండెదము! ఆహా! దివ్యమంగళ
సౌందర్య నిశీథమూర్తీ! నీముగ్ధ సౌందర్యానంద ప్రేరేపితుండనై
నీతోడ నడిరేయి సడిలేక నిద్రించు వేళలందైనా, నీపెందొడల
పై ఆని పరవశత్వము పొందు వేళలందైనా, అయ్యో ప్రేయసి!
నీహొందు మధ్యయందైనా, నా పూర్వవీరుల ప్రతిభావంత
ప్రేతాల విపరీత దాహాల దావాగ్ని నా గర్భకుహరములో
కుంపటై కుములుతూ కనరెక్కి కందుతూ నా జీవితాశయాల
కాల్చితే, పెద్దలైనా బుల్లిపాపలైనా, రాజులైనా మహా
రాణులైనా, గొప్ప ధీమంతులైనా నీచులైనా పరమదరిద్రులైనా

మృత్యు కరాళ దంష్ట్రాల ధిక్కరించుటకు విధికాంత వేషాల
వదిలించుకొనుటకు శక్య మేరికిని గాదనుకునే నన్ను
బ్రతికున్న బహూకొద్ది నాడులైనా, మృత్యుదేవీ తనయ
సౌందర్యనిశీధమూర్తీ! నీశారీర సద్గంధ వాసనలతో వీచి
నీయెదమీద పరిపించు నా సౌఖ్యశయ్యాతలము!

గజ్జగంటల గౌరికిలకిల
నవ్వుకళలను గిరువలపుల
నుజ్జ్వలనముల జేయగా నా
నందిపై నటరాజు
తందానతానుడై,
కాటుకల కనుమెరుపు చిరునవ్వు
తేటకై తేనియల ఊటకై,
వేటాడు జంటీగ పాటలను
మించుపాటలను
పాడుతూ నాడుతూ,
అడుగడుగు వేడుతూ,
వేడుకల వెంకటేశ్వరుండై,
వీరశైవాద్వైతప్రణయుడై,
గౌరి కర్ధాంగుడౌటకై చేయు
గారాము సివము లారవములై
వర్ణాల తిల్లాణములతో

నాలోన వ్యాపించ
సివమెత్తి పిలచితిని!
సీతా!
నిశీధసౌందర్యమూర్తీ
నీయర్ధాంగమునకై!

నిశీధసౌందర్యమూర్తినీ
అర్ధభాగమునకై
చెంచీతా!
ఎలుగెత్తి పిలిచితిని!
నాలోన నేనే

విరిజెంది వ్యాపించి
ప్రతిధ్వనించితిని!

ప్రణయ కైలాస లోకైకనాధుడే
ఉత్కృష్ట వీరశైవ వ్యక్తి. వ్యక్త్యభావమే
నిర్వాణము. నిరుపమ నిర్వాణ
సిద్ధుడే పునర్జీవితుడై, ఉత్కృష్టవీర

శైవవ్యక్తి అద్వైతలయానందమయు
డౌను. ద్వైతమేమిధ్య; విశిష్టాద్వైతమే
మాయ; నిశీథసామ్రాజ్యమూర్తీ!
మాయలూ మిధ్యలూ జీవావసరములే
గావున సత్యములు : సత్యనదీప్రవాహమున
మాయయూ మిధ్యయూ నంతర్వాహినులు.

సౌందర్యమూర్తీ! సత్యనిర్ణయముకై, మాయా
మంత్రముల యవసరములేమి? ఓహో
నిశీథ సామ్రాజ్య సౌందర్యమూర్తీ, అద్వైత
జ్వాలాఖీలాంతర్గతకణములే ద్వైత
విశిష్టాద్వైతములు. అద్వైతనిరాకార
సంపూర్ణానంద సాకారరూపమే వీరశైవ
ప్రణయము; ధవళమణి తళుకులే సప్త
వర్ణముల జిలుగులౌరీతి, ప్రణయాంతర్జ్యోతులే
షడ్విధకామమోహములు. తదధిపతులే
షట్ లోకాధినాథులు : సప్తలోకైక కైలాస
నాథుడగుశంకరునివలె సంపూర్ణవ్యక్తి
యగువానికే సర్వప్రాపంచ సమిష్టి సంద్రములో
వ్యక్త్యభావ వైరాగ్య నిర్వాణ ముదయించి
జ్ఞానియై సచ్చిదానందుడై యద్వైత లయుడౌను!

ఏడుకొండలకోట ఏడుమేడలుపైని
వెంకటేశ్వరుడై వెలిసియుండె శంకరుడు!
అలివేలుమంగవై యాంధ్రదేవివై
అవనిలో వెలుగుతూ నవతారమెత్తితివి!
వీరశైవాద్వైత ప్రణయ ప్రణవముతో
పురుషుడై వెంకటేశ్వరుడైనంత కాలమూ
లావణ్యలలితవై సహధర్మచారిణిగనున్నావు....

ద్రావిడీచన్నవల తేట కారాటపడి
అంధుడై యధమస్థుడైన తర్వాతనే,
అరచాటు చన్నవల యలివేలుమంగా!
అలిగితివి అడివిలో వెన్నెలై వెలిసితివి!--

అవు నవును అందాల అలివేలు మంగా!
పురుషత్వమూడిన మగవాని నేపడతి కోరును!
తేటతెల్లమై కల్లవెల్లియై అరాటమడిగితే
అతడే యావెనుక పాదములపై బడుచు

నీ మూర్తి మాధుర్యమునకై ముగ్ధు డవగలదు!
అనలముల అందాల దేవివైతే నీవు నీయంక
పాళిలో దహనమై పురమెత్తి శుద్ధుడవగలదు :
నీ నయన నీరాజన ధవళ జ్వాలానల కణములే
ఆంధ్ర బీజానలములై నూతనోత్పత్తి కాగలదు!

ఓహో సౌందర్యనిశీథ సామ్రాజ్యమూర్తి!
రక్తారుణప్రవాహా సమరకల్లోలములో ప్రజల
ప్రఫుల్ల సౌందర్యజీవితానందముగ్ధులం జేయుదువు!
అనంతముఖములుగల అందాల అనలమా!
నీ సయ్యాటపాటల యారాటములతో కుందకిట
కుండలంబులకాంతి బ్రహ్మాండమునకు తేజశ్శక్తియౌను!
జీరాడు వోణీల వొయ్యారముగనెత్తి వింజామరల్
వీవగానీవు, ఆశక్తి సర్వవ్యాపకత్వము జెందును.
కల్లోలమేఘాగ్నివై నడియెండలో మెరుపుతీగలపై
వసంతములాడు వివస్త్రమూర్తీ! నీశరీరముపైన
బంగారునూగారు విద్యున్మాలయై వర్ధిల్లుచున్నది!
అనలముల దళములతో వెలుగొందు నాభీలపద్మమై
నీముఖము నిత్యయౌవనమై ప్రణయాగ్ని పవనమై
నాహృదయ అంబుధీ దావాగ్ని ధవళమౌతున్నది!
ఓహో తేజమా ఓజమా ఆభీల బీజమా! స్ఫూర్జితాక్రాంతమా!
నీజ్వాలలో సకలవర్ణములునూ నిలయమైయుండును.
పలకలతో వికసించు వజ్రముల ధవళతలు, అలలుపైజిమ్మ
సమ్మోదభరితమై విరుచుకుని వెదజల్లు అంబుధులమాణిక్య
హారాలవర్ణములు, అనంతచైత్రముల నిబిడమౌ
కెంజాయ చిగురాకు పూతలో రకరకపు రీతులు,
ఉయ్యాలలూగు నీలధవళిమల మిళితమగు మంచు బిందువుల
జిలుగైన రంగులు, నీప్రేమజ్వాలలో నిబిడమై నీరుకావులదేలు!

ఓహో సౌందర్య సామ్రాజ్య విరాడ్విశ్వేశ్వరార్ధాంగపత్నీ! నక్షత్ర
స్ఫటికముల నవనవలనాడే వెలుగువై, తళుకువై, నిబిడాంధ
కారాంధ్ర దేశాకాశాన, వజ్రాయుధమువలె
ఏనాడు గన్పడెదవో దెల్పుము : త్రిపురాంతకుడనై
లేచెదను, ప్రళయకాలాభీల గర్జపర్జన్యములతో,
నిశీథ నిబిడాంధ కారాంతరాళాగ్నినగునేను....!

ఉదయోదయాలనడుమ, ప్రాక్పశ్చిమ ప్రాకారములమధ్య,
జీవితానంతరపు నిశ్శబ్దరూపముగ, మొలకెత్తుమున్నె
చీకటిలో నిరీక్షించుచుండేటి విత్తనపు రూపుగా
నీయాలయము నిర్మింపబడినది. ఉత్పత్తి లయములలో
జీవితపు హాహాకారాలు, సంతోషధ్వానాలు, నీయందు
నీవుచ్చరించే హ్రాం, హ్రీం, హ్రూం! హ్రః! అనేయుచ్చైస్స్వరాలు!
ఆద్యంతములు మిళితమై నగయు నిశ్శబ్దకాలచక్రం
బంగారు వడ్డాణరూపమై నీనాభికలంకారం. వడ్డాణమందు
వ్రేలాడు నీలాలగజ్జలే మోహాలమొగ్గలై వెదజల్లు
నాగస్వరాల – నామీదనిదురించు సర్పాలపడగలను విప్పుచూ!
శ్రీకృష్ణసర్పాలయపురూప నాట్యముల ముదమైనమనసుతో
నీవాకర్ణించి, కెరడుబారుచు మబ్బువలె పింఛాలవిప్పుకొను
పెందొడల పైకెత్తి బాహువుల ముకుళించి చిరునగవుతో
గర్భగుడి వేదిపై కుప్పించియెగయుచూ నర్తనలను జేయుదువు!
నీ నర్తనలనాలించి జీవితము వికసించు – మృత్యువే ధ్యానించు :
ఆకుపై ఆకుతో వేరుపైవేరుతో పూవుపైపూవుతో.
సంధిసంధులమధ్య వాసిల్లు రహస్యాల గర్భాననేదాచి,
ఏమృత్యువునుండి జనించి యేమృత్యువుకై తాను
పెరుగునో యాజీవితానందపుకళలను వెన్నాడుచూ,
అంధకారాంతరాళాలనుండి, వర్ణాల విత్తనాల్వికసించు!
ఆ నీయానందనర్తనల వీక్షించ, సంగీతస్వరాల నాలించి,
నాజీవి నాలోంచి పైపైననేలేచి, యావేశసుఖముతో,
పింఛాలవిప్పుచూ, పిచ్చెత్తి తిరిగేటి నెమలియై, నీలమేఖమై,
ప్రేమచే పచ్చనై పవిత్రరూపమై పమిట పరచినరీతి నున్నన నై
యుండు గర్భగుడివేదిపై, గూటిరెదికలపొంగుపీటుల
మీదపోసే పూలమాదిరి తీర్చివేసిన ముగ్గుకమలపు మెత్తరేకుల
పైన ఆడుచూ పాడుచూ వీరశైవానంద బాష్పముల
స్ఖలనము జేయగా నన్నూచి ఆనంద తన్మయముతో
ఏకాగ్రదృష్టిచే, శివలింగ భ్రమరమును దాల్చు పానవట్టము
పద్మమునుబోలు కంటితో, నెమలివలె, ఆకర్షణము
చేసుకొందువు!

నిశ్చేష్టుడనై
నిన్నే అవలోకించుచూ నివ్వెరజెందు నాయెదమీద
మహదయతో నర్దోదయాంబుధి కన్యరీతి
నురుగుల నగు మోముతో చిద్విలాసముల తాండవము
ఆడుదువు! జగమునే మరిపించు నీపాద స్పర్శకు నేత్రములు
మూయుచూ మోదమౌ మూర్ఛలో నేమునుగు సమయాన

కాలమేస్తంభించు! కాలగర్భంలోనుంచి కదులుతూ వచ్చే
ప్రళయ గర్భంలోంచి పగులుతూ పైబడే పురుషత్వము
ఒకేమారుగ లేచి పునర్జీవియై నీనృత్యతాడనం బంతతోనే
ఆపి ఈశ్వరస్వరూపధారినై నేనటరాజునై ప్రళయకాల
అభీల ప్రచండవాయువుల సంగీతస్వరముతో, భ్రమ,
భీతి, ఆవేదనా ప్రణయ ఆనందమౌ ప్రణపరాగముతో,
మోహనాకారుడనై దివ్యనృత్యముల ఆడుచూ డమరుకము
గీటుచూ,—— మధురసపు మధురముగ, విత్తనపువృక్షముగ
సంగీత రాగముగ సంధ్యారుణ వర్ణముగ, సర్వప్రపంచమూ
సర్వస్వమౌ నిన్ను నాలోనే నిలయించి మేళకర్త్ర
జన్యరాగంబులంబోలు అర్ధ నారీశ్వరుండనై, విశ్వరూపినై
నర్తనము చేయుచుండేవేళ
నాలోనే అణగియుండే నీవు
"ప్రత్యక్షం సత్యమ వాదిషం!
సోహం బ్రహ్మ సోహం బ్రహ్మ!"
"అహమేవ ప్రత్యక్షం ఋతమకారిషం——
అహమస్మి బ్రహ్మోహమస్మి!"

కపిలుడ నేనే కృతయుగ
రాముడ నేనే త్రేతా!
ద్వాపర కృష్ణుడ నేనే, కలి
విరాముడ కల్కిని నేనే!
నాల్గుయుగంబుల నలువను
నేనే! రాముడ, నూతన
రాముడ నేనే! భూమిసుతా!
సీతా! వెన్కటి ద్వాపరాంత
కలియుగాది చెంచీతవు!
వెంకటేశ్వరుడ నేనే!
వెన్నెలవేళ ఏలా యలిగి
పోయెద వలివేలు మంగ?!——

పల్లవి

అలివేలుమంగవైతే నాబాల, అందాల దేవివైతే
రావేల రావేల రావేలా!

## అనుపల్లవి

ఆనందభైరవీవై నాబాల, అర్ధనారీశ్వరముగా!
రావేల రావేల రావేలా!

## నివృత్తిపల్లవి

అనలముల పద్మాక్షివైతే ప్రణయముల పొలిండ్లతో
ఉయ్యాలఊపు లేవే, నాబాల, జంపాల జోలలేవే!

## ప్రవృత్తిపల్లవి

సౌందర్య నిశీథ మూర్తీ, నాజన్మయజ్ఞముల సోమరసధారా!
రావేల రావేలా! ఉజ్జ్వలన! ఆనందజ్యోత్స్నవై!

## చరణము

విద్యున్మాలా జ్వాలా లావణ్యవై వజ్ర జ్వాలా వన్నె విరివై
స్వప్న సుధా ధారా పారావార మధనమందు
ప్రణయ కాలకూట విషము త్రాగే
నీలగళాధారికి, ఒసే!
గంధము పూయ రావే! ఒసే!
తిలకము తీర్చ రావే! ఒసే!
హారతి నివ్వ రావే!

## చరణము

ప్రణయ గంధమాని విమానములో, ప్రేమవాయువుపై
తేలిపోదామా! కైలాసమున కై
వైభోగములతో
అల్లిబిల్లులతో
అల్ల నల్లన తేలి,
పొన్నమాని మీద పొద్దు పోదామా!

నీలోని జ్యోతియే నాలోని జ్వాలమై
నా మనసులో బాల!
నా యెడదలో
దగ్ధమౌనే, నా మనసులో బాల!
దహనమౌనే నాయెడదలో!

నాలోని జ్వాలయే నీలోన పొగబారి
నీకళ్ళ కాటుక యెన్నడౌనో!
కాటుకకళ్ళు కరిగి కాల్వలై
మానససరోవర మేలా గానో!
సరోవర తీరాన సాయంకాలాన
సంధ్యావందనమందే,
'కాయేన వాచా మనసేంద్రియైర్వా'
నీ మీదనే ధ్యానమున్నదే!
అర్ఘ్యపానీయంలో ఆనందమూర్తి!
నీ ముఖబింబమే గాంతునే
జ్యోతి పెరిగినా జ్వాల అరినా
చీకటిలో చుక్కల్లె చూతునే!
నాలోని జ్వాలయే నీలోని జ్యోతియై
నాలోని నేనే నీలోని నీవై
నామనసులో బాల!
నీమనసులో దగ్ధమౌనా?
దహనమౌనా, నీమనసులో? ఇర్వురి మనసులో!

ప్రేమ లన్నిటిలోను
'స్వయం' ప్రేమ
మాయయై మనసులో
వైకుంఠ మిదే యని
వెన్నునవే విష్ణుధనువుగ నుండును!

వెన్నెముక చీల్చుచూ
భ్రమల పురికొల్పు
విష్ణుధను శ్శరములే
భావ తరంగాలు!
భావాంతమున గదా భవప్రభాతము!

మేనియం దణగి యణగి
మన సంత 'వయమ్'
అనే అహము చేయు
విష్ణు ధనువు వంచి
చేరవలె సీతదరికి! శివధనువు ఫెళ్ళుమనును!

జన్మతో జన్మించు నోయీ
జన్మనక్షత్రము!
జన్మాంతము జాతకము జరగు నోయి!

# *వచన కవితా లక్షణ సూచనం

మాటకు మాటాను మాటల అర్థం ఉండాలి. ఉంటుంది! సమాసాలు సందర్భానుసారంగా కొంత వదులుతో ఫరవాలేదు!

వ్యాకరణంతో వ్యభిచరించటము కూడదు కాని Poetryలో కొంత స్వేచ్ఛ అవసరం! న్యాయం!

రమ్యత అనేది రంజింప చేయుట అనేది కావ్యానికి ముఖ్యము. రమ్యత అనగా ఎరుపు పచ్చనరంగులు గల రామచిలుకవలె భావమూ, రసమూ సరసగా కనబడుచూ – కలిగించు లేటి!

నిజానికి ఇవన్నీ Philologyకీ అలంకార శాస్త్రానికీ సంబంధించిన విషయాలు. ప్రత్యేకంగా పరిశీలించేవి. తత్వశాస్త్ర విషయాలూ అంతే! గాన....ప్రస్తుతం! ఈ పుస్తక ముద్రణము విషయమున

పూలపల్లి వెంకటవల్లభాచార్యులు
వేదాంతం పూర్వానందం
పణిహారం రామమూర్తి

మిత్రులైన కారణాన ఈ బృందమునకీ గ్రంథమును ఆపేక్షతో అంకిత మిస్తున్నాను!

తెనాలి,
ఫిబ్రవరి 14, 1938

\- విజయ మహేశ్వరము

---

* ఈ శీర్షిక నేను పెట్టింది. నవకవితకు నాందిపల్కుతూ, తన "విష్ణుధనువు" చివర రాసుకున్న రానున్న యుగం కవితాలక్షణం; వచన కవితకు. వ్యాకరణం – అలంకారం – రసం – ఫైలాజీలతో ఉండదగిన సంబంధాన్ని సూచనప్రాయంగా శిష్ట్లా ఇందులో వ్యక్తం చేశాడు. భావం – రసం వీటికి వచన కవితలో ఉండదగిన స్థానాన్నీ నిర్దేశించాడు. సం॥

# సంగతులు



★ ★ ★

# నవమి చిలుక మున్నుడి!

నవమి చిలుక కులుకుతూ పలికింది! పలుకులో నవ్య నవ్య కవిత్వం రాలింది! నవ్య నవ్య కవిత్వం ఇది నూతనములో బహునూతన కవిత్వం! అందుకనే ఇది పూర్వ కవిత్వం గాదు ఇది నవ్యకవిత్వం గాదు ఇది భావ కవిత్వం గాదు!

అడ్డము హిరణ్య కాశ్యపుడు! శంక హిరణ్య కాశ్యపుడు! అధైర్యము హిరణ్య కాశ్యపుడు! అస్థిమితము హిరణ్య కాశ్యపుడు!

మూలము సమూలముగా త్రెంచి హృదయ సభామంటప స్తంభము పగిల్చి మనస్సు విజృంభించి నరసింహ మూర్తిత్వము తాల్చును! అప్పుడే ప్రాహ్లాదకవిత్వ మాహ్లాదముగా ఉద్భవిస్తుంది!

అందాము ప్రాహ్లాద కవిత్వ మిది అని అందాము అందుకొని ఆదరిద్దాము!

నవమి చిలుక పలికింది ప్రాహ్లాద కవిత్వము! ప్రాహ్లాదకవిత్వములో ప్రౌఢత్వ మున్నది పామరత్వ మున్నది! దేశికి విదేశికీ నేస్తమున్నది!

ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది! పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది! తాను నిలుస్తుంది!

ప్రాహ్లాద కవిత్వములో సావిత్రీ సత్యవంత జీవితమున్నది.

ప్రాహ్లాద కవిత్వములోని గాయత్రి అందరికీ తల్లి!

ప్రాహ్లాద బ్రహ్మయే నవమి చిలుక! నవమి చిలుక పలుకులే ప్రాహ్లాద కవిత్వం! అమూల్య మూలకవిత్వం!

# చిలుక రక్తి

చూచాయగా చిలుకలకు తెలిసింది రామచంద్రమూర్తి కష్టపడుతున్నాడనీ దుఃఖపడుతున్నాడనీ!

వానరులు వారధి కడుతూనే ఉన్నారు! ఊరుకోక ఉడుతలూ పనిజేస్తూనే ఉన్నాయి! ఐనా రామచంద్రమూర్తి కష్టపడుతూనే ఉన్నాడు! దుఃఖపడుతూనే ఉన్నాడు!

వారధి కట్టటం లంకకు చేరటం సీతను తేవటం ఎప్పుడో! ఆలస్యాని కాగలేక పోతున్నాడు రామచంద్రమూర్తి!

కాలపురుషుడు రామచంద్రమూర్తి కాలయాపనానికి ఆగలేక పోతున్నాడు!

చూచాయగా తెలుసుకున్నవి ఇదంతా చిలుకలు. వాటిగుండెలు కళక్కుమన్నవి! చళక్కున లేచినవి రామచంద్రమూర్తికి సాయం చేయటానికి.

ఎగిరి లంకలో వాలినవి చిలుకలు! చూసుకో ఏంచేస్తామో! ఏంతెస్తామో! అని పోతూ అన్నవి చిలుకలు రామచంద్రమూర్తితో! లంకకై పోతూ దార్లో వానరులను చూచి నవ్వుకున్నవి. ఉడుతలను చూచి నవ్వుకున్నవి. నవ్వుతూనే పోయి సీత ముందర వాలి పక్కున నవ్వినవి!

ఎత్తుకెళ్తాము సీతా మా అందరి రెక్కల మీద ఎత్తుకెళ్తాము కూర్చో! రామచంద్రమూర్తి వారధి కడుతున్నాడు గాని ఎంత కష్టపడుతున్నాడే! సీతా నీకోసం ఎంత ఆరాటమే! సీతా నీకోసం ఎంత పంతమే! అంత ఎందుకే సీతా మా రెక్కలమీద కూర్చోరాదూ గడియలో పోదాము అన్నవి! మూణ్ణాళ్ళ ముచ్చటయ్యే నేమే నీకాపురము సీతా అన్నవి చిలుకలు! అమ్మ అమ్మ! వద్దు వద్దు! రామచంద్రమూర్తి మహిమ తెలియవద్దా! ఆపని మాత్రం వద్దు! అంతపని ఎందుకు వద్దు! అన్నది సీత. అంటూ చిలుకలకు పండ్లిచ్చి అవ్వి తింటుంటే చెరువు గట్టున నలుగు పెట్టుకున్నది నీళ్లు పోసుకోటానికి.

సీత యిచ్చిన పండ్లు గనకనే అవ్వి సీతాఫలాలైనవి.

సీత మాటలు విని చిన్న బుచ్చుకున్నవి చిలుకలు! ఇదీ బాగానే ఉన్నది. రామచంద్రమూర్తి మాటలు తెలియగానే ఇన్నాళ్ళూ స్నానం చెయ్యని సీత ఇవ్వాళ నలుగు పెట్టుకున్నది. ఈ నలుగు వృధా పోగూడదు అనుకున్నవి చిలుకలు. నలుగును అన్ని చిలుకలూ ముక్కున కఱచుకొని వస్తాము సీతా మళ్ళీ వస్తాము తొందరగానే అవి రివ్వున, చివ్వున రామచంద్రమూర్తి దగ్గరకు పోయినవి!

ఉడుతలది ఉడుత భక్తి : చిలుకలది చిలుక రక్తి!

చిలుకల జాలికి జాపై పోయాడు రామచంద్రమూర్తి. సీత నలుఁగును సీతగానే శిల్పితం చేశాడు. ఆ నాటినుంచి గుండె నిబ్బరంతో ఉన్నాడు.

ఆనాటినుంచీ యీనాటి వరకూ చిలుకలను రామచిలక లంటున్నారు!

నవమినాడు ఈపలుకులు విన్నా, చదివినా నవ్వ నవ్వ కవులవుతారు అందరూ!

# పూలరంగడు

పురిటిలోనే పూలరంగడి పులిజూదపు పోకడలన్నీ పులకరిస్తే అతని తల్లి యశోదల్లే తాయత్తూ విభూదితో తయారయేది.

పూలరంగడి పురిటి నీటిలో పున్నాగ మొలిచింది. పూవు లేసింది. పున్నాగ పై కొమ్మగూడు పొన్నంగి కిరవు. పొన్నంగి పిల్లతో అతిబాల్య స్నేహం పూలరంగడికి.

ఐదేండ్ల పూలరంగడి కాటలో పాటలో చేదోడు వాదోడు చిన్ని పొన్నంగి పిల్ల. తల్లి పొన్నంగి పూలరంగడ్ని జూచి మేనత్త మురిపెముల చూపేది. మేనత్త పాటలను పాడేది.

పూలరంగడికీ పొన్నంగి పిల్లకూ పడమటి గాడ్పులోనైనా పొలుమారేలేదు. అలిస్తే ఆ చెట్టు నీడనో, మరిచి మఱ్ఱిచెట్టు నీడనో, పడమటి గాడ్పులోనైనా పరుండి నిద్రోయి మాపటికి మళ్ళీ ఇంట నుండేవారు.

దొంగభయం లేదు దయ్యాల భయం లేదు పురుగుభయం లేదు పుట్టభయం లేదు. చీకట్లోనైనా చిచింద్రీ తీరుగా, నేరుగా, పండ్రెండేండ్ల యీడువనే పూలరంగడు వెన్ను విరుచుకుని వెనక్కు తిరక్కుండా విసురుగా వెళ్లితే విసిరేసి నట్లుండేది.

దారిలో ఓరోజు క్రకాబూలీవాడు పరకాయించి చూస్తే చిలిపిగా పూలరంగడు వాని ముందు నుంచున్నాడు. కాబూలువాడు క్రెత్తి కళ్లు ఎర్రెత్తి దబాయిస్తే కాలిసందు దూరి వీపుమీద చరిచి పరుగెత్తి చెట్టెక్కి కోతికొమ్మంచి అడగా గగ్గోలు పడుతూ కాబూలీవాడు చూస్తే లాభమా?

పదారేండ్ల ప్రాయంలో పరికిముగ్గు లాళ్లను చూసి చిరతల్ను నేర్చాడు పూలరంగడు. సిరి సిరి మువ్వలకు చిరునవ్వు వచ్చేట్టు జుట్టులో పూలు జుట్టి ఉట్టికింది కృష్ణుడల్లే రంగడు రమ్యంగా చిరతల్ను వాయిస్తూ రంగైన పిల్లా రాణివాసం పిల్లా రత్నాల పిల్లా ముత్యాల ముద్దిదుగో సత్యలోకం పోదామా అన్నా, అన్నట్టు చూచినా విరగపడి వరగపడి విరులపడు మరులపడు మనసులతో ముద్దియలు చూచేవారు! ఓవేళ కటకటలబడుతూ ఏపిల్లఐనా చూచిందే అనుకో! వెంటనే వాడు "ఏతీరున దయ జూచెదవో" అని పాడితే తబ్బిబ్బులయ్యేవాళ్ళు తరుణులంతా అని పూలరంగడి పులిజూదపు పోకడలకు పడతులే సాక్షి!

దిష్టికన్ను గాదు దిగులుకన్నుతో కన్నుబడ్డది పూలరంగనిమీద!

కంపెనిదొర పెండ్లాము కలవరించేది రంగని జూచి పలవరించేది రంగనిజూచి పడరాని పాట్లు పడేది రంగనిజూచి రంగమెళ్ళిపోయేదేమోగూడా!

సీమ పోదామోయి చిన్నపిల్లవాడా సీమ చిత్రాలలో సీమ దర్జాలలో మునిగిపో దామోయి తేలిపోదామోయి తెల్లవారు టనేదే లేదోయి మనిద్దరికి అని కబురు చేసింది!

కబురులో కస్తూరి ఉన్నదో మరి మాటలో మస్తు మందున్నదో మరి కబురుతో

కదిలింది వానిగుండె! మాటతో మరిచిపోయాడు లోకాన్ని!

దొరసాని రంకులో దొర్లిపోయాడు రంగడు! ఇంటివద్ద లేడు రంగడు! ఇంటివద్ద తల్లి ఏడుపు. ఇగిరి ఇగిరి పోతున్నది!

తెల్లదాని వళ్ళో వడలిపోయాడు– తెల్ల తెల్లనై పోయాడు రంగడు!

తెల్లదీ దాని మొగుడూ తెల్లవారు గట్టునే ఒక తెల్లవారు గట్టునే పయనమై పోయారు సీమకు! గట్టునే గట్టునే పోయింది తెల్లది! ఊరు ఊరా వెతికినా రంగ డేయూరా లేడు! ఏ వాడలోనూ కనబడ లేదు!

కొత్త దొరవచ్చి పాత ఇల్లు తాళముదీసి కాపురం పెడదా మనుకొని గది గదీ చూచాడు– ఆ గదీ ఈ గదీ చూచాడు. ఇల్లు వాస నేస్తోంది! పోనుపోను కుళ్ళుకంపు కమిలి పోతున్నది!

పడక గదిలో పగిలిపోతూ పిలుస్తూ కేక లేస్తున్నది...ఆ వాసన!

పడకగది తలుపు తీయగానే ఏదో తేజస్సు బయటికి దూకింది! లోపల అస్థిపంజరము చుట్టూ వాడినపూలు! ఎండి పోయిన పూలు!

కిటికీ రెక్కలకు రెక్కలను కొట్టుతూ రెండు పొన్నంగి పిట్టలు పొద్దున్నుంచీ పొద్దాకా పొలపొలా ఏడ్చి ఏడ్చి రాగాలు పెట్టి పొద్దువాలగానే ప్రాణాలు వార్చినవి! ఆ ఊరిలోనికి యీ రోజువరకూ ఏ పిట్టవచ్చినా పొన్నంగిపిట్ట మాత్రము రాదు! ఆ ఊరివాళ్ళకు పొన్నంగి అరుదై హంసయ్యై పోయింది!

# చిన్నమ్మాయి

అయిదేండ్ల చిన్నమ్మాయికి ఆర్నెల్ల పాపాయి చెల్లెలు!

ఇద్దరు పిల్లల సద్దుతో రద్దిగా ఉన్నా తల్లికీ తండ్రికీ తాతకూ అవ్వకూ చుట్టాలచూపుకూ ఇద్దరు పిల్లాయిల ముద్దుతో పొద్దుపోయేది! ఆర్నెల్ల చెల్లాయిని అయిదేండ్ల అక్కయ్య సముదాయించి తొడలపై జోలల్లు పాడితే జంధ్యాల తాతయ్యకు జంధ్యాలు సాగవు! వత్తులల్లే అవ్వ వత్తులను మూస్తుంది! వంట చేసే తల్లికి వంటసాగదు! జీలకర్ర అరువుకై పొరుగమ్మ వస్తే మాటలతో మరిచిపోయి పోతుంది!

కదురు బెండు దుండు చేరులాడుతూ చెల్లాయికీ తనకూ చిటపటాలంటూ చెల్లాయిని చిన్నగా కొట్టినా కీ మని యేడిస్తే కటిక్కిన చెల్లాయికి చన్నుకుడిపే పిల్లను పరుగెత్తుతూ వచ్చి తల్లి ఏమంటుంది?

నలుగు రమ్మలక్కలూ మాటాడుతుంటే చెంపకు చేతితో చోద్యాలుమాటాడే చిన్నమ్మాయి, నాపసాని చిన్నమ్మాయి, చిన్నదా పెద్దదా?

నలుగు రమ్మలక్కల కొప్పుల్లో పూలనన్నీ లాగి తన కొప్పులోనూ తల్లి కొప్పులోనూ ముడిచే చిన్నమ్మాయిని చూస్తే గొడ్రాలు గూడా నవ్వుతుంది!

బొమ్మల పెండ్లిలో లక్కబిందెల మధ్య తానొక ఇల్లాలుగా ఊహించి మరో పిల్లను భర్తగా కట్టుకుని తొడలపై కొయ్య బొమ్మను చిచ్చికొడుతూ చచ్చిపోయిందని ఉత్తుత్తరాగాలు తీసే చిన్నమ్మాయిని వెనకనుంచి చురుగ్గా చరిచే తల్లికి అందులో రహస్యం తెలియదా? తెలిసినా – ఏమో! తల్లి చరచటములోనూ అర్థముంది!

చందమామలావే జాబిల్లియేవే అని చంకలో పాపాయిని గిలికింత లాడించే చిన్నమ్మాయి నవ్వులకు చంద్రుడే కొండలను దాటుతూ గిలికింతలాడుతాడు!

తాతయ్య దేవతార్చన చేస్తే బుట్టనిండా పూలు తానే ఇస్తుంది. మధ్యాహ్నం తానూ దేవతార్చనచేస్తూ గంటవాయిస్తే లబలబలాడుతూ దేముడే మైలబడ్డాడనే అరవై యేండ్ల తాతయ్య కెందు కన్నేండ్లు?

అమ్మమ్మ వళ్ళో కట్టు కథలను వింటూ ఊ ఊ లను కొడుతూ అమ్మమ్మా అమ్మ పుత్తక మునుపు నేనెక్కలున్నా! అనే కట్టుకథకు అల్లీ బిల్లీ మాటలేగా అమ్మమ్మ విప్పాడు!

అమ్మ రహస్యాలు నాన్నకు నాన్న రహస్యాలమ్మకు తెల్ల మొఖం చిన్నమ్మాయి తిక్కెక్కి చెపితే నాన్నకూ అమ్మకూ తిక్కెక్కాలనుకుందా పాపం!

అమ్మ మడి తాకితే అమ్మ యేమన లేదు. మడి కట్టుకున్న చిన్నమ్మాయిని తాకండి చూతాం!

చీరకట్టే చిన్నమ్మాయిని రెవిక తొడిగే చిన్నమ్మాయిని రొండిన చేతులతో పేరంట మాడే చిన్నమ్మాయిని చూస్తే, నిజంగానే చూస్తే, భీష్ముడుగూడా, అంబను పెండ్లి చేసుకోకుండా పరశురాముడితో యుద్ధం చేసిన బ్రహ్మచారి

భీష్ముడుగూడా ఉందాం చిన్నమ్మాయి పెద్దదయ్యేదాకా అని అనుకోవాలి మరి!

దాక్కున్నది చిన్ని చిన్నమ్మాయి ఓరాత్రి దాక్కున్నది రాత్రిలో కలిసింది!

బావురు మనే ఇంట్లో ఏడుపుకైనా మితిమీరి పోరుగా!

ఐనా, చెల్లాయి పాలుదాగుతూ దిక్కులను జూస్తూ, 'బాల్యాంకవిచేష్ట' కదురూ బెండూ ఆటాడే వేళ్ళతో గాలిలో పిలుస్తే తల్లి ప్రాణాలు.......గుడ్లల్లో నీళ్లు గుడ్లల్లోనే గిర్రుమనేవి!

# అగ్రహార బ్బుడితె

అగ్రహారబ్బుడితె అగ్రహారంలోనే గాదు
అచుట్టు పక్కలంతా అల్లరి పిల్లాడు.
అగ్రహారబ్బుడితె అగ్రహారంలోనే గాదు
ఆటల్లో అందంలో అందరాని చెయ్యి!
అవధాన్ల నడిగి పొడుం పీలుస్తాడు
అల్లాంఖా న్నడిగి బీడీ తాగుతాడు
అమ్మమ్మ నడిగి అణాలుచ్చుకుని
అత్తయ్య నడిగి అట్లు పుచ్చుకుని
అగ్రహారబ్బుడితె బజారొస్తే
అగ్రహార పిల్లలందరికీ పెద్ద!

చెలుగుడులో చిచింద్రీ! చెరువు పక్క చేలల్లో బలిగుడులో కోపుకాస్తుంటే కులుకుతూ కూలబడి చూస్తారు చేడియలు చోద్యంగా!

బిళ్ళంగోడాటలో బిళ్ళతప్పి పడితే ఏపిల్లకూడా చల్లగా చూస్తూ నవ్వితే నవ్వుతుందిగాని మంథరంత మారాముడి చేయదు! అట్లతద్దె రోజున అతని ఉయ్యాల్లోనే అంతంత పిల్లలూ ఆడుకుంటారు. శ్రీరామ నవమిలో శ్రీనాథుడల్లే స్త్రీ సమూహంలో చొరబడి సెరబడ్లు చేస్తూ వడపప్పు పానకం విసనకర్ర లిస్తూ వేళాకోళము వరసలూ విసిరి వేస్తుంటే వాడు – వేడి నిట్టూర్పుతో విసిగి వేసారి పురాణం చెప్పే పండితుడు చూచి యవ్వనాన్ని తలచి ఏడిస్తే ఏం లాభం?

బ్రహ్మదేవుడూ విష్ణుదేవుడూ శివుడూ వంచన బుద్ధితో వెళ్ళి వంచింప బడ్డారు గాని అగ్రహారబ్బుడితెని ఆటల్లో చూస్తే అనసూయ గూడ అనుకునే దేమో!

ఈ మధ్య కాకతాళీయంగా ఈ ఊరు బాగుండ్లా పరదేశం పోవాలి ఈ వూళ్ళో ఏముంది ఈసడింపులే గాని పోవాలి పోవాలి పరదేశం పోవాలి! అని అతడంటే అందరూ వద్దన్న వాళ్ళే!

నాన్నతో చెప్పలా నాన్నంటే భయం! అమ్మతో చెప్పలా అమ్మ ఏడుస్తుందని! కుర్రాళ్ళతో చెప్పలా కూడా వస్తారని! పిల్లలతో చెప్పలా పిచ్చి మనసవుతుందని! ఊళ్ళో చెప్పలా ఊరు వదిలాడు! ఊరవతల చెప్పలా ఊరు దాటాడు!

పయర్లు పండినవి. పడమటి గాడ్పులొచ్చినవి. దుమ్ము మెగరేస్తూ హోరుపెడుతున్నది గాలి! దుక్కిటెద్దులుగూడా దాహమంటున్నవి. కాలవలో నీళ్లు కరచుకుపోయినవి! చెరువులో చెమ్మగూడాలేదు! బయళ్లు భగ్గు మంటున్నవి! బావులు బావురు మంటున్నవి! జోరుటీగైనా గూడుకదలని ఎండాకాలంలో నాన్నతో చెప్పకుండా అమ్మతో చెప్పకుండా ఊరువదిలాడు ఊరుదాటాడు.

పచ్చికలు పచ్చగా బయళ్లు బాగున్నవి! కాలువలు నిండినవి. కలువలు విచ్చినవి! అగ్రహారపబ్బుడితె అగ్రహారంలో లేదు అగ్రహారం అంతా అదో మాదిరి ఐంది!

# ఊట్ల వెర్రెమ్మ

ఊట్ల వెర్రెమ్మ ఊళ్ళో ఉందంటే ఊరంతా ఉబుసుపోక!

దార్లో కనబడితే దారి కడ్డంగా, కర్రమీదానుకుని కర్ర వణికిస్తూ, కనబడిన మనిషి తోల్లా కదిలించి కదిలించి కరిచినట్లు మాట్లాడే ఊట్లవెర్రెమ్మ ఊళ్ళో ఉందంటే ఊరంతా ఉబుసుపోక!

మా ఊళ్లో పిల్లలకు దాగులుమూచీ ఆటల్లో ఊట్ల వెర్రెమ్మ ఊళ్లో ఉందంటే గప్‌చిప్! పలకరిస్తే కష్టం, లేకపోతే చావు, ఊట్ల వెర్రెమ్మని! పలకరిస్తే– పెద్దంతరం చిన్నంతరం లేదా అంటుంది; దారినే పోతే – కళ్లు తలకెక్కినయా నాయనా అంటుంది! మా ఊరిమధ్య రావిచెట్టుకింద ఎండలో వానలో, రాత్రీ పగలూ, ఊట్ల వెర్రెమ్మ ఉన్నా ఉన్నట్లే; ఉండకపోయినా ఉన్నట్లే ఉంటుంది!

ఆకాశాన ఎగురుతూ తిరిగే పిట్ట లన్నింటికి మా ఊరిమధ్య రావిచెట్టుకింద ఊట్ల వెర్రెమ్మ ఉండటమే గురుతు.

ఊట్ల వెర్రెమ్మ తెల్లముసుగే ఊరిజండా! అర్జునా ఫల్గుణా పార్థివాకు బదులుగా ఊట్లవెర్రెమ్మ పేరుతో పిలిస్తే ఉరుములే ఉరకవు. పిల్లలను మేకలను కొట్టదు తిట్టదు కొట్టినట్టుంది; ముద్దూ మురిపెంచేయటం చేతకాదు. కాని ఊట్ల వెర్రెమ్మ వీధిలో వెళుతుంటే జారుతూ జరుగుతూ రాళ్లనూ రప్పలనూ రాచుతూ పొయే కొంగుముడి తాయాన్ని జూస్తూ నవ్వుతూ నసుకుతూ నాట్యాలు చేస్తూ అల్లరి పిల్లలు ఆడుతూ పాడుతూ వెంటబడి చేసే వేళాకోళాలను చూచి దారినే పోయే బాటసార్లందరూ "ఇదే ఊట్ల వెర్రెమ్మ ఊరు!" అనే వాళ్లు. ఊట్ల వెర్రెమ్మ ఊరికి ఉత్తరాన ఉంది! ఊళ్లో ఉబుసుపోవటం లేదు.

ఆకాశాన తిరిగే పిట్టలన్నింటికీ ఫలానా ఊరనే గురుతు పోవటంతో మా ఊళ్లో పిట్టలే తక్కువైనాయిప్పుడు.

దారినేపోయే బాటసారు లొకరో యిద్దరో అయినా రిప్పుడు.

అల్లరి పిల్లల ఆటలూ పాటలూ తగ్గటంచేత మా ఊరిమధ్య రావిచెట్టుకు కళా కాంతీ లేదిప్పుడు. అయినా, మావూళ్లో తల్లులంతా గూడా చద్దెన్నాల్లో ఇదుగో ఊట్ల వెర్రెమ్మ ముద్దంటే చడీ చప్పుడూ చెయ్యకుండా చంటిపిల్ల గూడా తింటుంది!

ఊట్ల వెర్రెమ్మ ఊళ్ళోనే అక్కడక్కడ అప్పుడప్పుడు కనబడుతుందని అనుకుంటారు– అలకిస్తూ చెప్పుకుంటారు.

# బాలవీరుడు

చావుకో జయముకో చారణ గీతాలతో నడవండి నడికట్టు కట్టి అడుగులేయుచు! అని నాయకుడరవగానే ఆ ఊరి వాళ్ళంతా లేచారు!

ధూళి ధూసరాలు దుమ్ము లెగరేస్తూ దూకుతూ వచ్చారు దండధరులు.

బూటుతో తన్నారు భగ్గు మన్నారు! కర్రతో కొట్టారు కర్రుమన్నారు!

బూటు చిరిగింది! కర్ర పగిలింది! ఉద్దండ పిండాలు ఊరి వాళ్ళంతా – చావుకో జయముకో చారణ గీతాలతో నడిచారు! నడికట్టు కట్టారు, అడుగు లేశారు!

ఆ వ్వూరి వాళ్ళల్లో ఆరేళ్ళ బాలుడున్నాడు– బుగ్గ గిల్లితే పాలు కారుతవి; కాలు కదిలితే కందుతుంది! ముత్యాల పలవరస ముక్కు మాణిక్యం! బాలకృష్ణుని వంటి బాలుడల్లే వాడు తల్లి వెనక పిల్లాడు తల్లి కంటే ముందు:

చావుకో జయముకో చారణ గీతాలతో నడిచాడు నడికట్టు లేకుండా అడుగులేశాడు.

అందాల తల్లి యవ్వనంలో ఉంది అందరాని పండువలె దండధరులకు!

గడప దాటెరుగదు కుంకానికైనా, ఇల్లు దాటెరుగదు ఇంగువకైనా, పొల్లు మాటెరుగదు పగనుంచి యైనా, పొరపాట్లెరుగదు పుట్టింటనైనా, అగచాట్లెరుగదు అత్తింటనైనా – చావుకో జయముకో – నడిచింది నడికట్టు కట్టింది అడుగు లేసింది!

చూచి చిల్లులు పడ్డవి కళ్ళు దండ ధరులకు! తాగి తందనా లాడుతూ దండ ధరులు పైట పట్టుకు లాగారు దండ ధరులు – పాడుతూ నుంచుంది పతివ్రతా తల్లి! పతివ్రతా తల్లి! ప్రాణాని కడ్డెవ్వరు?

చీర చుట్టు విప్పారు దండధరులు – సిగ్గుతో నుంచుంది మానవతీ తల్లి! మానవతీ తల్లి మానాని కడ్డెవ్వరు?

(పేపరులో పడబోదు పతివ్రతా తల్లి! పేపర్లు దక్షిణాన, పేర్లుత్తరాన!)

అవ్వూరి వీరులంతా కర్ర' దెబ్బలకు కంది పుండైన దేహాల కైడోఫారము రాస్తూ కూర్చున్నారు!

ఆ తల్లి పట్టుదలకు అలిసి విసిగి వేసారి తలమీద మోదితే దండధరులు, స్మృతి తప్పి పడిపోయి చేతిజండాను వదిలింది వీరమాత!

చూచాడు తల్లి పడిపోటం, లేచాడు పల్నాటి బాలచంద్రు డల్లే!

వాడి హృదయంలో, వాడి రక్తనాళాలలో పూర్వాంధ్ర ప్రతాపాగ్ని రగిలి సురసురాజ్వాలలై వాని చిన్ని ఆత్మ అంతా పొగబారి వాని దేహమంతా కాగి, ఊగి, ఉడికి ఉడికి వేడెక్కి వేడి యావిరవగా చెంగు మంటూ బాలుడు, గోకులాష్టమి నాడు ఉట్టి కెగిరే రీతి, గంతేసి నిలిపాడు ఊరి జండాను!

# పుట్టింట పిల్ల

మాటు గలదే మాట, పట్టుగలదే పలుకు, మాట పట్టింపులది పుట్టింట పిల్ల!
ఆటు గలదే ఆట పోటు గలదే పాట! ఆట పాటలు గలది అదేం ఎరగని పిల్ల!
పెద్దదైన పిల్ల పుట్టింటకై పోయి మాట పట్టింపుతో మళ్లీ రాలేదు.
సమర్తాడిన పిల్ల పుట్టింటోనే ఉంది, తెల్లవారు తరుణము తలపు లేవేవో!
నోములైన పిల్ల పుట్టింటోనే ఉంది పొద్దు పోయే తరుణము మనసేమిపడునో!
పండుగ రోజున పిల్ల పుట్టింటోనే ఉంది, వెన్నెలొచ్చే వేళ ఊహలు ఏరకమో!
పదునెనిమిది ఏండ్లపిల్ల పుట్టింటనే ఉంది, చీకటి తరుణమున చూపులు ఏవైపో!
మెట్టిన ఇల్లు వదిలి పుట్టింటనే ఉంది. నిద్ర పోయే సమయమున కలలేమి కనునో!
అక్కడ్నే ఉందక్కడ! పుట్టింటక్కడ్నే ఉంది! తాళ్లేమీ లేకనే ఉట్టికెక్కింది పిల్ల ఉరి పోసుకుందోయి!

# ఆడవాళ్లు

దాగులు మూచీ దండకోర్ పిల్లీవచ్చే ఎలికాపో అను పాటను ముందుగా పుట్టించి సృష్టించె భగవంతుడు స్త్రీలనూ పురుషులనూ సర్వ ప్రపంచం!

దాగులు మూచీ పల్లవిని ఆడవాళ్ళ కళ్లల్లో, దండాకోర్ పదాన్ని మగవాళ్ల మనసుల్లో, పిల్లీవచ్చే ఎలికాపో చరణాలే గిర్రుమని పరుగెత్తే కాల చక్రాన గుచ్చుబడిన ఊచలు!

దురదృష్ట వాయువుల నల్లాడు నికృష్ట జీవులం : ప్రాపంచక రహస్యాలు మాయందు జీర్ణించి మాకైనా పూర్ణముగా తెలిసీ తెలియని లోతులో చీకటిలో నివసించి నిద్రించు చుందును!

మగపిల్లా ఆడపిల్లా ఏమిటని పురిటింట ప్రశ్నపడే సమయాన మగపిల్ల మమకారం మాకన్న ఎవరికీ?

ఆడపిల్ల అనగనే మగవాళ్లు ముఖం చిట్లించటం ఆడవాళ్ళ నవమానపరచినట్లైనా ఆడవాళ్ళ నాడవాళ్ళే అవమాన పరుచుకుంటాం! ఇచ్చకపు చేతులతో చనవు మాటలతో సుఖదుఃఖాల రెంటినీ ఇవ్వగలం!

స్వర్గానికెళ్లినా నరకానికెళ్లినా విధిదూత వేధకగ్రహమై మావెంట వస్తుంది!

ఒక్కొక్క కన్నీటి పాటలో ఒక్కొక్క వేదనా విషయాన్ని కలిపి కలకాలం పాడినా మేము కాలం కదులుతూనే ఉందును! కన్నీళ్లు కళ్లనే కరుచుకొని వేదనలు విరుచుకొనును! ఏనిముషాన జూచినా ముందుగతి గతిమాలి కన్పించును!

వినబడీ వినబడక దూరాన తిరుగుతూ దూరాన వినబడే ప్రతిధ్వనులన్నీ ఏకమై దూరాననే నిశ్శబ్దమౌరీతి మాదీర్ఘ నిశ్శ్వాసాలు పదివేలు పద్మవ్యూహాలు దాటినా, తరాలు వ్యాపించి దొర్లినా మృగతృష్ణ తీరాన మూర్ఛిల్లు జీవాల ప్రాణాలవలే ఆరిపోవును.

ఆశలడుగంటిన వాళ్లము ఆడవాళ్లము!

# పైనం

రెండెడ్ల బండదుగో! గంట్లమెడల యెడ్లవిగో! గణ గణల మంటున్నయి!

మూటలో బువ్వేసి బువ్వ మూటందుకో! పోవాలి పొరుగూరు, లెగుతుండయ్ పచ్చులు, గణ గణల మంటున్నయి!

వరిబియ్యం దరలేదు డబ్బ్బా దస్కం లేదు! కాత్తో కూత్తో వడ్లమ్మి డబ్బ్బా దస్కం తెత్తాను! పొరుగూరు పోవాలి, పొరుగాళ్లు లేచారు, గణ గణల మంటున్నయి!

ముంతలో మూలుగులు మూలుగుల ముంతలో గణ గణల మంటున్నయి!

తలగుడ్డ చుట్టనీ, చెర్నాకోలందుకో! సిగ్గొయ్య జాగ్రత్త! ఇంటికాడ బద్రం!
సిన్నమ్మాయి జాగ్రత్త! పొయిగుంట బద్రం
యారింటి కెళ్లాకు, యార్నీ చార్బీయాకు!

బుద్దిగలిగుండేవు! బుల్లోడిమీదొట్టు! వత్తానో రానో – దార్లో దొంగోళ్ళు! వత్తానో రానో – సూర్లో సుక్కుంది! పొయిగుంట పగడాలూ కాసులూ బద్రం! వత్తానో రానో! సిన్నోళ్ళకి సుక్కియ్యి! వత్తానో రానో! పెద్దోళ్ళకి పాలమియ్యి! వత్తానో రానో! పొయిగుంట తీసుకో! పోవాలి పొరుగూరు! గంట్లమెడ యెడ్లవిగో! గణ గణల మంటున్నయి, గణ గణలు!

# జై జై లు!

మార్రో! మార్రో! మార్రో! మార్రో! ఒకటీ రెండూ మూడూ నాల్గు: మార్రో! మార్రో! మార్రో! మార్రో! ఐదూ ఆరూ ఏడూ ఎనిమిది: మార్రో!

పోండి! పోండయ్యా పోండి! దెబ్బలెందుకు తింటారు; లేండి! లేండయ్యా లేండి! మీగ్గాదూ చేప్పేది! మార్రో!

మార్రోమార్రో! మార్రోమార్రో! ఇరవైయెనిమిది ఇరవైతొమ్మిది: మార్రో మార్రో! మార్రో మార్రో! ఇరవైతొమ్మిది, మడత పెట్టి మార్రో!

సారాలూ, కుర్మాలూ తాగించే తండ్రులు దొరోళ్లు గొప్పలా సారాజ్జం గొప్పదా? మార్రో మార్రో!

మదమెక్కి బొమ్మలు చేత్తుండారంతా! యదవలంట్రా మనం చూత్తూరు కోటానికి? మార్రో మార్రో!

సాయిబ్బోయి సాయిబ్బోయి! సేయిసిక్కంగా యేస్కో! జైజైలు కొడదాం వెయ్యేళ్లు చార్జెంటుకు: మార్రో మార్రో!

బామల్కి నమ్మక్రాం! మీక్మాకీ కలుద్దాం! చార్జెంటుకీవెయ్యి సలాం! చార్జీలేద్దేనికైనా: మార్ మార్రో మార్రో!

ఎన్నడా యదవలు! యన్నమో వళవళా మిన్నె, మిన్నె పేసరది క్షణం క్షణం చుమ్మా మార్రా మార్రే!

చూపరెంటడుగో! చప్పుడౌతుండాడు! సెప్పుతో సెపుతాడు సిప్పలెగిరేట్టు! మార్రా మార్రా!

సక్కగా ఉందిరా పక్క పాపిటపిల్ల! సంకలో వెయ్యరా రెక్కట్టుకులాగి: మార్రో మార్రో! సారాయికీజై సార్జెంటుకూజై మార్రో మార్రో! మార్రో మార్రో!

# నమ్మకం

పిల్లా! పెళ్ళి పందిరిలో వరుని ముందరగా సిగ్గు చూపుల మధ్య తలవంచు మిషతో క్రీగంట నను చూచి కన్ను గీటితివే!

ఆహా! నీ వేడి యదమీద నిర్భయముగా నేను నిదురించు సమయాన చంచలములగు నీదు కళ్ళూర కుండునని నమ్మక మెలా?

# జ్ఞాపకాలు

నా పేరు లీల!

ఆ ఊరిగోల పడలేక నేను పొరుగూరొచ్చాను! అందాలవాడే అడవిలో ముంచాడు: అందరిని తలచుకొని అల్లాడు చున్నాను.

ఏకాకినై నేను దూరాన ఉన్నాను దారినే పోయే అమ్మలక్కలు జేరి ముండ్ల చూపులు చూచి అడుగుతూ పోతారు.

ఏకాకినై నేను వడిజాము నరకూ మేలుకొని మృత్యువును బ్రతిమాలు కొన్నాను!

అమ్మమ్మ జ్ఞాపకం, అమ్మ జ్ఞాపకం, చెల్లెలు జ్ఞాపకం, నాన్న జ్ఞాపకం, అన్నలే జ్ఞాపకం, తమ్ములే జ్ఞాపకం, అందరిలో నువ్వే ఆఖరి జ్ఞాపకం! రావేల! రావేల రాత్రి వచ్చింది! మధురమౌ మగవాడ నాప్రేమ నిజమోయి!

ప్రాభాతమౌ వేళ జ్ఞాపకాలొచ్చాయి!  
తలిచి తలిచీ నిన్ను జ్ఞాపకాలొచ్చాయి!  
పవలింపు సమయాన జ్ఞాపకాలొచ్చాయి!  
తలనొప్పి తీర్చుతూ తలగడగ రావోయి!  
చలికాల మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!  
చైత్రమాస మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!  
వర్షాకాల మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!  
పిలుపులకు పలకనందులకై ఈఘడియ  
ఈక్షణము జ్ఞాపకాలొచ్చాయి! రావేల  
మగవాడ! ఒడ్డూ పొడుగూవాడ!

ఏకాకినై నేను ఏదారిపోయినా పిలుపు పిలుపుకు పలికే జ్ఞాపకాలొచ్చాయి! ఏకాకినై నే ఏమి పనిజేసినా తలుపు తలుపుకు త్రవ్వి జ్ఞాపకాలొచ్చాయి! మరో పిల్లను నీవు మరులు గొల్పావో, వేరో

పిల్లకు నీవు ఉరులు వేశావో, రావోయి రావోయి త్వర త్వరగ రావోయి, నాకన్ను చెదిరింది పురుషులను జూస్తూ!

బుల బులల హోయికై కిల కిలల జోలకై పరితపించే మనస! కన్నీళ్ళ హృదయమా! బుల బులల మన్నా కిల కిలల మన్నా ముత్తైదు ముద్దు టుయ్యాలకే కద్దు!

బులు బులు బులు బులా హోయీా యీో! హోయమ్మ, నెవ్వరూ పురిగొల్పి నావారు? పురిగొల్పినావాడు పురుషుడే కాడు! మగ పిల్లవాడవో, ఆడపిల్లవో నీవు, మగవాడవై నీవు మాయధారి వవకుండ, ఆడపిల్లవై నీవు అర్ధాన్న మవకుండ ఎన్నెమ్మయే వచ్చి పురుడు పోసింది! కొత్తెమ్మయే వచ్చి ఉగ్గు కలిపింది! పోతరాజే వచ్చి చెదవేశాడు! కొత్తెమ్మయే వచ్చి చాట పరిచింది.

బులు బులు బులు బులా హోయీా, యీా! హోయమ్మ నెవ్వరో చంకెత్తి కెళ్ళారు! నా చన్నులో పాలు చేపుతున్నాయే! ఉయ్యాలలో పిల్ల ఉబుసులే లేవు! నా చన్నులో పాలు జున్ను లెత్తాయే!

హోయమ్మ కెవ్వరూ హోయన్న వారూ! నీలాల సంద్రములో నిప్పచ్చరము నేలపై రాయినై యాహల్య నైనాను శ్రీరామ చంద్రమూర్తీ! రామ రామ నా పేరు లీల!

# పొద్దున్నుంచీ పొద్దాకా!

పొద్దున్నుంచీ పొద్దాకా పొన్నంగి పిట్టల పాటల్లోనే, పొద్దున్నుంచీ పొద్దాకా సమస్త జనుల సంతోషాలు, సన్నని గొంతుల గీర యేడుపులు, సరసవిరసపు సంగతులన్నీ పొంగి పారుతూ పగలవుతున్నవి.

పొద్దున్నుంచీ పొద్దాకా పొన్నంగి పిట్టల కూతల్లోనే కూయి కూయి మను కూతల్లోనే పొన్నంగి కూతల పల్లవులలో పారుటాకుల పొన్పుల నుంచి పూవుల రాణులు పుక్కిలించుతవి! పొద్దున్నుంచీ పొద్దాకా పొన్నంగి కూయిల ఉయ్యాలలలో పండుటాకుల పవళింపులలో పూవుల రాణులు పొద్దు పుచ్చుతవి!

కొక్కొరో కో మని కోడి కూయగా ప్రొద్దున్నే అమ్మా రావే బని పిల్లాళ్లంతా లేస్తారు! ఊ! ఇదిగో! మరే! ఊ! ఊ! అని భార్యాభర్తలు లేస్తారు!

కొక్కొరో కో మని కోడి కూయగా ప్రొద్దున్నే కాఫీ కడుపులు కదల బారతవి! ప్రొద్దున్నుంచీ పొద్దాకా కోడి కూసినా కూయక పోయినా కోడికూతలకు ముందరగానే పనివాళ్లంతా పనికి పోతారు! పనివాళ్ళంతా పనిలో ఉంటారు!

కోడికూసినా కూయకపోయినా ఫ్యాక్టరి గొంతుల కీచుకూతలు, చాకలి రేవుల ఈలల ఊతం వినవద్దన్నా వినబడుతుంటవి!

# బీద మందు

తూర్పు తెల్లారింది, వాన వెలిసింది! అమ్మ పోయే మందెట్టుకు రాయే!
కాండబ్బైనా లేదు, కాసైనా లేదు! కాత్తె కూత్తె కైతే డాక్టేరు రాడే!
సందేళ సలిజరం ఊర్కే పోదే! సందొచ్చిన పిల్లోడు ఉలుకుతుండాడే!
ఏయాకో తింటుంది గజ్జెట్టిన కుక్క! నేపాళం మాత్రెయ్యే, లేత్తాడు పిల్లోడు!
పాతాళం బలిసెక్రవర్తి! సంకురాంతి పండక్కు నేపాళం సెట్టెక్కిరా! జబ్బులన్నీ పోతాయి!

# చాలు చాలు!

ఈ నిరాశాకాశ ప్రవాసాన చీకటిలోని గువ్వవలె ఏకాకినై ఏకాననమునవో ఉన్న నాకు చాలులే! చాలు!

ఏ యంతః పురాంతరాళమునవో హాయిగా ఉండే నిన్నుదలచుచు వేటాడుచు నేను ఇక్కట్లు పడుచుండే వేళల నే నేవేళనైన నా వారికోసము చేసే దూరాన వినబడే బూరనాదము చేసే ఆక్రోశము విని అతడింకా జీవించియే ఉన్నాడని విని నీమనసులో నీలోనవే నిట్టూర్పువిడిచితే చాలు చాలు! చాలుగానీ నిట్టూర్పుతో బాటు నిష్ఠూర మాడ మోకు!

# చిన్న తనం

చంటిలో స్తన్యపానము లేక కొంటినయ్యా కంచిమేక అన్నమాదిరిగ మా అమ్మ చంటిలో స్తన్యపానము లేక మాఅమ్మ కమ్మమ్మ మా అవ్వ వాడవాడలకు నన్ను తిప్పుతూ మరదలా కోడలా మాణిక్యపు మా అబ్బాయికి పాలివ్వరుషే అని అడగగానే ఏవాడ తల్లీ ఎగిరెగిరి వచ్చేది నవ్వుతూ!

ఏనాది యెంకీ దొమ్మర్ల దృగ్గీ గొల్లగౌరమ్మా కమ్మ కామమ్మా రెడ్డి రోసెమ్మా తెలగ రత్తమ్మా పాలిచ్చి తలదువ్వి పూలిచ్చి తొడలపై జోలలిచ్చి పాటలను నేర్పారు ఆటలను నేర్పారు తెనుగు తేటల్లో!

ఏనాది ఎంకితో ఏటివడ్డుకు పోతే జోలలను పాడుతూ అలలతో చెప్పేది. ఇటుసూపి ఊపితే ఇంద్రూని సాయ అటుసూపి ఊపితే సెంద్రూని సాయా అని!

దొమ్మరుల దృగ్గితో దోబూచు లాడితే తందాన లాడుతూ బుజానవేసుకొని బలే బలే పల్టీలు కొట్టేది – కళ్ళు గిర్రుమనేట్టు! గొబ్బెమ్మ పెడుతున్న గొల్ల గౌరమ్మతో గోటుపోతే నన్జూచి తలదువ్వి పూలివ్వ గొబ్బెమ్మ సిగ్గుపడేది!

కమ్మ కామమ్మ రెడ్డి రోసెమ్మ తెలగ రత్తమ్మా కుణు కుణు అందెలపై కడియాల కాళ్ళతో వరిబియ్యం దంచుతూ నావంక నవ్వుతూ వడ్లుదంచంగానె వచ్చె చుట్టమ్ము పొమ్మన్న పోడాయె వరికూటివాపి అని పాడుతూ బుగ్గపొడుస్తూ చందలగ్నం పెళ్ళి కొడక లేచి రావయ్యా చెల్లమ్మనిస్తాము పెండ్లాడ రావా అనగనే నవ్వుతూ గేలింత లాడే నాకోసం రొప్పుతున్న రోకళ్ళు నవతలకు తోసి ముగ్గురూ నేనిస్త నేనిస్త అనే పోటీలు పోతూ పరుగెత్తిరాగా చిటికకో గుటకతో ముచ్చటగ గుటుకు గుటుకు మని వరస వరసగ తాగి వయ్యారముగ తాగి పారాడుతూ వార్ల చెర్లాడుతూ బైట పిల్లలతో పోరాడాతూ గంతేసి గంతుకో తంతుతో వంతేసి పిల్లలతో రోడ్డుపై నుంచున్న నారావు ఒకమనిషి చూసి ఎవడురా వీడు ఢిల్లీ కోటపై యుద్ధానికి పోయేవాడల్లే ఉన్నాడు అన్నాడేగాని నవమి చిలకల నాయకుడని ఎరుగడు!

ఎరగడని మా అవ్వ దిష్టి తీసేది. చీకటి పడంగానే చీచ్చి కొట్టేది!

హరాము చేస్తూ నిద్ర పోకపోతే పాడేది అల్లదుగో బూచివాడూ నాతండ్రి వస్తాడు పవళించరా అని! అసలు గమ్మత్తు ఏమిటంటే– బైజోవ్ గమ్మత్తేంటి గమ్మత్తు: ఈ కథ ప్రేయసికి తెలిసిందంట తడవ తడవకు డ్యామ్ హర్! బూచని ఝడిపిస్తుంది! ఏంపిల్లోయి అది బావా ఎప్పుడూ చిన్నతన మేనా!

# నూతన వసంతం

వచ్చె బహుధాన్య సంవత్సరాది! వచ్చె వచ్చె నూతన వసంతాకాలము! మిత్రమా రావోయి!

వసంతం వాసంత మోయీ! వచ్చినది వాసంత మోయీ! మిత్రమా రావోయి!

కలిసి సావాసముగా మెలిసి ఎకచక పరాచికాలతో పోదాము రావోయి!

కోయిలలు కూయగా గోరంకి చిలక కై కులుకుతూ పలుకగా విందాము రావోయి!

చిట్టి మట్టెలపైన కడియాలతో అడుగులు వేయు చదుగుడుల మనసులు గల వాసంతిక లరుగో! వచ్చింది వాసంత మోయీ! ఏదైనా గున్న మామిడికై వెళ్ళి పోదామోయి!

మంచుపూావుల బోలు తుమ్మి పూవులను దసరాలోనే గాదు వసంతా కాలమున గూడ ఏరుదాము రావోయి!

రత్నపూ రేకులను నమలుతూ పొగడ కొమ్మల క్రింద ఉందామూ?

మీ ఇంటికి మా ఇంటికి దూరముతో తంగేడుచెట్లకు దారముతో వసంతాకాలమున ఎక్కడకు పోయినా ప్రేయసీ! ఏవూరు పోయినా ఏటికి అవతల ఉన్నట్లేగద!

ఆయేరు ఏరువాకయే ఐన, నీ ప్రణయసొన యేరువాకయే యైన ఇవతలేమి అవతలేమి!

ప్రణయసొన యేరువాకతో ప్రాహ్లాద కవితా ఫణితితో వసంతం వచ్చెనోయీ, రావోయి నీవు నీవు!

# ఉదయాస్తమయాలు

**అం**డాండ తేజమౌ ఉదయనుని హాసనములు భండన రుధిరముగల సుర భాండముపగులన్ చారలై జలజలా తరకలై జిలుగులై తరళించిన విధముగ వికసించెన్!

జిలుగులౌ ఉదయనుని కిరణముల కాంతులే పలువిధముల గగనపథమున పడమటగా చారలై జలజలా తరకలై వెలుగులై భండన సుర భాండంబై మారెన్!

పరిశిష్టకవిత :-

# కా ళిం గి*

[స్వస్థానము]

శ్రీ శిష్ట్లా ఉమామహేశ్వరరావు

నిశ్శబ్దమే నిండె! అర్ధపాత్ర పూర్ణపాత్ర యయ్యె!
    తనురూపమున తెనుగుపిల్ల! అంతరంగరూపమున
ఆంధ్రి! నిగూఢహృదయనాగలోకమున రాధ!
    నిర్వాణ మనోపాసనా సావాసియౌ మహేశ్వరి!
కలిలో కాళింగి యయ్యె!
    నాయాత్మ
బలిలో అర్ధాంగి యయ్యె
    జీవిత ప

థాంబుధీనౌకలో చుక్కాని చూపేటి చిత్కళాకుండలిని యయ్యె!
సావధానవై విను విశ్వమా సమీక్షాతీతమౌ యీ రాధగాథ!

నిశ్శబ్దమే పొంగె! నిర్వాణమే పొంగె! పూర్ణపాత్రయు పొంగె!
    పొంగినపుడెల్ల యొకయడబావికల్గె: నాకవిత జలమూలము!
అడబావిమెడపైన గడవేసి మీదుగా జడవిడిచె కాళింగి,
    జడబట్టి యడబావి దిగితి నా కవిత కాధార మా ప్రేమనడత!

ప్రేమలో కాళింగి పూర్ణాంగి యయ్యె
ప్రణవమున కాళింగి మూడక్షరా లయ్యె

అక్షరాతీతమౌ పరసగుణ లలితయగు మహత్కళాకుండలిని
చినుకగా కాళింగిజనకమై చిత్కళాకుండలిని యయ్యెనని తెలిసె విను ఈకవితగీత!

★ ★ ★ ★

కాళింగి సగములో కళ అదే చిత్కళ
    మిగత సగ మింగిత మదే నాపేరు!
కళలలో మెలకువలు కాళింగికే తెలుసు
    కాళింగి కురిపించితే కల్గు కళలు!

---

* [కాళింగి – పాటలు కొన్ని వచ్చాయని కొందరు అన్నారు కానీ, నాకు ఇదొక్కటే దొరికింది. నాటి ఇతర సాహిత్య పత్రికల్లోనూ నేను వెదికిన మేరకు మరేవీ దొరకలేదు. ॥సం॥]

కళాధార మాధార మింగితమునకు నాకు గోపికలార!
నామనసు గూఢమున గాఢమైనారు

మీ రెవరో రూఢిగా నాకు తెలుసు!
ఆరాధ పంపెనా మనోరాధ నాశోధనకు!
మీరెవరు ఆమె యెవ రామెలో
పూర్ణమున భాగములు ఎందుజూచినా మీరు రాధకళాబిందువులు!

రాధ ఋుక్కులప్రోవు రుక్మిణీ యయ్యె,
ఆమె కామ కళలలో భామ కల్గె!
అష్టభార్యల రూపు ఆమెయే తాల్చు
ఇంగితానిష్టాసమీక్షకై, దీక్షకై!
నవతనపుచంచీత! దశతనపుకాళింగి! యోగమున భోగి!

[1942 జనవరి, భారతి.]

# పీఠిక

ఆధునిక కవిత్వం అనేక ముఖాల ప్రవహిస్తున్నది. కొంతమంది కవులు అప్రయత్నంగా నిరంకుశులై, నిజేచ్ఛానుసారంగా నడుస్తున్నారు. సంప్రదాయానికి సంబంధించినంత వరకూ దేనికైనా అదరము. మామూలు మార్గం మంచిగా కనబడినట్టు కొత్త మార్గం గోచరించదు. రంజన కోసం రాత్రింబగళ్ళు కష్టపడే కవులవలె కాకుండా నవీనులకు అదరం కావలె అనే అభిలాష కూడా లేనే లేదు. నిజాశయం వ్యక్తం చేసే కొద్దిమంది కవికుమారుల కృషి సఫలమయిందా లేదా అని చూస్తూ ఉంటే, కొంతవరకు ఫలవంతమయిందని తోస్తున్నది. గతానుగతికంగా కవితావాహినిని కదలనివ్వక పెడతోవల తొక్కినవారి వల్లనే కావ్యక్షేత్రాలు కళకళలాడుతున్నవి!

ఊరందరిదీ ఒక తోవ, ఉమామహేశ్వరానిది ఒక తోవ! నాకు తెలిసినంతలో అతి నవీన మార్గంలో మొదట నడచినవాడు ఇతనే. రమారమి ఏడు సంవత్సరాల క్రిందట ఇతని రచనలు చూచి చకితుణ్ణే అయినాను. కావ్య వస్తుసంగతి విడిచి కావ్య శరీరం సంగతి ఆలోచిస్తే ఈ ఒంటి తీరే వేరు. తరవాత కొన్నాళ్ళకు పూడిపెద్ది వెంకట రమణయ్య, శ్రీ శ్రీ, నారాయణబాబు, పురిపండా అప్పలస్వామి, రుక్మిణీనాథ శాస్త్రి, కొడాలి ఆంజనేయులు మొదలయిన కవుల రచనలు బయలుదేరినవి. రమణయ్య Inter Rhyming కోసం యత్నించినట్టు కనపడుతుంది. శ్రీ శ్రీ, నారాయణబాబూ Pattern verse పద్ధతిని వెళ్ళారు. కొంతమంది Verse libre వ్రాశారు. ఎలాగయినా వీటిలో ఎక్కువ భాగం Formalగా వుంటుంది. ఈ కవులకు సంగీతంలో అట్టే ప్రవేశం వున్నట్టు తోచదు. కొంత Ear for melody వుండటంచేత అల్లిక బాగానే సాగింది. 'ఉమా', మన సంగీతమూ తెల్లవారి సంగీతమూ తెలిసినవాడు కావటంచేత కొంత విపరీత మార్గంలో విహరించినాడు. రచనలో formal beauty ఇతనికి ఇష్టం కాదు. ఎంతసేపటికీ ఇతను వక్రగతులలో, ఊపులో, లయలో లాస్యం చేస్తాడు. ఆంధ్ర భాషలో ప్రధమం నుంచీ పద్యము బందోబస్తుగా వస్తూన్నది. వెనకటి కవులు కావ్య శరీరం మీదనే కస్రత్ ఎక్కువ చేసినట్టు కనబడుతుంది. ఛందో విషయాలు కాని యతి ప్రాసలు తెచ్చిపెట్టారు. యతి ఒక పక్షాన తెనుగు భాషకు అనుగుణం అనవచ్చు; ప్రాసమాత్రం పరాయివాళ్లదె. అక్షరరమ్యత అంటూ విరామస్థానంలో తరుచుగా విరుపు లేకుండా చేసి సద్భశాక్షరాన్ని సంఘటించారు. అక్కిరాజు ఉమాకాంతం, అస్మదాదులం వీటిని శబ్దాలంకార విషయంగా ఎంచుతున్నాము. ఇంచుమించు వెయ్యి సంవత్సరాల నుంచీ జాతి చెవికి పట్టిపోయిన ఈ అభ్యాసం అసహజం కానట్టె అందరూ అనుకుంటున్నారు. కసరత్ చేసిన కాయంవలె పద్యం గట్టిపడిపోయింది. చిట్టెము కట్టి చెవులకు సిసలుగా కనపడినా కోమల కర్ణాలకు కొంత శ్రమ కలిగిస్తుంది. నిపుణులయిన కవులు సమవృత్తాలలో దాట్లు వేసి, విరుపులు తిప్పి విసుగు తగ్గించినా వాటి నైజం ఎక్కడికి పోతుంది? అందుకనే ఆధునిక

కవులు సమవృత్తాలు మానివేసి దేశీయచ్ఛందస్సులు స్వీకరిస్తున్నారు. వీటిలోకూడా చాలావరకు సమత వుండటంచేత మరికొంతమంది ఇదికూడా మాని గేయగుణం ప్రధానంగా వుండే ప్రణాళిక అవలంబిస్తున్నారు. సమవృత్తాలలో స్తంభీభూతమై వుండే మాధుర్యం వీళ్ళు గ్రహించలేక కాదు. దేశికి మార్గానికి తేడా వుంది. దేశి తెలుగు హృదయాన్ని తెలియపరుస్తుంది. ఈ ధోరణి గమనించి కవిత్వం చెపితే హృదయంగమంగా వుంటుంది. ప్రౌఢ కవుల పద్యసరళిలో కన్న దీంట్లో సారళ్యము మెండు. అతి – ఆధునిక కవులు దీన్ని గమనించారు.

నేటి కవులు సంస్కృతాంధ్రాలలో సాహిత్యమే కాకుండా తెల్ల జాతుల సాహిత్యాలు కూడా చవిచూస్తున్నారు. మనకు వచ్చినట్టే 1911 లో ఇంగ్లాండులో కూడా కవిత్వంలో కొత్త దృష్టి ఏర్పడ్డది. అదేం చిత్రమో గాని వారికీ మనకూ సమానంగా కవితాస్రవంతిలో గమనవైచిత్ర్యం కనపడుతుంది. 1914, 22, 29, 33 సంవత్సరాలల్లో అక్కడా ఇక్కడా ఒక మోస్తరు ప్రయత్నాలే జరిగినవి. దాని వివరణ అభియుక్తులకు విడిచిపెడుతున్నాను. తెలిసో తెలియకో, ప్రయత్నించో అప్రయత్నంగానో మన కవులూ ఆ మార్గాలు తొక్కారు. భావతరంగాలు ప్రదేశ భేదం లేకుండా ప్రపంచమంతా ప్రసరిస్తవి కాబోలు. Ezra Pound, T.S. Elliot, Sitwells, Stein మొదలయినవారి మతం మనవాళ్ళు కూడా పుచ్చుకున్నారు.

కర్ణాటక ఫణుతులకన్న ఈ రోజుల్లో ఎక్కువమందికి హిందుస్తాని బాణీ హృద్యంగా వుంటున్నది. వీటిలో Harmony ప్రధాన మయిన ఇంగ్లీషు గానగతులు కూడా మహేశ్వరం సంసృష్టి చేశాడు. అస్పృశ్యతాపరులకు ఆనందహేతువు కాకపోయినా సామాన్యులకు ఇది చమత్కారప్రదంగానే వుంటుంది. వంగ భాషలో రవీంద్రుడు కొంతవరకు ఇలా చేసినాడు.

“విష్ణుధనువు”లో ఉన్న గేయాలు పాడడం ఎలాగని బాధ కలుగుతుంది. పాడటంకంటె ఒక విధమయిన ఊపుతో ఉచ్చరిస్తే శ్రవణసౌఖ్యం కలుగుతుంది. మనకు వచనాలు, పదాలు, చూర్ణికలు, దండకాలు– ఇత్యాదులు వుండనే వున్నవి. ఈ కవిని ప్రశ్నిస్తే వైకల్పిక సమాధానం ఇస్తాడు.

కొంతకాలంనుంచీ మనభాషలో గ్రాంధిక వ్యావహారిక వివాదం ఏర్పడ్డది. అస్మదాదుల వ్యావహారికమతం. ‘ఉమ’ ఉభయపక్షాలలో వాడూ కానట్టు కనిపిస్తుంది. భాష విషయమై ఒకసారి అటు, ఒకసారి ఇటు, ఇంకోసారి ఇటూ అటూ, మరోసారి కూటు – ఇలా వుంటుంది. సమాసఘటనలో స్వాతంత్ర్యం ఇంతా అంతా కాదు. శబ్దరూపాలు చాలవరకు సన్యాసం పుచ్చుకుంటూ వుంటవి. రూపం చెడిపోయిందంటె, ఆకారం కొంత వుందికదా అంటాడు. అర్థం తెలుస్తున్నది కదా అని అంగీకరించ బుద్ధి పుడుతుంది. తరుచుగా శబ్దానికీ, శబ్దగ్రామానికీ నేయర్థమో లక్షణార్థమో ప్రధానం అవుతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు Stanza లో విడివిడి మాటల కన్న తాత్పర్యార్థమే తాకుతుంది. కవిభావం కొంత క్లిష్టంగానే వుంటుంది.

*వాచః కాఠిన్య మాయాంతి భంగశ్లేషవిశేషతః*
*నో ద్వేగః తత్ర కర్తవ్యః*

అన్నాడు పూర్వం త్రివిక్రమభట్టు. నవీనుడికీ మనం న్యాయం కలిగించాలి. కవిహృదయం గ్రహించ తలుచుకున్నవారు శ్రమ లక్ష్యం చెయ్యరు. ఇతని భాషలో వైపరీత్యాలు వున్నా విచిత్రమయిన ఓజోగుణం వున్నది. కొన్నికొన్ని Stanzas లోనూ, కల్పించిన Patterns లోనూ, Songs లోనూ, Point Counter-point లూ, Syncopation పొడకట్టుతూ వుంటవి. విసుగుపోయి వీటివల్ల వింతశోభ వస్తుంది.

ఈ కవి అనూచాన సంపద కల ఉత్తమ వైదిక కుటుంబంలో పుట్టాడు. పురాణగాథలు చాలా చదివాడు. folk-lore, folk songs మీద పెరిగాడు. దివ్యజ్ఞాన సమాజ తీర్థయాత్రలు చేశాడు. ఒకానొక యతివద్ద కొంత శుశ్రూష చేశాడు. జ్యోతిషంలో ప్రవేశం వుంది. అధ్యాత్మ రామాయణ కీర్తనలంటే అత్యంత ప్రీతి. వాగ్గేయ కారకుల కృతులు వల్లె వేశాడు. Rythm అనేది ఇతనికి అభిమాన పదం. కాశీ, ప్రయాగ సకలకళాపరిషత్ పుస్తక భాండాగారాలలో బాగా దానా వేసుకున్నాడు. వయస్సు ఎక్కువ లేకపోయినా విచిత్రమయిన అనుభవాలు పొందాడు. కొన్ని సందర్భాలలో గుండె బిగుతు కలవాడు – తరచుగా గుండె జావ! ఒకప్పుడు ఇతనికి తర్కదృష్టి వుంటుంది. మరొకప్పుడు తన కేది తోస్తే అదే. ఇటువంటి వ్యక్తికి ఎటువంటి వ్యుత్పన్నత వుంటుందో ఈ కావ్య సముచ్చయంలో కనపడుతుంది.

ఇందులో వస్తువు ప్రేమ. ఈ రోజుల్లో కవిత్వం ఎక్కువ భాగం ఆత్మాశ్రయం. అంత మాత్రాన కవిచేసిన పనులు పొందిన అనుభవాలూ యధాతధంగా వర్ణించినాడని ఎంచకూడదు. కావ్య ప్రపంచం వేరు, లౌకిక ప్రపంచం వేరు.

ప్రేమ అనగా
మంత్రము కాదు
తంత్రము కాదు
ఆత్మనిర్వాణముచే
ఆరాధించుటయే! అని కవి కధాపీఠంలో పలికినాడు.
प्रेम नगर की राह कठिन है ।

అన్నాడు పూర్వకవి. కాముకులకూ భక్తులకూ బుద్ధి పరిపరివిధాల పోతుంది. ఒకప్పుడు కామి కొండెక్కి కూచుంటాడు, మరొకప్పుడు అఖాతం అడుగున పడివుంటాడు. సముద్రంలో వలెనే కామి హృదయంలో కల్లోలం బయలుదేరుతూ వుంటుంది. ఇందులో ప్రేమ ఉద్భ్రాంత ప్రేమ పాలపొంగువలె గాని ఏటివెల్లువ వలె గాని చెలరేగే ప్రేమ వ్యావహారిక దృష్టినీ సంఘ నియమాలనూ సబబులనూ జాంతా నహి. చేపకువలె ఉష్ణరక్తం లేనివారికి ఉద్వేగం ఎక్కడినుంచి వస్తుంది? కామి ఒకప్పుడు మిట్టమధ్యాహ్న వేళ మానసికంగా మరుభూమిలో వుంటాడు; కాస్సేపటికి పండు వెన్నెలలో పచారులు చేస్తాడు. చేసినా, త్రివిధ మాలిన్యాలూ తొలిగిపోయి దేదీప్యమాన వ్యక్తి అవుతాడు. అప్పుడే ఆత్మనిర్వాణం!

కొంతమందికి నిజంగా ప్రియురాలు వుంటుంది. మరికొంత మందికి మానసపుత్రి కే. ఇందులో నాయికానాయకులు ఎటువంటివారో తెలియదు. ఈ కవికి సీతారాముల పేర్లూ లీలలూ చిత్తశాంతి ఇష్టవేమో. అయితే "విష్ణుధనువు" లో వైదేహి, జనకుడు,

లక్ష్మణుడు, శివధనుస్సు – ఇత్యాదిపదాలు ఉన్నప్పటికీ రామాయణగాధలకూ వీటికి ఆట్టే సంబంధం లేదు.

మనవాళ్ళు అవతారవాదం అంగీకరిస్తారు. లక్ష్మి, సీత, రుక్మిణి, రాధ – అంతా ఒకటేనంటారు. ఈకవికూడా –

సీత యనగా
చెంచీత యనగా
త్రేతాయుగపు
పరాశక్తి! ద్వాపరలక్ష్మి!
కలిలో నాలక్ష్మి!

అన్నాడు. కొన్ని చోట్ల నిశీధ సౌందర్యమూర్తి అన్నాడు. పరాశక్తే యుగయుగాల్లో ప్రత్యేకరూపం తాల్చేటప్పుడు కలికాలంలో కలికి ఇష్టం వచ్చినరూపం ధరించిందంటే తప్పులేదు. ఉద్దేశం ఉదాత్తమయితే సరి.

రామాయణంలో శివధనుర్భంగానంతరం కాని సీత దొరికింది కాదట. ఈ కవి కల్పనలో విష్ణుధనువు విరిగిన తరువాతనే శివకార్ముకం భగ్నమయింది. విష్ణుధనువు వెన్నెముకను అంటివుంటుందన్నాడు. మామూలుగా వెన్నెముక విరిగితే మారణమే! అదే అహంకారమయితే భంగం కావడంలో పస లేదా! అహం వదిలితేనే గాని అనురాగంలో గాని, ఆముష్మిక విషయంలో కాని ఫలితం రాదు. తత్త్వవేత్తలు ఇది అంగీకరించారు.

"విష్ణుధనువు" ప్రథమంలో పచ్చివెలక్కాయ గొంతున పడ్డట్టుంటుంది. ఓపిక పట్టి చదివితే ఉమా విజయ మహేశ్వరుని కావ్యహృదయం కనుక్కోవచ్చు.

ప్రతిభావంతుడికి వుండే లక్షణాలు ఇతనిలో కనపడుతున్నవి. ఇతని భావన బహుముఖాల పరుగెత్తి ఎక్కడెక్కడి విషయాలో ఏర్చి కూర్చుతుంది. ఇతని పంక్తులలో ఎన్ని ఉపమానాలు, ఎన్ని ఉత్ప్రేక్షలు, ఎన్ని రూపకాలు కిటకిటలాడుతున్నవి! కావ్యం మొత్తం మీద తాత్పర్యార్థం మనస్సుకు తాకుతుంది. ఒక విధంగా ఇది వింత సృష్టే. ఉపజ్ఞ, ఉద్రేకము, అభినవత్వమూ అభిలషించేవారికి ఈ కావ్య సముచ్చయము వల్ల కడుపు నిండితీరాలి.

సాహితీ సమితి, తెనాలి
జనవరి 26, 1938.

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

---

"విష్ణుధనువు"కు పీఠికగా ఇది ఉంది ॥సం॥

# విష్ణుధనువు సమీక్ష

- విశ్వనాథ సత్యనారాయణ

ఒకసారి ఒక పండితుడన్నాడుగదా! వేదశాస్త్రాలు దేశంలో ఎందుకు ప్రవేశించటం లేదు అంటే దేశంలో పుట్టే మహా మేధావులందరు ఉద్యోగాలు వస్తవని ధనవాంఛచేత ఇంగ్లీషే చదువుతున్నారుకనుక. వచ్చే గొప్పతనం ఇంగ్లీషుకే వస్తుంది కాని సంస్కృతాంధ్రాదులకు రావటంలేదు అని. అల్లాగే దేశంలో గొప్ప కవితాశక్తి కలవాళ్ళంతా తెలుగు దేశంలో క్రొత్తమార్గాలే పడుతున్నారంటే, వాళ్ళందరూ ఇంగ్లీషు చదివారుకనుక. ఇంగ్లీషు భాషచదివి ఉద్యోగాలు చేయటంలో దేశానికి నష్టం ఉందో లేదో మాకక్కర్లేదు కాని ఇంగ్లీషు చదివి తెలుగు కవిత్వం వ్రాస్తేమాత్రం తెలుగుభాషకు నష్టంఉంది. ఎందుచేతనంటే కవి తన భావాన్ని చెప్పటంలో క్రొత్తమార్గాన చెపుతాడు. అమార్గం అచ్చంగా క్రొత్తదని మాత్రమే నిరాదరించేవారు కొందరుండ వచ్చును. కాని దానియందు శబ్దం అర్థసంప్రదాయాది దోషము లుండటంచేత దానియందు క్రొత్తదనంకన్న దోషభూయస్త్వం ఎక్కువ ఉండటం మూలంగా రసజ్ఞులైన వాళ్ళుకూడా కొందరు కొంతకాకపోతే కొంత మనస్సు కష్టపడతారు. ఇందులో క్రొత్త కవులలో శబ్దస్వరూపం తెలియక పోవటం ఎక్కువగా ఉంటుంది. కొందరొక ప్రశ్న వేయవచ్చు. సరే! శబ్దస్వరూపం తెలిసిందీ అనుకున్నవారికి మాత్రం పూర్తిగా తెలిసిందా? వారూ తప్పులు చేస్తారు అని. నిజమే! వాళ్ళు చేసే తప్పులకి వీళ్ళు చేసే తప్పులకి చాలాభేదం ఉంటుంది. వాళ్ళుచేసే తప్పులు శబ్దము యొక్క అర్థాన్నే భంజిస్తవి. రెండవది. క్రొత్త కవిత్వంలో అర్థదోషాలు ఎక్కువగా ఉంటవి. ప్రాతమార్గమున పోయెడివారి కవిత్వములో నిరర్థకత్వం వుండవచ్చు. కాని క్రొత్తకవుల వాక్యాలలో అపార్థం వుంటోంది. మూడవది. సంప్రదాయము భిన్నమైపోవుట, పూర్వ సంప్రదాయము తెలియకపోవుట, తెలియకుండ తెలిసినట్లు వ్రాయుట, తెలిసియో తెలియకయో దానిని నిందించుట, పర సంప్రదాయములను చొప్పించుట. ఇవి సంప్రదాయగతమైన దోషాలు. సంప్రదాయమంటే మతసాంఘిక భాషాది సర్వవిషయాల్లోను.

ఇన్ని దోషాలున్నవి అని చెబితే ఈ దోషాలు అన్నీ ఒక కవిలో మూటకట్టుకొని పడివున్నవి అనికాదు. భిన్నకవులలో భిన్నభిన్న స్థలాలలో ఒక్కొక్కచోట కొంచెమెక్కువగా వున్నవని అర్థము. మేము గ్రాంధిక వాదులము అని అనుకునే వాళ్ళల్లో కూడా ఇందులోకొన్ని దోషాలు కుప్పతెప్పలుగా వున్నవి. కాని ఆదోషాలని అలంకారశాస్త్రం నిర్ణయించి చెపుతుంది. క్రొత్తకవులలో వున్న కొన్ని దోషాలు వ్యాకరణశాస్త్రమే చెబుతుంది. వ్యాకరణశాస్త్రాన్ని కాదంటే తెలుగుదేశంలో శబ్దాన్ని ప్రయోగించే పద్ధతి తప్పని చెపుతుంది. వాడుకలో సమాసాలు కొద్దిగావేస్తాం. క్రొత్త కవులు వాడుకను దాటివేస్తారు. అప్పుడు వ్యాకరణం రాకతప్పదు. కాదనటానికి వీలులేదు. కనుక శబ్దమునందు అర్థమునందు దోషాలు వస్తున్నవి.

ఈ దోషాలన్నీ వదలి పెడితే మరి క్రొత్త కవులల్లో విష్ణుధనువు కర్త చాలా గొప్పకవి. ఈయనకు భాషవచ్చు. ఎట్లాగో ఒక అట్లాగ తన భావమును చెపుతాడు. కొన్నిచోట్ల ఆయన ఒక భావము అనుకుంటే చదివేవాడు మరి ఇంకొకటి అనుకోవచ్చు. ఇట్లా అనుకోటం వ్యంగ్యం కాదు. వ్యంగ్యం అయితే కావలసినదేమున్నది. అపార్థం గలిగిస్తాడు. ఇది క్రొత్త కవులందరూ చేస్తున్నారు. కాని ఇట్టి అపార్థాలు కాకుండా చాలా భాగాలల్లో కావ్యం జాగ్రత్తగా చదివితే అర్థమవుతుంది.

ఈ కవికి అనంతమైన కవితాశక్తి వుంది.

"జనకుని గృహమున
నున్న సీత, నా
కలలో, వెన్నెల జల్తారు భూమిపై
నడువగా కాలి
గొలుసుల విలాస
రాసకళ లీలలు
నన్ను నిలువున చెంగు టుయ్యాలల
ఊచి మేల్కొల్పు"

*

"చాయ చేమంతి విరుల వెదజల్లు లల్లుకొను రీతి
చంద్రికలు రాలినవి పచ్చికల నేలపై తుమ్మి పూవులపై"

*

"సేదక్లైవాలు నా శరీరము వేడి నిట్టూర్పుతో
రాట్నమై ఊహాపోహలను వడుకుతుంది."

*

"విరిగిన పాలతరకల తీరు విచ్చుకొను చంద్రికలు"

*

"నిగ నిగ లాడు కురులు, కురుల నడుమగల ఆముఖము
గ్రహణాభ్యంగన మాడిన జాబిల్లిబోలు."

*

"ఇటు వెన్నెల అటువెన్నెల, నడి శిరసుకు శ్రీవెన్నెల
ఇటు వెన్నెల అటు వెన్నెల, ఈశ్వరునకు తల వెన్నెల."

*

ఈ కావ్యమున ఇట్టి మనోహర కవితాశక్తిగల వాక్యము లనేకములున్నవి. కవి గొప్ప ప్రతిభావంతుఁడు. మనస్సంచారములను ఇట్లు వర్ణించెను.

"దాగుడుమూత పడవీ మనస్సంచారములు
కత్తెర పెట్టిన తెగవు. ఎక్కడ కేగుచుంటిరని
పోవునపు డడిగిన నవి పకపక నవ్వు. అక్కడ

ఏమి చేసితిరన సిగ్గుచే లోనికి
జొత్తురు. వెంటనే యుప్పెన వచ్చినట్లు మహా
ర్ణవమి పిల్లలవలె అల్లరి చేతురు."

మనస్సులో జరుగు కొన్ని వికారములు ఉన్మేషములు ఇంత చక్కగా ఆరోపించి చెప్పుట మిక్కిలి కష్టమైన పని. కాని ఈశక్తి క్రొత్తకవుల కెందఱకో కలదు. ఈ కవి పూర్వకవులను చదివెనో లేదో చెప్పలేము. కాని వారి యందు గాఢాభిమానము కలవాడు.

"మంచు బిందువుల ముసుగులో మల్లె పూవులవలె
నును లేత దుకూలముల జలతారు విరులవలె
జల జలా రాలిన వేవేల చేమంతి రెబ్బలవలె
రావేయని వాపోవు గజప్రాణోత్సాహియై వేగ
శ్రీపరి చేలాంచలము విడక పరుగెత్తు హరి వెనుక
వెన్నాడి వచ్చు ఆపాల్కడలి కెరటాల తరకలల్లే
పూర్ణిమా చంద్రికా తరంగా లుప్పొంగి పారగా."

ఇది ఎంతచక్కని కవిత్వమో చూడుడు. ఇందు పోతన్నగారి యందలి ప్రేమ యీయన శబ్దములు తెచ్చుకొనుటలో వున్నది. కాని ఆ శబ్దముల కర్థము తెలియక పోవుట కలదు. ప్రాణావనోత్సాహి కాని ప్రాణోత్సాహి కాదు. ప్రాణోత్సాహి అనగా రక్షింపబోవువాడు అని కాక చంపబోవువాడు అని అర్థము పుట్టును. శ్రీ కుచోపరి చేలాంచలములో "కుచో" పోయి "పరిచేలాంచలము" మిగిలినది. నేటి నాటకములలో పద్యము లిట్లే చదువుదురు.

పోతన్నగారి యెడల ఈయనకుగల భక్తి మఱి రెండుమూఁడుచోట్లకూడఁ గలదు. ఆయన "మందార మకరంద" "ఒక సూర్యుండు సమస్తజీవులకు" ఈ రెండును ఈకవి స్వీకరించి తనపంక్తులలో కలుపుకొన్నాడు.

వృత్తములుకావని క్రొత్తగా మాత్రలు బిగించి గురజాడ అప్పారావు పంతులుగారు ముత్యాలసరము మొదలువేసిరి. తరువాత చాలమంది కవులు లయ ననుసరించి మాత్రాప్రధానముగ కొద్దిభేదములతో కొన్ని రచనలు చేసిరి. ఈయన కవిత్వములో మాత్రాప్రస్తావనలేదు. పాదనియమములేదు. క్రొత్తపాదము మొదలుపెట్టినపుడు సర్వత్ర విశేషార్థ ద్యోతకముగా మొదలు పెట్టబడిందని చెప్పుటకు వీలులేదు. కాని ప్రతి గీతంలోను ఒకవూపు వుంటుంది. అవూపు మధ్యమధ్య విరిగిపోతూ వుంటుంది. కొన్నిచోట్ల పూర్వకవుల వృత్తములను తలపించే భాగాలు కూడ వుంటవి. చూడండి.

"లలనా వెన్నెలవేళ తీయని" ఇది మత్తేభవృత్తము యొక్క మొదలు. "ఝంఝామారుత ఝర్ఝరీధ్వనులు" ఇది శార్దూలముయొక్క మొదలు. "ఆ బ్రహ్మమున్నాదనే ఏలాగవ్రాయగలేదు నిన్నుదుటిపై" ఇది శార్దూలము. ఒక పాదములో యతి దగ్గరనుండి రెండవపాదములో యతివరకు. "ఏ మహాటవిజొచ్చెనో నామనస్సు" ఇది తేటగీతిపాదము. ఈయన లక్షణమెరుగునో ఎరుగడో ఎరిగి తిరస్కరించెనో? ఎరుగక వీనిని సంస్కారముచేత పొదుగుకొన్నాడో!

ఈ కవియొక్క భావనా పటిమ మిక్కిలి గొప్పది. ఒకచోట ఆకాశము కొప్పుగా వెన్నెలలు జాజిపువ్వులుగా రాముడు సీతాదేవిని ప్రకృతిలో చూచినట్లు వర్ణించెను. కవికి ముఖ్యముగా నుండవలసిన పరిశీలనాశక్తి ఈయనవద్ద నున్నది. "అల్లికలు దగ్గరిల్లి దగ్గరిల్లి కొప్పుకుదిరిన పిదప". ఇది కొప్పుముడుచుట యొక్క క్రియావస్థా రమణీయ పరిశీలనము. "నా రక్త నాళములో పసరెక్కి పేరుకొన్నది విపరీత వైతరణి". ఇట్టి యనేక స్థలముల యందితఁడు దివ్యమైన కవి. ఇదికాక ఇతనియందు ఉక్తి వైచిత్ర్యం కూడా వుంది. "నొళించెందె నామనసు" (మెలికెలు తిరుగుచున్నదని యర్థము.) "తెరచాపగ పడగను విప్పి శేషుడు" మొదలైన మనోహరోక్తులు పలుకఁగలడు. అన్నిటికన్న ఈయన మేధావిశేషము రాముని చిత్తము రావణునివలె దశముఖాల చూస్తుందనుటలో నున్నది. సీత తన చూపులనే బాణాలతో ఆ దశముఖాలని త్రుంచుతుందట! అవి మరల మరల మొలుచునట! సీత లక్ష్మీదేవి కాన వైకుంఠములో తనకున్న మూలబలముతో రాముని గర్వస్థమైన కుండలినీ నాడిపై బాణంవేస్తే ఆ మనస్సనే రావణుడు చచ్చిపోతాడట! ఇది వట్టి కవితాశక్తికాదు. వట్టి భావనాశక్తియు కాదు. దీనియందు మహార్థములు నిక్షేపింపఁబడి వున్నవి. అది వ్యాసము చివర వ్రాస్తాను.

కవిత్వానికి లయ ప్రధానంగా వుండాలి. లేకపోతే వచనమవుతుంది. లయచేత, ఆ లయ కనుసరించిన కూర్పుచేత పద్యానికి కాని పాటకి కాని ఒక కవితాత్వము పట్టుతుంది. అది భావానికనుగుణమైన ఛందస్సుకొద్దీ, సవరించకల కవిశక్తికొద్దీ. ఈ పుస్తకములో అంతా వచనమే. కాని కొన్నిచోట్ల పాటభ్రాంతి, కొన్నిచోట్ల పద్యభ్రాంతి, మఱికొన్ని చోట్ల గమనచమత్కృతి. అంతేకాని తీర్చిదిద్దిన పాటకాని పద్యము కానిలేదు. మొత్తము మీఁద అయిదారు గీతాలు మాత్రం పాటయొక్క పద్ధతిని రెండు మూడు మార్పులలో సవరించుకోఁగలవు. "అనదికి అద్దరిని ఇద్దరం కలుద్దాం", "ఇటువెన్నెల అటువెన్నెల", "నడిజాము వేళలో", "అలివేలుమంగవైతే" – ఇటువంటి వానిలోతప్ప పాట నడకకూడా సిద్ధించిన స్థలాలులేవు. ఒకచోట "పొన్నమాని మీద పొద్దుపోదామా" అని వ్రాసెను. ఇది సరిగా కొన్ని యేలపదములు జీర్ణించుకొనుటచేత వచ్చిన శక్తి. ఇది కొందఱు తప్పులనుకొనవచ్చును. ప్రొద్దు పోగొడదామా అని అర్థముకాదు. ప్రొద్దుతో అవినాభావత్వము పొంది నడచిపోదామా అని అర్థము. ఈయనకుఁగల సంస్కారమంతయు స్త్రీలపాటలు, యేలపాటలు తెలుగుదేశముల సంప్రదాయములు తెలియుటఁజేత, వానియందు మక్కువ యుండుటచేత కలిగినదేమో అనిపిస్తుంది. అసంస్కార బలంచేత తన మాతృభాష తెలుగు కనుక చదివి విని అనేకశబ్దాలు నేర్చాడు కనుక ఈయన కవితాశక్తి ఇల్లా బయటికి వచ్చింది.

"ఒప్పులకుప్పవై ఒయ్యారిభామవై"

*

"వేగూచుక్క వెలగామొగ్గ"

*

"ఉత్తముని పేరేమి ఊరిపేరేమి"
సత్యవనితను గన్న సాధ్విపేరేమి

"గూటు రెవికల పొంగుపీటుల మీద పోసేపూల మాదిరి"

*

ఇట్టివి 'యేల' పాటలనుండి, స్త్రీలపాటలనుండి సేకరించుకొన్నవి. వాని మీఁద నీయనకు మమకారము మెండు.

ఈ సంస్కారముతో పాటు తెలుగుదేశపు పండుగలు, ఇచటి యాచారములు ఈయన హృదయములో నత్తుకొన్నవి. మదనపంచమి, రథసప్తమి, నాగులచవితి, దేవీనవరాత్రాలు, అన్నియు ఈయనకు కవితావస్తువులే. కవితావేశము కలిగించునవే. ఇవికాక పురాణగత సర్వకథలు ఇతనికి పోలికలు వస్తవి. నలదమయంతులు, అశ్వమేధయాత్రలు! అతని హృదయ గ్రంథము గీతారహిత భారతమువలె నీరసమయ్యె నట. సీతాప్రేమలేక రామునిజీవితము కృష్ణుడులేని అర్జునుని రథమువలె ఎక్కడకో లాగుకొని పోతోందట. సీతలేని రాముని హృదయము విష్ణువు లేని వైకుంఠమువలె నుందట.

ఈకవికి భారతాంధ్రదేశముల సంప్రదాయములందు వైముఖ్యములేదు. తిరస్కార మంతకు ముందే లేదు. గొప్ప ఆస్తికబుద్ధి కలవాడు. ఒక్క ఛందః పద్ధతియే క్రొత్తది. భాష యతని యిష్టము వచ్చినది. అంతకన్న అతనికిది చేతనైనది యనవచ్చును. కవితావేశము బలవంతపెట్టు. భాష చదువుటకు చిన్నతన ముపయోగించు కొనకపోవుట. దోషములున్నచో ఇవి రెండే దోషాలు. ఇతని యాంధ్రాభిమానము మచ్చుముక్క వంటిది. ఈయనకు తన యభిప్రాయములే ముఖ్యములుగాని తాను తీరుస్తూవున్న పాత్రలో ఔచిత్యము భిన్న కాలికత్వము భిన్న దేశత్వములు ముఖ్యములుకావు. ఈయన కావ్యనాయకుడు శ్రీరామచంద్రుడు. నాయిక సీతాదేవి. వారిప్రేమ కథావస్తువు. వస్తు స్వీకరణంలో కూడా మూరెడుపోయి బారెడు క్రుంగడం లేదు. భారతీయునివలె, ఆంధ్రునివలెనే వస్తువును స్వీకరించాడు. ఈదేశాల సంప్రదాయ సంస్కారాలకు ఎదురు నడిచిందిలేదు. కాని ఆరాముడు సృష్ట్యాది మొదలు, కలిలో క్రీస్తుశకము 19 వందల ముప్పది యెనిమిది జనవరి వరకు కల భారతదేశపు దేవుళ్ళూ రాజులూ అందరూ ఆ రాముడిలో వున్నారు. అవన్నీ ఆ రాముడే. ఆ సీతే చెంచీత. ఆవిడే పరాశక్తి. ఆవిడే అలువేలుమంగ. ఆరాముడే ఉదయనుడు, కృష్ణుడు, లక్ష్మీనరసింహమూర్తి, ప్రవరాఖ్యుడు, అభిమన్యుడు. వీరినికూడ ఆ రాముడు పోలిక తెచ్చుకొనును. ఆ రాముడే శివుడు. ఆ రాముడే తిరుపతి వేంకటేశ్వరుడు. ఆ వేంకటేశ్వరు డసలు శంకరుడు. సీత అలివేలుమంగ. ఆంధ్రదేవి. ఆంధ్రదేశములో క్రొత్తగా పుట్టుచున్న యుత్సాహము కూడను. ఇది ఈయన పరితోదృష్టి. ఇతని దేశభక్తి రామునిలోనుండి ఆంధ్రదేశమును మేల్కొమ్మనును.

"అవునవును అందాల అలివేలు మంగా
నీనయన నీరాజన ధవళ జ్వాలానల కణములే
ఆంధ్ర బీజానలములై నూతనోత్పత్తి కాగలదు."

"ఓహో సౌందర్యసామ్రాజ్య విరాడ్విశ్వేశ్వ రార్ధాంగ పత్నీ! నక్షత్ర
స్ఫటికముల నవనవల లాడే వెలుగువై తళుకువై నిబిడాంధ్ర
కారాంధ్ర దేశాకాశాన, వజ్రాయుధమువలె

ఏనాడు కన్పడెదవో తెల్పుము : త్రిపురాంతకుడనై
లేచెదను, ప్రళయ కాలాభీల గర్జ పర్జన్యములతో
నిశీధ నిబిడాంధకారాంతరాళాగ్ని నగునేను."

ఈ రాముడు ఆంధ్రుడు. స్వాతంత్ర్యము నుండి పతితుడైన యాంధ్రుడు. స్వరాజ్యాపేక్షగల యాంధ్రుడు. ఉత్సాహియైన యాంధ్రుడు. ఇది దేశభక్తి. ఇతని దేశకాలావచ్ఛిన్నత్వం లేకపోవటం.

ఇతని ప్రేమసిద్ధాంత మొక చిత్రమైనది. అప్రేమ తొలుదొల్త సీతకై రాముడు విరాళిపొందుటగా మొదలుపెట్టెను. చివరకు సీతను మహాకాళిగా జూచెను. అప్పుడును ప్రేమించెను. ప్రేమయనగా "ఆత్మనిర్వాణముచే ఆరాధించుటయే." ఈభావము నేటి కొందరాధునికుల ప్రేమసిద్ధాంతము కాదు. కొంద రాధునిక ప్రేమసిద్ధాంతము లో ప్రేమ 'బ్రహ్మపదార్ధ' పర్యాయవాచిగా కన్పిస్తుంది. ఇది ప్రకృతి యారాధన. రాముడు పరమ పురుషుడు. సీత ప్రకృతి. సీత ఈక్షితిని మోయుచున్నది. అష్టదిగ్గజము లామెకు సాయము చేయవలెను. లేనిచో రాముడు బాణములతో వానిని కొట్టి చంపును. ఈసీత మహాదేవి. నగ్నమూర్తి. కళాకృతి. భయంకరమూర్తి.

"నీనిమ్నదృష్టి చిత్రకళలకు విపరీతపుష్టి!
వివస్త్రవై నీవు భుజంగాంగనవలె ఒయ్యారివై"

*

"శృంగార రసధారలను చినుకు నృత్యాలుచేయుచు
నీవు నవరాత్రి పండగరోజులలో మయిమరవ
నవలక్ష నక్షత్రరాశి జీవులుకూడ నీ
నీల శరీరంపు నిగనిగల నిమజ్జనములు చేసి
కల్లునీళ్ళుత్రాగి కైపెక్కి
ఒళ్ళువిరగపడుచు మత్తెక్కి
దుఃఖాల దిగవిడిచి జీవించు చుందురు."

ఆసీతాదేవి "అనలముల కణకణల అందాలుచిందు."

ఆమె "రక్తారుణ ప్రభావ సమరకల్లోలములో ప్రజల
ప్రఫుల్ల సౌందర్య జీవితానందము జేయు
అనంత ముఖములు గల అందాల అనలము.
కల్లోలమేఘాగ్నియై నడియెండలో మెరుపుతీగలపై
వసంతము లాడు వివస్త్రమూర్తి."

ఇది అతని సీతాసృష్టి. ప్రేమభావము. సృష్టినడకయే ఆయన ప్రేమభావముగా కనిపించుచున్నది.

ఈకవి స్మార్తుడు. వెలనాటి. కాని ఈయన భావములు వీరశైవము, శివాద్వైతముఖముగా నున్నవి. ఈయనకు ద్వైతముమిథ్య, విశిష్టాద్వైతము మాయ. సంపూర్ణవ్యక్తి శివుడు (The Perfect Man). ఈ భావము ఆంగ్లేయులనుండి వచ్చినది. శివుని నిట్లు చూచుటకూడ చిత్రమే. నిర్వాణమనగా వ్యక్త్యభావము. ఇది ఈయన సిద్ధాంతము.

ద్వైత విశిష్టాద్వైతములు అద్వైతమతములోనుండి పుట్టినవి. ఆమతములో ఇమిడిఉన్నవి. ఈ భావములన్నియు సమంజసములుగానే వున్నవి.

ఈకవిలో సంగీతశాస్త్ర పరిభాషాభిలాష కూడ అక్కడక్కడ గోచరిస్తుంది. కాళీదేవి భయంకరాకారంలో ఇతనికి సౌందర్యం కనిపిస్తుంది. మఱి ఒకప్పుడు వెన్నెలలో ప్రేమకన్పిస్తుంది. ప్రథమ దశలో ఇతని వెన్నెలకి ప్రేమకి అవినాభావ సంబంధం. వెన్నెలలో సీత కలధౌతపాత్ర పై కడియాలతో నృత్యాలు త్రొక్కిందట. వెన్నెలలో గాలి 'యేల' పదాలూదింది. ఆ 'యేలలు' "అట ఆటలనాడు దయ్యములు విశ్వమున ప్రణయములేమి? వెన్నెలలేమి యనిచేయు కరాళ హాసనములా" అని ఇతని ప్రశ్న. ప్రణయము వెన్నెల ఒకటే. వెన్నెల ఆదేవి యొక్క ముగ్ధ ప్రసన్నరూపం. కాళీదేవి భయంకరనృత్యం ఆమెయొక్క ప్రౌఢ ప్రసన్నరూపం. ఇది ఇతని ప్రేమసిద్ధాంతం. ఇతనియందు మర్మకవిత్వము యొక్క లక్షణాలు చాలావున్నవి. మర్మ కవిత్వము అంటే యౌగికాధ్యాత్మిక విషయ పరామర్శ అని ఈమధ్య కొందరు పెద్దలు పలుకుతూ వచ్చారు. నేనూ ఆ అర్థాన్నే స్వీకరించాను. నౌళి, ఉడ్యాణము, కుండలినీ శక్తి మొదలైన యోగ సంబంధ పరిభాష లితడు వాడును. రాముడు తన మనస్సు రావణుని వలె దశముఖములు కలదనుచోట మహార్థమున్నదని వ్రాశాను. ఇది ఇతని ప్రేమ సిద్ధాంతముయొక్క పరమావధి. ఈ ప్రేమ యోగము కుండలినీశక్తి ప్రజ్వలింపఁజేసి ప్రకృతి కతీతుడూ, ప్రకృతిని తనలో లయింప చేసికొన్నవాడూ అవటం! దీనినే కవి ఇంకొకచోట చెబుతున్నాడు.

"నినున్ చూచినదాది నిమీలిత నేత్రుడనౌ నాలో
కుండలినీయోగ విలాస ముల్లాసము చెందె
షట్చక్రముల్ సక్రమములయ్యె తెరచాపగ
పడగను విప్పు శేషుని శయ్యాతలమున నీవు"

ఇది ఇతని ప్రేమ సిద్ధాంతము. రాముడు యోగి. సీత రాముడు తన్నుతాను చూచుకొనటం ఈ ప్రేమయోగం.

ఇతనికి దయ్యాలు, దేవుళ్ళు, ఈ రెండు మాటలకు అర్థభేదం వుంది. దేవుడబద్ధం, దయ్యాలు సత్యం అని వ్రాశాడు. అంటే ఆత్మయందాత్మ గుర్తించటమే అవధి. తక్కినదంతా వట్టిలీల. ఆలీలలో అనేక భావాలు వానికి మూర్తులు. దయ్యాలు అని ఈయన భావము. సరిగా దారు లేర్పడని అనేక మతసిద్ధాంతాలు ఈయనకి వున్నవి. వాని నన్నింటిని తీర్చిదిద్దటం కష్టం.

ఈయన భావములు, ఈయన సంస్కారం, ఈయన భావనాశక్తి ఈయన కవితాశక్తి పరమోత్కృష్టస్థితిలో వున్నవి. కాని వీని నన్నింటికి భాషాలోపము ఒకటి వున్నది. అది ప్రతియడుగున అడ్డం వస్తుంది. ఒక్కొక్కచోట మెలికలు తిరుగుతుంది. అర్థాన్ని పొసగనీయదు. ఒక భావము బయటికివస్తూ మనస్సులో పరిచితాలై వున్న అనేక శబ్దాలనీ భావాలనీ లాక్కువస్తుంది. ఒక్కొక్కప్పుడు అన్వయము లేని ఒక వరుసలో వస్తుంది. అర్థంలేని మాటల్లో వస్తుంది. వ్యాకరణానికి పట్టుకోరాని యెగుళ్లెగురుతుంది. క్రొత్తకవులలో చాలమందికీ దోషాలు వున్నవి. కొన్ని దోషాలు చూపిస్తాను. శబ్దదోషాలు. 'అత్రుతార్తి' 'వరుసగా వాయిగా' 'కేయూర వయ్యారిపై

'తందానతానుడై' 'నీ ధ్యాసునిగ చేసితివి' 'అర్ధాంగపత్ని' 'గర్జపర్జన్యములు'. ఇవి చ్యుత సంస్కారాలు. అర్థము పొసగని సమాసపు కూర్పులు చాల వున్నవి. కొన్ని వాక్యములు సంప్రదాయేతరంగా వున్నయ్యి. సీత చెమట వైకుంఠమును దహిస్తుంది! ఇక్కడ అర్థం గౌణంగా పొసగించుకోవచ్చు. కొన్నింటిచోట్ల భావం అవిస్పష్టం. తెలియదు. మైథిలికి వ్యుత్పత్తి 'మేధామద విదళిత' అట! అనగా రాముడు తాను వూహించి మైథిలీమూర్తిని సృష్టించు కొన్నాడని అర్థం. ఆమె ఆత్మాంతరమున 'wit' దేశవాశిని కాన వైదేహి అందురు. ఈ 'wit' ఇంగ్లీషుమాట. ఈ వ్యుత్పత్తులు ఈ భావములు ఒకదారి తెన్నూలేనివి.

"పురుషకారమే పరశురామమందు. నేనే రాముడ." ఇందులో శబ్దమర్థమును అందీయదు. ఏదైనా కలిపించుకొంటే కలిపించుకోవచ్చు.

కొన్ని సమాసపు కూర్పులు బెంగాలీ మొదలైన భాషల్లోకి మళ్లే చేయబడ్డవి. "వాసంతవుదయ", "ఈసుదిన యుదయాన", "సదనవుద్యాన". మిశ్ర సమాసాలు వదలి పెట్టినా ఈసంధులు భాషలో ఎల్లాకలుస్తవో! కొన్నిచోట్ల ఇంగ్లీషు భావాల సంపర్కం తప్పనిసరిగా వచ్చింది. "ప్రేయసీ నీచూపులో తోడుకలిగించునది అదేదో వున్నాదే" ఇది (Companionship) ఈయన ప్రేమసిద్ధాంతమునకు ఈభావానికి పొసగదు.

దోషాలకేమి? భావము వ్యక్తీకరించటానికి సాంకర్యం పొందిన భాష అడ్డం వస్తుంది. అచ్చమైన భాషఅయితే ఆభాషలో అర్థము ప్రసన్నమయ్యేట్లు చెప్పఁగలిగితే కావ్యం అందమిస్తుంది. ఆభాష వాడుక భాష అయినా కావచ్చు. గ్రాంధికమైనా కావచ్చు. కాని తెల్గుభాషకావాలి. కొన్ని వాడుక భాషలో చెప్పఁదగిన భావాలు చెప్పఁదలచినచోట్ల – గ్రాంధికంలో చెపితే "దుహితా! మార్జాలములు క్షీరములు గ్రోలుచున్నవి. పశ్య! పశ్య!" యన్నట్లు హాస్యము పుట్టించును. లోకములో మనమెప్పుడూ మాట్లాడుకోని ఉదాత్త విషయాలు వాడుక భాషలో చెపితే వాడుకభాషలో శబ్దాలూ దొరకవు. ఆ రచనకు పేలవత్వమూ పడుతుంది. అటువంటి కావ్యానికి పూర్వులు చెప్పిన కావ్యత్వం సిద్ధించదు. అందుచేత సంస్కరింపఁబడిన భాష వస్తువున కుచితమైన భాష సర్వకవి స్వీకరించాలి. వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలతో సారస్వతం మీదికి దండెత్తరాదు.

ఈకవి గ్రాంధిక భాషవైపుకే మొగ్గు చూపిస్తాడు. మాటలలో మార్దవంకోసం సౌకుమార్యంకోసం ప్రయత్నిస్తాడు. ఉన్నదోషాలు, గుణాలు విస్తారంమీద చూపించాను. ఇతని కవితాశక్తి అఖండమైనది. అనేకమంది క్రొత్తకవులకు ఈయన దోషాలన్నీ వున్నా ఈయన కవితాశక్తిలేదు. ఈయన పద్యపు ఊపులలో మధ్యమధ్య విరిగినా ఒక నడకవుంది. ఇందులోకొన్ని ఆయన చదువుతోంటే మరీబాగా వుంటవి. ఎందుచేతనంటే ఒక జానపదగీతం యొక్క ఫణితిలో చదువుతాడు. ఊపుగా చదువుతాడు!

---

విష్ణుధనువుకు చివరలో ఈ సమీక్ష అచ్చయింది ॥సం॥

# నవమి చిలుక విమర్శ

- గోపీచంద్, బి.ఏ., బి.యల్.,

"ఇది పూర్వకవిత్వం కాదు. భావ కవిత్వం కాదు. నవ్యకవిత్వం కాదు" అంటున్నాడు వినాయక పండితుడు. ఏమిటిది?

కవితాసమాధిలోనో, కళాతన్మయత్వం లోనో ఉన్నప్పుడు "ఇది అహ్లాద కవిత్వం. ఇది ప్రహ్లాదకవిత్వం. అదేమిటి? ఇదేమిటి? ఇదే కవిత్వం..." అంటాడు "వినాయక పండితుడు". అంటే ఏమిటి?

భావకవులు పురాణకవుల మీదికి విప్లవం చేసి, జమీందారులను ఆశ్రయించి వారి కనుసన్నలకు నృత్యంచేసే కవిత్వాన్ని కేపిటలిస్టుల రుచులకు అనుగుణంగా మార్చి, వారి అందుబాటులోకి తీసుకొనివచ్చారు. ఇప్పుడు ప్రజాసామాన్యం "మీ సాముగరిడీలు, మీ ప్రేయసీ సంబోధనలు మాకు అర్థమవటం లేదు. మీరు దివినుండి భువికి దిగిరావాలి" అని భావకవులమీదికి ప్రోలిటేరియన్ విప్లవం చెయ్యటానికి సిద్ధపడుతోంది.

నే నెరిగినంతమట్టుకు రాజమండ్రి వాస్తవ్యులైన కవికొండలవారు, ఏవాస్తవ్యుడూ కాని (ప్రోలిటేరియన్‌కి దేశమే లేదు అన్నాడు మార్క్స్) వినాయకపండితుడు ఈ విప్లవానికి దారితీస్తున్నారు.

వీరు ఈ విప్లవానికి వైతాళికులు.

వినాయకపండితుడు సాధారణంగా కథావస్తువును ప్రోలిటేరియన్ జీవితంలోనుంచి తీసుకుంటాడు. ప్రోలిటేరియన్ భాషను ఉపయోగిస్తాడు.

ఇతని కవిత్వం 'పైనం'లో పుట్టి "ఏనాది ఎంకి, దొమ్మరదృగ్గి" స్తన్యాలతో పెరిగినా బూర్జువాభాషలోని పాండిత్యం బూర్జువా భాషలోని అభిరుచి ఇతనిలో సంఘర్షణను రేపుతున్నాయి.

అందుకనే ఈకవిత్వంలో బూర్జువా వాసన, ప్రోలిటేరియన్ యాస కనుపిస్తూంటాయి.

ఈ పూర్వ వాసనలను పోగొట్టుకుంటే గాని సిసలైన ప్రోలిటేరియన్ కవిత్వం రాదు.

వినాయక పండితులను ఈవిషయం గమనించగోరుతాను.

---

'నవమిచిలుక'కు విమర్శ అన్న పేరుతో అందులో ప్రచురితమైంది. ॥సం॥

# నవీన మార్గగామి

- శివశంకర శాస్త్రి

మున్నుడితో ప్రారంభమయి గోపీచందుగారి విమర్శతో అంతమయిన 64 పేజీల పుస్తకంలో 18 ఖండికలు వున్నవి. కొన్ని పద్యప్రాయాలు, కొన్ని బందోబస్తయిన గీతికలు, కొన్ని నారాయణదాసుగారి నడకల వంటి నడకల రచనలు ఇందులో కనపడుతున్నాయి. ప్రతి ఖండిక మధురంగా పలకటానికి అనువుగా వున్నది.

ఇందులో వివిధ విషయాలు. రాముడికి వార్త తీసుకుపోయి అప్పటినుంచీ రామచిలుకలు అని పేరుపడ్డ "చిలుకరక్తి" భక్తిభరితం. "పూలరంగడు" రకరకాల పోకడలు పోయి చివరకు దొరసాని పడక గదిలో అస్తిపంజరం అయిపోయిన కథలో కరుణరసం. "అగ్రహారబ్బడితె" అన్నిటికీ అందె వేసిన చెయ్యి. అతను లేకపోతే వూరు, వూరేకాదు. ఏం చేసినా అతను అనురాగపాత్రుడు. "ఊట్లవెర్రమ్మ!" వూళ్ళో వుందంటే వూరంతా వుబుసుపోక. బూచి కంటె వెర్రెమ్మ పేరు వెయ్యిరెట్లు ఎక్కువ పనిచేస్తుంది! "బాలవీరుడు" పల్నాటివీరుడయినాడు. తల్లిపడిపోతే ఆరేళ్ళవాడయినా అరితేరిన వీరుడయి వూరి జండా నిలిపాడు. "పుట్టింటపిల్ల" ఎన్నినోములు నోచినా చివరకు వుట్టెక్కి వురిపోసుకోటమే! "ఆడవాళ్ళు" ఆశలు అడుగంటిన వాళ్ళు అయినారు. "పయనం" రెండెడ్లబండిలో గంటల గణగణలు తిరిగిరావటం వుంటుందో వుండదో! "జైజైలు" స్వరాజ్య జైజైలు. భీరువులు కూడా వీరులుకావాలి. "జ్ఞాపకాలు" స్త్రీజీవితంలో సమస్త జ్ఞాపకాలు, పుట్టింది మొదలు పోయేవరకూ అందరూ వుండి ఏకాకి కావటం కాస్త సుఖానికి గంపంత బాధపడటం – ప్రపంచ ప్రసవవేదన! "నూతన వసంతం" శుభస్వస్తిలో పచ్చపచ్చగా వుంది.

ఈ పుస్తకంలో "అగ్రహారబ్బడితె" "ఊట్ల వెఱ్ఱెమ్మ" "జైజైలు" "జ్ఞాపకాలు" పరాకాష్టకు వెళ్ళినవి. భాషలోనూ భావాల్లోనూ చాలా బిగుతులున్నాయి. కొన్నిచోట్ల కురాన్ షరీఫ్ కులుకులు, కొన్నిచోట్ల Greek Dithyramb పోకడలూ జ్ఞప్తికి వస్తవి.

అతి నవీనమార్గంలో అన్నివిధాలా వెళ్ళుతున్నవాడు వినాయక్ ఒక్కడే. ఇతని రచనలు ఆశ్చర్యజనకాలు. ఆధునికాంధ్ర సారస్వతం ఇతని వల్ల కొంత సంపన్నం అవుతుంది.

---

'నవమిచిలుక' అన్న పేరుతో వచ్చిన సమీక్ష

(ప్రతిభ – ఏప్రిల్ 1938)

# తెలుగు వాళ్ళకే అర్థంకాని గ్రంథం

-నాథం

## విష్ణుధనువు

మంచి గ్లేజుకాగితాల మీద డబుల్ క్రౌన్ సైజున 64 పేజీలు. వెల అర్ధరూపాయి.

పుస్తకం చూసీ చూడ్డంలో ఆకర్షించేదిగా వుంది. మనభాష తెలియనివారిని కూడా పుస్తకం గెటప్ ఆకర్షిస్తుంది.

కాని తెలుగులో బాగా ప్రవేశంవున్న తెనుగు వాళ్ళకి కూడా ఇందులోని విషయం అగమ్యగోచరంగానే వుండేటట్లు తోస్తుంది. కాబట్టే పీఠికలో శివశంకరశాస్త్రిగారు 'విష్ణుధనువు ప్రథమంలో పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టుంటుంది. ఓపిక పట్టి చదివితే ఉమావిజయమహేశ్వరుని కావ్యహృదయం కనుక్కోవచ్చు' – అన్నారు.

శైలి తెలియడానికి కొన్ని పంక్తులు:

*నీలోని జ్వాలయే నీలోన పొగబారి*
*నీకళ్ళ కాటుక యెన్న డానో!*
*కాటుక కళ్ళు కరిగి కాల్వలై*
*మానస సరోవరమేలాగౌనో!*
*సరోవరతీరాన సాయంకాలాన*
*సంధ్యావందనమందే.*
*'కాయేనవాచా మనసేంద్రి యైర్వా*
*నీ మీదనే ధ్యానమున్న దే.'*

జూలై 1938 ఆంధ్రభూమి

*[శ్రీ ఆంధ్రశేషగిరిరావుగారి సంపాదకత్వాన వెలువడిన ఆంధ్రభూమి మాసపత్రికలోని సమీక్ష ఇది. నాథం అంటే బహుశా ముద్దా విశ్వనాథం కావచ్చు. దీనికి ఈ శీర్షిక నేను ఉంచింది. ||సం||]*

★ ★ ★

# అహంభావ కవిత్వ ధోరణి

- నోరి నరసింహశాస్త్రి

శ్రీ శ్రీ, నారాయణబాబు, వారి రచనలు పుస్తకరూపంగా ప్రచురిస్తేనేగాని వారి పద్ధతులు సమగ్రంగా పరీక్షించే వీలుండదు. తరుచుగా వీరు భవిష్యద్వాదుల Manifesto లను తెలుగులో క్రొత్తరకంగా చెపుతున్నట్లు కనబడతారు. భావచిత్రవాదులూ ఛందస్స్వేచ్ఛా వాదులూ కావలెననుకొనే లక్షణాలు వీరిలో కనబడతవి. అయితే ఈ 'అహంభావ కవిత్వము' పుస్తకరూపంగా ప్రచురించిన మొదటివాడు శిష్ట్లా ఉమామహేశ్. ఇతను ప్రచురించిన గ్రంథాలు రెండు – 'విష్ణుధనువు' 'నవమిచిలుక'. రాబోవు గ్రంధాలు 1. జలకన్నె అను విష్ణుధనుష్టంకారము 2. తెనుగు పిల్ల అను విష్ణుధనుర్గాండీవము. 3. రంకులరాటము, కథలు. కవి పేరు ఉమావిజయ మహేశ్వరం లేక ఉమా 'విజయ' మహేశ్వర 'వినాయక్' లేక విజయ మహేశ్వరము, లేక సామాన్యంగా అందరూ పిలిచే ఉమామహేశ్, లేక మిత్రులు స్వతంత్రంగా పిలిచే ఇంకా చిన్నపేరూ ఉండవచ్చు.

'విష్ణుధనువు' 1938లో ప్రచురించినా అందులో పీఠికలో అంతకుముందు ఏడు సంవత్సరాల క్రిందటనే అతని రచనలు చూచినట్లు శ్రీ శివశంకరశాస్త్రి వ్రాసినారు. దాన్నిబట్టి తెలుగులో ఈ రకము కవిత్వము చెప్పినవారిలో కూడా ఇతడే ప్రధముడని ఊహించడానికి అవకాశమున్నది. రచన – ముందా, వెనకా అనే విచారము ఎట్లా ఉన్నా, సంపూర్ణమైన నవ్యత్వమున్న కవి ఇతడే. అయితే దేశములో ఇతనికి రాదగిన ప్రసిద్ధి ఇప్పటికి రాలేదు. అందుకు కారణాలు చాలా ఉన్నవి. ఇతను పత్రికలలో తన కావ్యాలు ప్రచురించడు. సభలకు రాడు. పదిమందిలోకి రాడు. వచ్చినా ఎక్కువ మాట్లాడడు. తాను వ్రాసినవి చదివి వినిపించడు. ప్రచురించిన గ్రంధాలకు ఎక్కువ వ్యాప్తి లేదు. వ్యాప్తి కోసము ఏమాత్రమూ ప్రయత్నించడు. ఎవరో ఒకరు ఆ కావ్యాలు చదివినా, అవి త్వరగా ఆకర్షించవు. అజాగ్రత్తగా చదివేవారికి అసందర్భపు వ్రాతగా తోచి హాస్యాస్పదంగా ఉంటవి. కాని శాంతముగా, శ్రద్ధగా అర్థము గ్రహించి అందము తెలుసుకోవలెనని ప్రయత్నించే వారికి, ఈకవికి తీవ్రమైన కవితాత్మ ఉన్నదనీ, నడకలలో అపూర్వమైన ఓజస్సు ఉన్నదనీ, స్పష్టపడక మానదు. కావ్యాలు సంపూర్ణంగా ఉదాహరించకపోతే ఇతని రచనలలో విశేషం గోచరించదు. విపులంగా ఉదాహరించే అవకాశ మిక్కడ లేదు. అందుకని త్వరగా అందం కనపడే కావ్యము ఒకటి కొంతమాత్రము ఉదాహరిస్తున్నాను.

"ఇటు వెన్నెల అటు వెన్నెల
నడిశిరసుకు శ్రీ వెన్నెల
ఇటు వెన్నెల అటు వెన్నెల
చిరునవ్వుల కలవెన్నెల"

ఇట్లా పదహారు పాదాలలో వెన్నెలను వర్ణించి చివరకు,

"ఇటు వెన్నెల అటు వెన్నెల
పిచ్చెత్తే వళ్ళంతా వెర్రెత్తే దిక్కులకై
పరుగెత్తే నామనసున
వెన్నెల్లో ప్రేయసిలేక
అమావాస్య! అమావాస్య! అమావాస్య!

మహాలయ అమావాస్య!"

ఈ కావ్యం ఎట్లా నడిచిందో చూడండి! సమంగా వెన్నెలకు సంబంధించిన అనేక భావచిత్రముల పరంపరతో 17 పంక్తులు నడిచింది. 18వ పంక్తిలో ఉద్రేకంతో కొంచెము మారింది. 19 పంక్తిలో చెప్పినట్లు ప్రేయసి లేకపోవడంవల్ల 20వ పంక్తిలో మూడుముక్కలుగా తెగిపోయింది. 21వ పంక్తిలో బాధ ఎక్కువై నిట్టూర్పు విడిచింది.

ఇటువంటి కావ్యం నిజమైన కవిగాని వ్రాయలేడు. ఇది భావచిత్రవాదులూ, సంజ్ఞావాదులూ, మాపద్ధతి అంటే మాపద్ధతి అని తగవులాడుకో వచ్చును. కొత్త Patterns కావలెననేవారు కూడా తాము కోరేది ఇందులో ఉన్నదనవచ్చును. కాని Pattern లో విశేష స్వతంత్రతా, ఉపజ్ఞా చూపించినది ఇందులోకంటే ఈకవి చెప్పిన ఇతరకావ్యాలలో ఎక్కువ గోచరిస్తుంది. దీన్ని అచ్చువేయడంలో మిగిలిన పాదాలకంటే చివరపాదం పెద్దఅచ్చులో వేసినాడు. భవిష్యద్వాదులు కావలెనని కోరినట్లు పేజీకి ఇరవైరకాల టైపులు వేతామనుకున్నా తెలుగులో అన్ని టైపులే లేవు. సిరాలు మార్చి, అచ్చువేసిన పేజీ తిరిగితిరిగి అచ్చువేసేందుకు దేశంలో డబ్బులేదు.

ఈకవి కావ్యాలన్నీ పైని ఉదాహరించిన దానివలె సులభముగా సాగవు. కొన్ని ఎంతశ్రద్ధగా చదివినా అయోమయముగా కనపడతవి. కవి అతి విచిత్రమైన 'ఊపుతో' చదువుతాడని పీఠిక వ్రాసిన శ్రీ శివశంకర శాస్త్రి, సమీక్షవాసిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఇద్దరూ వ్రాసినారు. కవి ముఖతహ ఈ కావ్యాలు వినడము నాకు తటస్థపడలేదు.

ఇతనిది శ్రీశ్రీ, నారాయణబాబు, ఇత్యాదులదివలె ఎక్కడినుంచో వచ్చిన కవిత్వం కాదు. తెలుగుగడ్డలో పుట్టి తెలుగుజీవితంతో పెరిగిన నవ్యకవిత్వ మితనిది.

ఇతను కవిత్వము సామ్యవాద ప్రచారము కోసముగాని, చివరకు కవిత్వములో ఏదైనా నవ్యతాప్రచారము కోసముగాని ఉపయోగించలేదు. ఒక్క 'నవమి చిలుక' మున్నుడిలో మాత్రమిట్లా అన్నాడు.

"నవమి చిలుక కులుకుతూ పలికింది!
పలుకులో నవ్యనవ్య కవిత్వం రాలింది!
నవ్యనవ్య కవిత్వం"

"ఇది నూతనములో బహునూతన కవిత్వం! అందుకనే ఇది పూర్వకవిత్వం గాదు. ఇది నవ్యకవిత్వంగాదు ఇది భావకవిత్వంగాదు!" 'నవమి చిలుక' చివర శ్రీ గోపీచంద్, బి.యే.,బి.యల్., విమర్శలో ఇట్లా అన్నాడు.

"భావకవులు పురాణకవుల మీదికి విప్లవం చేసి, జమీందారులను ఆశ్రయించి వారి కనుసన్నలకు నృత్యంచేసే కవిత్వాన్ని కేపిటలిస్టు రుచులకు అనుగుణంగా మార్చి, వారి అందుబాటులోకి తీసుకువచ్చారు. ఇప్పుడు ప్రజాసామాన్యం... భావ కవుల మీదికి ప్రోలిటేరియన్ విప్లవం చెయ్యడానికి సిద్ధపడుతోంది....

"వీరు ఈ విప్లవానికి వైతాళికులు.

"వినాయక పండితుడు సాధారణంగా కథా వస్తువును ప్రోలిటేరియను జీవితంలోనుంచి తీసుకుంటాడు. ప్రోలిటేరియను భాషను ఉపయోగిస్తాడు.'

* * *

"అందుకనే ఈ కవిత్వంలో బూర్జువా వాసన, ప్రోలిటేరియను యాస కనిపిస్తూంటాయి" అని చివరకు,

"ఈ పూర్వవాసనలను పోగొట్టుకుంటేగాని సిసలైన ప్రోలిటేరియన్ కవిత్వం రాదు. "వినాయకపండితు"లను ఈ విషయం గమనించ గోరుతాను".

అని ఉపదేశించినారు.

ఈ కవి గడుసువాడు. వాఙ్మయములో సమగ్రదృష్టిగల శ్రీ శివశంకర శాస్త్రిచేత 'విష్ణుధనువు' కు పీఠిక మాత్రము వ్రాయించి, దానికి ఆంధ్రత్వము రూపొందించిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణచేత సమీక్ష చేయించి; 'నవమిచిలుక' చివర కేవల సామ్యవాదులు ఏమంటారో తెలుపడానికి శ్రీ గోపీచందు 'విమర్శ' ప్రచురించినాడు. కవి ఈ పనులు చేసి నవ్వుకొని ఉంటాడు. ఇతను కవిత్వమును గురించి సిద్ధాంతాలు చెప్పలేదు. వాదాలు చేయలేదు. కాని 'విష్ణుధనువు' మిత్రులకు అంకితము చేస్తూ ఇట్లా అన్నాడు.

"మాటకు మాటాను మాటల అర్థం ఉండాలి! ఉంటుంది! సమాసాలు సందర్భానుసారంగా కొంతవదులుతో పరవాలేదు! "వ్యాకరణంతో వ్యభిచరించడము కూడదు గాని Poetryలో కొంత స్వేచ్ఛ అవసరం! న్యాయం!

"రమ్యత అనేది, రంజింపజేయుట అనేది కావ్యానికి ముఖ్యము. రమ్యత అనగా ఎరుపు పచ్చరంగులుగల రామచిలుకవలె భావమూ రసమూ సరసగా కనబడుతూ కలిగించుటే!

"నిజానికి ఇవన్నీ Philology కీ అలంకారశాస్త్రానికీ సంబంధించిన విషయాలు. ప్రత్యేకంగా పరిశీలించాలి; తత్త్వశాస్త్రవిషయాలూ అంతే!"

ఈ కవి తన రచనలూ, రచనాపద్ధతులూ ఆంధ్రలోకము ఇంతకంటే ఎక్కువగా తెలుసుకొని విచారణ చేసే అవకాశము ఇస్తే ఎక్కువగా బాగుంటుంది.

(ప్రతిభ – జులై 1940)

విమర్శనము

# శాంతిని*

**ఎడిటర్:** ఉమామహేశ్వరరావు శిష్ట్లా, గుంటూరు.
**విడి పత్రిక:** అణాన్నర సంవత్సరానికి రూపాయి.

మోరాల్ (Morale) అన్నదానికి 'శాంతిని' అనేది తెలుగుట. పైగా నూతన సృష్టిట. ఈ శాంతిని చిత్రభానులో తలెత్తింది – ధర్మం, శీలం, సత్యం ల కోసం.

సంపాదకులు తమ ఆశయాన్ని నలుగురికీ తెలపాలని చాలా ప్రయత్నించారు గాని, వారి శైలిగరుకై, బిరుసై, వారి తెనుగు కృతకమై, సాంకేతికమై వారు వొచ్చి వ్యాఖ్యానం చేసి చెప్పినా తెలుస్తుందా!? అనే సందేహాన్ని కలిగించడంవల్ల నాకు అది తెలీదని ఇక్కడ నా అజ్ఞానాన్ని నగ్నంగా వొప్పుకుంటున్నాను. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'సత్యం శివం సుందరం' అన్నది సంసార పక్షంగానూ, శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి కథ పాకాన పడి సుష్టుగానూ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఉమామహేశ్వరరావు, శిష్ట్లా, దేశిరాజు కృష్ణశర్మ, అనిసెట్టి సుబ్బారావు, పెనుమర్తి కామేశ్వరరావు ప్రభృతుల పద్య, వ్యాసాలూ రచయితల మామూలు పనివాడితనానికి దూరంకాకుండనూ ఉన్నై. బెల్లంకొండ రామదాసుగారి 'బ్రతుకు' కొంచెం లోతుగా పరిశీలించండని కోరుతుంది పారకుణ్ణి.

ప్రజానీకానికి ఒకింత సేవ చేద్దామనే ఉద్దేశంతో తల ఎత్తిన ఈ 'శాంతిని' తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోటానికైనా తన తేజస్సును ఒకింత తగ్గించుకుంటేనే తన కర్తవ్యాన్ని గాఢంగా నేరవేర్చుకోగలుగుతుందేమో.

– జ.రు.
(భారతి, 1942 – ఏప్రిల్)

***

* ఈ సంచికే మొదటిది కావచ్చు. తరువాత కొద్దికాలమే నడిచిందన్నారు. మిగిలిన సంచికలు లభించలేదు. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారే జ.రు. ॥సం॥

# పదాల పునఃసృష్టికర్త-శిష్ట్లా

- శ్రీరంగం నారాయణబాబు

యీనాడు అతినవీనులమని బోరవిరుచుకు తిరుగుతున్న అతి నవీనులకుకూడా నవీనుడు శిష్ట్లా. ఏనాడో అతినవీనమైన మార్గంలో కవిత్వం రాసి లోకంచేత విస్మరింపబడ్డాడు. అతినవ్యకవిత్వం ఎన్ని కొత్త పోకడలు పోగలదో అన్నిటినీ పోయి చూచాడు. భావ కవిత్వంనుంచి అధివాస్తవికత వరకు. కవిత్వంలో యీయన ప్రత్యేకత ఏమిటంటే, పదాల పునఃసృష్టి (Recreation) కోసం ప్రయత్నం చేశాడు. ఆదిని పదాలు స్ఫటికాలు (Crystals) లాగ, బహుముఖాలతో, జీవన చైతన్యంతో, నిండుగా మమ్మల్ని, అంటే కవులను పులకితం చేసేవి. రాను రాను పాతపడి, అరిగిపోయి, అందరి నోళ్లా పడి, అర్థం తూచుకొనే గుండురాళ్లలా తయారయాయి. యీ మర్మం తెలుసుకున్నది శిష్ట్లాకవిత్వం.

కొందరు కవులు వాక్యాన్ని మాటలతో పూలమాల కూర్చినట్లు కూరుస్తారు. కొందరు వాక్యాన్ని గూడ్సు రైలుబళ్లలాంటి మాటలతో కడతారు. శిష్ట్లా చేతిలో మాటలు, వాక్యంకూడా రబ్బరులా సాగుతాయి. అటు పూలమాలలు కట్టినట్టు వాక్యాన్ని కట్టినవారిని మరీ సుకుమారం అని యీసడించారు. రబ్బరులా వాక్యాన్ని, పదాన్ని కూడా వినియోగించి చూపిన శిష్ట్లాని పోల్చుకోలేక పొమ్మన్నారు. రైలుబళ్లల్లా మాటలు పేర్చినవారిని మన్నన చేస్తున్నారు. పండితుల మనుకుంటున్న పామరులకు, పామరుల్లాంటి పండితులకు కవిత్వంతోపాటు కొంత గందరగోళంకూడా కావాలి.

★ ★ ★

ఈనాడు కవిత అభ్యుదయ పథాలనంటి మానవజాతి పురోగమనం కోసం ఒక మహనీయ పథాన్ని చేపట్టింది. ఇది మానవ జాతి అంతటికీ ముక్తినిస్తుంది. అతి నవ్యకవులంతమందీ కూడా ఈ ఋజుమార్గంలోనే తమతమ కలాల్ని నడిపిస్తున్నారు.

ఈ అతినవ్య కవులలో మూడోతరానికి చెందినవాడు "సంఘర్షణ" రచించిన శ్రీ రెంటాల గోపాలకృష్ణగారు. శ్రీశ్రీ, నేనూ, శిష్ట్లా, రుక్మిణీనాధశాస్త్రీ మేమంతా వంశపురుషులం. మొదటి తరం వాళ్ళం. శిష్ట్లా విషయంలో ఇక్కడ కొంత చెప్పవలసినది ఉంది. శిష్ట్లా అతి నవీనుల్లో కడు ప్రాచీనుడు. శిష్ట్లాచేసిన సాహితీ సేవ ఏమిటి అంటే వేలకొలది సంవత్సరాలనుంచీ అందరినోటాపడి అరిగిపోయి వాటంచెడిన నిస్సారమైన మాటలను పునస్సృష్టి చెయ్యడానికి ప్రయత్నించాడు (Re-Creation of Words).

# సంపూర్ణ నవ్యత్వమున్న కవి శిష్ట్లా

- ఆచార్య కురుగంటి
- పిల్లలమర్రి

అతినవ్యులలో శిష్ట్లా అసాధ్యుడు. ఇతనికి 'మహేశ్వర్,' 'వినాయక పండితుడు,' 'ఉమా,' 'విజయమహేశ్వరం' – మొదలైన పేర్లెన్నో ఉన్నవి. గుంటూరుజిల్లా మంచాళ అగ్రహారానికి చెందిన ఉత్తమ వైదిక కుటుంబంలో (1912 ?) జన్మించినాడు. ఈతని జీవితము చిత్రమైనది. 'విశృంఖల విహారము' ఎక్కడా నిలకడ అంటూ లేకపోవడం – కారణాలుగా యువకవులలో ఎవరికీ లేనన్ని స్వేచ్ఛా జీవితానుభవాలితనికి లభించినవి. ఈతని ప్రతిభ అద్వితీయమైనది. హాస్యప్రియుడు, మంచి మాటకారి. కళాశాలల్లో పనిచేసి విద్యార్థులతోను, 'ఫరమ్సు'లో (బొంబాయి) పనిచేసి ప్రజలతోను, మిలటరీలో పనిచేసి సిపాయీలతో ఇంకా ఇతరులతోను ఈతడు సంపాదించిన అనుభవం విచిత్రమైనది. అది యితని రచనలలో సర్వత్ర కన్పిస్తూనే ఉంటుంది. నూతన ఛందస్సులలో, ఇతడు కొత్తభాషతో, సులభంగా అందరికీ అంతుపట్టని కవిత్వం చెప్పినాడు. ఆంగ్లములో ఎం.ఏ. అయి ఆ కవితారీతులన్నిటినీ పరిశీలించి జీర్ణించుకున్నవాడు. 1931 నుంచే ఇతడాధోరణులలో రచనసాగిస్తూ వచ్చినట్లు తెలుస్తుంది. 1938 దాకా అజ్ఞాతంగానే ఉన్నాడనవలె. అయితే నోరి వారన్నట్లు 'రచనముందా, వెనుకా అనే విచారము ఎట్లా ఉన్నా సంపూర్ణమైన నవ్యత్వమున్న కవి ఇతడే'. ఇతనికి రాదగిన ప్రసిద్ధి రాకపోవడానికి తాను అందుకు యత్నింపక పోవడమే కారణమనవలె. 1938లో "విష్ణుధనువు", 'నవమిచిలుక' లనే పుస్తకాలను ప్రచురించినాడు. 'శాంతిని' అనే పత్రికను కొద్దికాలం పాటు గుంటూరునుంచి సంపాదించినాడు; తర్వాత తర్వాత పత్రికలలో కథలు, పాటలు ప్రచురిస్తూ వచ్చినాడు. ఈతని "విష్ణుధనువు" విచిత్ర ఖండకావ్యసంపుటి "ఇందులో ప్రేమ ఉద్భ్రాంత ప్రేమ" 'ప్రేమ అంటే ఆత్మ నిర్వాణముచే ఆరాధించుటయే' అంటాడితడు. దీనిలో ఉన్న నవ్యతను గూర్చి, వైచిత్రిని గూర్చి, కవి ప్రతిభనుగూర్చి ప్రస్తావిస్తూ తల్లావఝుల విశ్వనాథకవులు ఈయువకుని వీపుతట్టి గుణదోషాలను ఎన్నినారు! అతినవ్యతకు ఇతని రచనలలో కొన్ని పాదాలను ('విష్ణుధనువు' లోనివే) ఉదాహరణలుగా చూడండి :

ఇటు వెన్నెల
నడి శిరసుకు
ఇటు వెన్నెల
చిరునవ్వుల
ఇటు వెన్నెల
విరులల్లిన

అటు వెన్నెల
శ్రీ వెన్నెల
అటు వెన్నెల
కల వెన్నెల
అటు వెన్నెల
జడ వెన్నెల

ఇట్లా ప్రారంభించి పదహారు పాదాలయ్యేసరికి –
ఇటు వెన్నెల అటు వెన్నెల
పిచ్చెత్తే వళ్లంతా వెర్రెత్తే దిక్కులకై పరుగెత్తే నామనసున
వెన్నెల్లో ప్రేయసి లేక
అమావాస్య! అమావాస్య! అమావాస్య!

మహాలయ అమావాస్య

'భావకవిత్వపు బాటలలో నడిచిన ఉత్తమభావుకుడు శిష్ట్లా. అయితే పదకవితపైన హెచ్చుగా మోజుకలవాడనవలె భాషాభావాలలో అతి నవ్యధోరణి తెచ్చి పెట్టడానికి, నవ్యఛందస్సులను నడిపించడానికి ఉద్యమించిన వారిలో శిష్ట్లాప్రథముడని మరువరాదు. భావకవిత్వం నుంచి అధివాస్తవికతవరకు. కవిత్వంలో యీాయన ప్రత్యేకత ఏమిటంటే పదాల పునఃసృష్టి (Re-creation) కోసం ప్రయత్నం చేశాడు. అదిని పదాలు స్ఫటికాల (Craystals) లాగ, బహుముఖాలతో, జీవన చైతన్యంతో, నిండుగా కవులను పులకితం చేసేవి. రానురాను పాతపడి, అరిగిపోయి, అందిరి నోళ్లాపడి, అర్థం తూచుకొనే గుండురాళ్లులా తయారయాయి. యీామర్మం తెలుసుకున్నది శిష్ట్లాకవిత్వం".

ఉమామహేశ్వర్ ప్రచ్ఛన్న ప్రవక్తృత్వాన్ని ఎవరింకా కాదనగలరు? శిష్ట్లా వ్రాసిన "సిపాయి కధలు" వస్తువులోను, కథనములోను నవ్యమార్గానికి చెందినవై ఆంధ్రకథానికా సాహిత్య విచార సందర్భాన మంచి స్థానము గడించి పెట్టేవిగా ఉన్నవి. ఈతడు వ్రాసిన "కాళింగి పాటలు"న్ను తెలుగుపద కవిత్వానికి నూత్నాలంకారాలనదగినవి. పిల్లలకోసమని ఈయన వ్రాసిన పాటలు, కథలు పత్రికలలో ఎన్నో ప్రచురితమైనవి గణింపదగినవి. అయితే ఏమి? నవ్యత ఉన్నంతగా నాజూకు లేక పోవడము మూలాన, ప్రతిభ ఉన్నంతగా భాషాపాటవం, ప్రాపకమూ లేక పోవడము మూలాన ఇతనికి ప్రాచుర్యము తన జీవితకాలానే లభించకపోయినదని చెప్పవలె.

(నవ్యాంధ్ర సాహిత్య వీధులు చతుర్థ భాగము)

★ ★ ★

## నిశీధ సౌందర్యద్రష్ట

ఉమా విష్ణుధనువులో దేశంలోని సమ్యక్ దృక్పథానికి దూరమై, నిద్రాణమై, నిర్వేదరూపమైన, అశాంతి, అసంతృప్తిని, నిశీధ సౌందర్య మూర్తిగా దర్శించాడు.

– దేశిరాజు కృష్ణశర్మ (ప్రతిభ)

# మంచి నటుడు ఉమా

ముద్దు కృష్ణ రచన 'అనార్కలీ' నాటకం గుంటూరు పురమందిరంలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు పంచమ వార్షికోత్సవం (1939 జనవరి 23, 24లలో) 24వ తేదీ రాత్రి ప్రదర్శించారు. అందులో సలీంగా శిష్ట్లా ఉమామహేశ్‌గారు సభ్యుల మెప్పులు పొందినారు.

– *ప్రతిభ (ధాత – శిశిర సంచిక)*

★ ★ ★

# ప్రయోగశీలి శిష్ట్లా

సంపాదకులీ గ్రంథపీఠికలో శిష్ట్లా రచనలతోనే కాల్పనిక యుగం తరువాత వచ్చిన ఆధునిక యుగం ప్రారంభమైందన్నారు. ఇది శిష్ట్లాతో ప్రారంభించిందనడంకంటే కాల్పనిక యుగంలోనే గురుజాడవంటి కవులలో వీరు నిర్దేశించిన అత్యాధునిక కవితా బీజాలు మొలకెత్తాయని చెప్పడం న్యాయ్యం. శిష్ట్లా కవిత చాలావరకు ప్రయోగాత్మకంగానే (Experiment) ఉండిపోయింది గాని స్వచ్ఛమైన అభివ్యక్తి అంతరువు అందుకోలేకపోయింది. అదీగాక, ఈయన వాడిన 'నవమి చిలుక' వంటి కవితా సంకేతాలు పాఠకులలో విస్పష్టమైన ఆకృతి పొందలేక అర్థక్లిష్టత కూడా కలిగిస్తున్నాయి.

('గ్రంథ విమర్శనం' అన్న శీర్షిక కింద 'కల్పన' కవితాసంపుటిని సమీక్షిస్తూ సందర్భవశాత్తూ ఇలా ప్రస్తావించారు. సమీక్షకుడి పేరు లేదు.

– భారతి (1953 జూలై)

# కళాపరాయణ పలాయనం

- శ్రీశ్రీ

**భారతి జూన్ 1946 మాసపత్రికలో సిపాయి కథల సమీక్ష సందర్భంలో ॥సం॥**

మరో ప్రపంచం గీతం రాయడానికి ముందు 1934వ సంవత్సరం ఫిబ్రవరి నెల 18వ తేదీని ఎడ్గార్ పో గంటలని అనురణిస్తూ (అనువదిస్తూ కాదు) ఒక గేయం రాశాను. అందులో–

*"హరోం హరోం హర హర హరహరహర*
*హరోం హరా అని పలికే గంటలు"*

అన్న పాదాలు తతిమ్మా గేయంతో బేలన్సు కాకపోవడంవల్ల వాటిని ఉపసంహరించాను. రెండు నెలల తర్వాత ఆ 'హరోం హరోం హర' నించే మరో ప్రపంచం గీతం వెలువడిందని అనవచ్చును.

ఇదే విధంగా ధ్వని సామ్యాన్నే వెతుక్కుంటూ వెళ్ళితే అప్పట్లో బరంపురం నవ్యసాహిత్య పరిషత్తులో శ్రీ శివశంకర శాస్త్రిగారు చదివిన–

*మారోమారో, మారోమారో,*
*ఒకటి రెండూ మూడు నాలుగు,*
*మారో మారో మారో మారో"*

అనే శిష్ట్లా ఉమామహేశ రచన కూడా ఒక ప్రోద్బలమే అని చెప్పాలి.

భావకవిత్వ పద్ధతులూ, గ్రాంథిక భాషలో పద్యరచనా వదిలిపెట్టి వ్యావహారిక భాషలో నవీన ధోరణిలో సాగించిన నా మొదటి రచన–

*"నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను"*

అన్నది. దీన్ని 1933 జూన్ 2వ తేదీని రాశాను. అప్పటికే శిష్ట్లా ఉమామహేశ విలక్షణమైన ఒక నవీన ధోరణిలో రచన సాగిస్తున్నాడు. కాని సరాసరిగా అవి నా రచనను ప్రేరేపించలేదు. శిష్ట్లా ప్రభావంతో ముద్దుకృష్ణ వ్రాస్తున్న వచన గీతాలు ఎప్పటికప్పుడు ముద్దుకృష్ణ ముఖతానే నేను వినేవాడిని. వచన గీతాన్ని కళారూపంగా తీర్చిదిద్దడానికి మున్ముందుగా నేను కొంత శోధనా, సాధనా సాగించాను. హరీంద్రనాథ్ గీతాలూ, మరికొన్ని ఆంగ్ల గీతాలూ తెనిగించడం ద్వారా యీ పరిశోధన చేశాను. స్వతంత్రంగా రాసిన నా మొట్ట మొదటి వచన గీతం విద్యున్మాలికలు.

*"బారులు బారులుగ తీరిన*
*మబ్బు గుబ్బలుల దారుల*
*దారి తప్పి చరించె ఆ రేయి*
*తరళ సరళేరమ్మదములు..."*

ఇత్యాది గీతం. ఇది గ్రాంధిక భాషలో ఉండడం ఇక్కడ గుర్తించాలి. ముద్దుకృష్ణనీ శిష్ట్లానీ ప్రేరేపిస్తూన్న పాశ్చాత్య కవుల దగ్గరికి సరాసరిగా వెళ్ళాను. ఆంగ్ల కవులతో సంతృప్తి కలుగలేదు. ఫ్రాన్సు జర్మనీ దేశాల కవుల ఆకర్షణకి ముగ్ధుణ్ణయ్యాను.

శ్రీ శ్రీ సాహిత్యం
రెండు
వచన విభాగం 1970

★ ★ ★

## ఒకటి రాక్షస రాత్రులు

★ ★ ★

ఒకానొక రాత్రి దీన్ని "ఉమ్మయ్యతో గుంటూరు రాత్రి" అనిగాని, "గుంటూరులో ఉమ్మయ్యరాత్రి" అని గాని, "ఉమ్మయ్యా, నేనూ, నాటుసారా" అనిగాని, "గడ్డివాముకి మంట పెట్టి, ఉమ్మయ్య నన్నందులో" అనిగాని లేదా టూకీగా "హోమో–హోమం" అని గాని అనవచ్చు. ఏమి అనకుండానే రాయనూవచ్చు.

ఉమ్మయ్యంటే శిష్ట్లా ఉమామహేశ! అతనే ఉమామహేశ్వర వినాయకం, క్షమాపరాత్పర కృపాకరం, దయారసార్ణవ దవానలం (ఇందులో మొదటిదే అతను పెట్టుకున్న పేరు. మిగిలినవన్నీ ఆ బాణీలో నా సొంత కల్పన) అప్పటికే శివశంకరశాస్త్రి, విశ్వనాథల ఉపోద్ఘాతాలతో అతని "విష్ణుధనువు" అచ్చయి వచ్చేసింది. "నవమి చిలుక" కూడా వెలువడిందనుకొంటాను. అప్పటికింకా నా "మహాప్రస్థానం" గీతాలు పత్రికల్లోనే నిద్రపోతున్నాయని జ్ఞాపకం. కవుల వలయాల్లో మాత్రం కల్లోలం పుట్టిస్తూనే ఉన్నాయి. అది వేరే కథ.

ఇక "నిషా విషామృత మశూచికం" దగ్గరికి వద్దాం. ఆ రోజుల్లో అతను "కాళింగి" అనే మహాకావ్యం రాస్తున్నానని చెప్పేవాడు. అందులో యుద్ధాలన్నిటినీ ముగించే యుద్ధంలాగ, కవిత్వాన్ని ముగించే కవిత్వం ఉందని మా నమ్మకం. కళ, ఇంగితం కలిపి "కాళింగి" అనే సమాసం చేశాడట. ఇది ఎలా సాధ్యమో నాకు బోధపడలేదు. నీకు బోధపడదులే అన్నాడు. బాధపడ్డాను, జేమ్సుజాయిస్‌ని ఎందుకు చదివేనా అని! జాయిస్‌లో నానా భాషాపద సముచ్చయాలు కోకొల్లలు. కాని అవి పరిశోధన ద్రావకంలో పరిశీలనకు లొంగుతాయి. "కాళింగి" మీద పరిశోధన అనవసరం! నళిని గెస్టుగా నేను గుంటూరు వెళ్ళేను. అతని దగ్గర స్కాచి విస్కీ ఉంది. అది వదులుకోని నాటు సరుకు ఆహ్వానాన్ని అంగీకరించాను.

నాటు సారా విషయంలో నాకు దేశభక్తిలేదు. మనకల్లు, మనసారా అనే వెధవల్ని తంతాను. కనీసం ఇందులోనైనా నాది అంతర్జాతీయ దృక్పథం. అసలైన తెలుగువాడికి సిసలైన పొరుగింటి పుల్లకూర నచ్చుతుంది. అందుకే నేను రూపాయికి నూరుపైసల తెలుగువాణ్ణి. ఆ రాత్రంతా అయ్యో నేను స్కాచికి దూరం అయిపోయానే అని బాధపడుతూ ఉన్నాను. మళ్ళీ మన "కళాపరాయణ పలాయనం" దగ్గరికి వద్దాం. ఉమ్మయ్య అజానుబాహుడు. నన్ను తనముందు నిలబెట్టి

ఒకే ఒక ప్రశ్న వేశాడు. ఇవాళ తెలుగుదేశంలో నిన్ను కమ్యూనిస్టు పార్టీవాళ్ళు మహాకవి అంటూ దుమారం రేగిస్తున్నారు. నిజమైన మహాకవిని నేను! ఇది నువ్వు ఒప్పుకుంటావా లేదా? అని నిలదీసి అడిగేడు.

"నేను ఒప్పుకున్నాననుకో! నీకేం ఒరిగింది? లోకం ఒప్పుకోవద్దా?" అన్నాన్నేను. అతనిలో కరడుకట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకత ఉంది. అదో సుపీరియారిటీ కాంప్లెక్సు. అది వున్నచోట ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు కూడా వుంటుందని మనస్తత్వవేత్తలంతా ఒప్పుకున్నదే. ఉమ్మయ్య నాముందు ఎంతగా సుపీరియారిటీ (నేనే గొప్ప వాణ్ణనే) ఫోజులు కొడుతున్నా అంతరాంతరాల్లో మాత్రం తన దౌర్బల్యానికి తానే క్రుంగిపోతూండడం నేను పసికట్టేను.

అక్కడే వుంది కమ్యూనిస్టు వ్యతిరేకతలోని కిటుకంతా! సాటివాణ్ణి నీతో సమానుడుగా అంగీకరించలేవు! ఉమ్మయ్య కవే! నేను కవినే! నీకంటే నేను గొప్పవాణ్ణని నేనెప్పుడూ వూరేగలేదు. తనకంటే నేను తక్కువ కవినని నాచేత ఒప్పించాలనే శిష్ట్లా తాపత్రయం ససేమిరా నేనొప్పుకోనన్నాను.

అప్పుడో ముగ్గురు కుర్రాళ్లు వచ్చారు. 14, 15 ఏళ్ళ వయస్సువాళ్ళు, ఉమ్మయ్య హోమో అని అప్పటిదాకా నాకు తెలియదు. కాళ్ళు పట్టించుకోవడానికి ఎందుకో పిలిపించాడనుకున్నాను. కాదు ఏకలింగ సంభోగంలోని ఔన్నత్యం గురించి నాకో లెక్చర్ ఇచ్చాడు. శిష్ట్లా, షేక్స్పియరు, మిచిలేంజిలో, ఆస్కార్ వైల్డ్ అంటూ ఏకరువు పెట్టాడు. వీళ్ళంతా గొప్పవాళ్లు కావడానికి వీరిలో ఉన్న ఏకలింగ ప్రియత్వమే అని నన్ను నమ్మించడానికి ప్రయత్నించాడు. వైల్డ్ మాటేమోకాని షేక్స్పియర్ హోమో అని నేను అంగీకరించలేదు. ఇలా వాదోపవాదాలు పెరిగేయి. శిష్ట్లా నన్ను అమాంతంగా ఎత్తుకొని గిర్రున తిప్పడం మొదలు పెట్టేడు. ఆరడుగులు మనిషేమో, నేను ఆకాశంలో రంగులరాట్నం మీద తిరుగుతున్నట్లు అనిపించింది. ఎదురుగుండా ఒక గడ్డివామును భావించుకొని, తన "ఊహల్లోనే" దానికి నిప్పంటించి అందులో నన్ను పడేశాడు. అక్కడే నన్ను వదిలేసి కుర్రాళ్ళను వెంటపెట్టుకొని ఇంట్లోకి వెళ్ళిపోయాడు. తాను నాకంటే గొప్ప కవినని నాచేత అనిపించలేక పోయినందుకు నన్ను గాలిలో తిప్పి గడ్డివాములో తగలేశాననుకున్నాడు.

– *[ప్రజాతంత్ర 4–5–1975]*

---

శ్రీశ్రీ సాహిత్యంలోనూ - అనంతంలోనూ శ్రీశ్రీ అభిప్రాయాల సంకలనం ఈ వ్యాసం. ॥సం॥

# అతినవ్యులలో అతినవ్యుడు

- డా॥ ఆరుద్ర

అతని గొంతుక సొంతగొంతుకే, కానీ అది వింత గొంతుక. అతని దారి ముళ్ళదారి. అది నలుగురూ నడవలేని రహదారి. అతని కవిత చూడచక్కని జాతిగుర్రం. అయినా అది తనకు కూడా లొంగని పెంకి రెక్కల గుర్రం.

అతని పేరు శిష్ట్లా ఉమామహేశ్వరరావు. అతనికి 'మహేశ్వర్, 'వినాయక పండితుడు,' 'ఉమా,' 'విజయమహేశ్వరం' మొదలైన కలం పేర్లు చాలా ఉన్నాయి. ఎప్పుడు ఏ పేరు వాడుకుంటాడో తెలియదు. ఎప్పుడు ఏతోవన నడుచుకుంటాడో తానేచెప్పలేడు. అతడుకవి. అతినవ్యులలో అతినవ్యకవి.

1933లో బరంపురంలో జరిగిన 'అభినవాంధ్ర కవి పండితసభ"లో మొట్ట మొదటిసారిగా ఉమామహేశ్వరం మంచి ప్రతిభావంతుడైన కవిగా లోకానికి పరిచయమయ్యాడు. ఆ పరిచయం చేసింది తల్లావఝల శివశంకరశాస్త్రిగారు. ఆయన, ఈ కవి – సత్యాగ్రహులపైన, పోలీసులు లాటీఛార్జి చేస్తున్న విషయాన్ని కథనం చేస్తూ రచించిన గీతాన్ని చదివి ప్రేక్షకులను ఉర్రూతలూగించారు.

మారో మారో – మారో మారో
ఒకటీ రెండూ – మూడు నాలుగు
మారో మారో – మారో మారో

అని ప్రారంభమయ్యే ఈ గీతం పూర్తి పాఠం నేడు లభించదు. దీనిని 1933లో లోకం తొలిసారిగా విన్నా ఇదే ఉమామహేశ్వరం తొలిరచన కాదు. అతడు తన 19వ యేటనే 1931లో కొత్త రీతులతో కవితలల్లడం ప్రారంభించాడు.

అతడు 1912లో గుంటూరు జిల్లాలోని మంచాళ అగ్రహారంలో జన్మించాడు. అనూచాన సంపద గల వైదిక కుటుంబంలో పుట్టినందువల్ల అతనికొక రకమైన సంస్కారం అబ్బితే అతడు ఏరికోరి పురాణగాథలతో పాటు జానపద గీతాలమీద పెరిగాడు. ఆరీతులు అతడు పిలిస్తే పలుకుతాయి. అధ్యాత్మ రామాయణ కీర్తనలంటే అతనికి ప్రీతి. ఎందరో వాగ్గేయకారుల కృతులు అతనికి వచ్చు. గుంటూరులో చదువుకొన్నాక, కాశీ విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. అక్కడ గ్రంథాలయంలో చాలా పుస్తకాలు చదివాడు. ఆంగ్ల సాహిత్యములో ఎం.ఏ. పట్టభద్రుడయ్యాడు. ఇంగ్లీషు కవిత్వంలోని మలుపులన్నింటినీ అవగతం చేసుకొన్నాడు. కవితల నడకలలోని మెలకువలు తెలుసుకున్నాడు.

కళాశాలల్లో కొన్నాళ్ళు పనిచేశాడు. విద్యార్థులకు బోధించాడు. వారివల్ల తాను నేర్చుకొన్నదెంతో ఉండవచ్చు. బొంబాయి నగరానికి వెళ్ళి అక్కడ వ్యాపార సంస్థలలో ఉద్యోగం చేశాడు. మళ్ళా గుంటూరులో 'శాంతిని' అనే పత్రికను కొన్నాళ్ళు నడిపాడు. వెల్కం ప్రెస్‌లో ముద్రితమయ్యే ఈ పత్రిక ఎన్నాళ్ళు వెలువడిందో,

దీనిలో ఉమామహేశ్వరం ఏయే రచనలు అచ్చువేశాడో తెలియదు.

జ్వాల పత్రిక పెట్టడానికి ముందే ముద్దు కృష్ణ 1933లో ఉమామహేశ్వరం ప్రభావం వల్ల వచన గేయాలు రాయడం ప్రారంభించాడు. ముద్దుకృష్ణ ద్వారానే వచన గేయాలూ, ఉమామహేశ్వరం రచనల వివరాలు ఇతరులకు తెలిసేవి. జ్వాల పత్రికలో ఉమామహేశ్వరం రచనలు ఎన్ని అచ్చుపడ్డాయో తెలియదు. 1935లో జ్వాల మూడవ సంపుటి ఒకటవ సంచికలో 'ఆత్మహత్య' అనే నాటికను ఈ కవి ప్రచురించాడు. అందులోని మూడు అంకాల్లోనూ ఎక్కువగా పిల్లల ఆటపాటలతో రాశాడు.

1938లో అతడు 'విష్ణుధనువు,' 'నవమి చిలుక' అనే రెండు కవితా సంకలనాలను ప్రచురించాడు.

'విష్ణుధనువు' అర్ధపావు డెమ్మీ సైజులో 62 పుటల కావ్యం. దీని తొలి ముద్రణ ప్రతులను 128 (అక్షరాల నూట ఇరవై ఎనిమిది మాత్రమే) అతడు ముద్రించాడు. దీనికి శివశంకరశాస్త్రిగారు పీఠిక రాస్తే పుస్తకం చివర విశ్వనాథ సత్యనారాయణ గారు 'సమీక్ష' రాశారు. కావ్యమంతా ప్రణయకవిత్వమే. అయితే అది భావకవుల రొటీన్‌ప్రేమకాదు. నాయికా నాయకులు సీతా రాములు. సీతలో ఈ కవి చెంచీతనూ, పరాశక్తినీ, ద్వాపర లక్ష్మిని, అలమేలుమంగను చూడగలడు. 'సర్వమానవ సమిష్టి బాధ్యతను వెలలేని వెన్నెముకపై మోయుచున్న సీత' అంటాడు. ఆమె నిశీధ సౌందర్య మూర్తి. సీత ప్రకృతి. రాముడు పరమ పురుషుడే గాని అయితే అతనిలో ఇంకొందరు ఆ మాటకొస్తే అందరూ ఉన్నారు. ఉదయనుడు, కృష్ణుడు, ప్రవరాఖ్యుడు, లక్ష్మీనరసింహ స్వామి, వేంకటేశ్వరుడు, శివుడు, చివరకు అభిమన్యుడు కూడా వున్నారు. సీతను ఏమని పిలవాలి? కవి ఇలా సమాధానం చెప్తున్నాడు.

"తల్లివలె చల్లని కనులతో జూతువుగాన
తల్లీ యనగ తప్పలేదు!
చెల్లెలివలె చనువు మీర సరస జేరుదువుగాన
చెల్లీయన చేటురాదు
మేధామద విదళిత వికసితవుగాన
మైథిలి వందు!
ఆత్మాంతరమున 'విట్' దేహవాసివిగాన
వైదేహివందు!
చాళుక్య హోయసాల చినచోడాంబవుగాన
సాలగ్రామ సీతవందు!
కుండలినీ షట్చక్రతతికి యధిపతివిగాన
క్షేత్రవతి వందు!
అందును, ఎందును లేని నామముల నేరికూర్చి
గడియకొకరీతి పిలుతు
అదియునుగాక అన్నిటికి మిన్నయౌ

శ్రీవి నీవేయని
పురుషకారమే పరశురామమందు! నేనే రాముడ!
ఇదియ నాయింగితము
ఇదియ నావిష్ణు సంగీతము!

ఈ రామునిలో పరశురాముడే కాదు. రావణుడు కూడా ఉన్నాడు. అతని పదితలలను సీత మాత్రమే మళ్ళీ పుట్టకుండా సంహరించగలదు. ఈ సంగతి కవి ఇలా చెప్పాడు.

"నాకు నేనే రావణుడ నేమో యనునటుల
అణచిన నణగక చంచలమై దశముఖముల
చూడ్కులు నిగిడించు నా చిత్తము పై నీ చిరు
వీక్షణ కటాక్షముల కటారిపోటులు
శిరముల త్రుంచుగాని మరలన్కరల
ప్రాణములు వచ్చు, అటుగాదు నీ హృదయ
వైకుంఠమున నున్న మూలబలముతో
నొకేసారిగ వేయుము నాగర్భకుహరాంతర
కుండలినీ నాడిపై, నీయందు గలియుదు
వివశ ప్రాణినై నెచ్చెలీ సీతా!"

సీత మనస్సులోనికి నాయకుడు ప్రవేశించడం చాలా కష్టం. దానికి ఉన్నదొకే ఒకదారి. ఆ సంగతి ఇలా చెప్తున్నాడు.

"దారులు పదివేలు లేవు నీ మనఃపద్మవ్యూ
హమును జొచ్చుటకు; గడి గడికి గడియకు
ఏ యతిరథ మహారథులడ్డెడుదురో
యుద్ధమునకు నేనొంటరివాడ! మత్పూర్వ
పిత్రులు లేరు బీడుపడిన యీ కలి
సంగ్రామభూమి ప్రవేశించితి బాలకుడ
నైన నేను! వెనుదిరుగట రాదు మా
వంశమున! ఆరంభించిన కార్యమాపుట
మా యింటన్లేదు! అయిన, ఐనను, అన్నిటికి
నిన్నే యుత్తరవాది జేసి నే ఢీకొందును
దారులు పదివేలు లేని, కోటి
నూటపదారు దారులు లేని, నీమనః
పద్మవ్యూహమును ప్రేయసీ!"

ఈ సీతభూమిజ కాదు. తానే క్షేత్రపతి. తానే జగద్భారాన్ని వహిస్తున్నది. అష్టదిగ్గజముల వలె సీత ఈ క్షితిని మోయుచున్నది. 'రండు సాయమొనర్పరండు' అంటాడు. సౌమిత్రీ! ఇంకా విశ్వామిత్రుడు రాడేమి? అంటాడు. వెన్నెముకలో వైకుంఠం విష్ణుధనువుగా ఉంటుందట. సీతను పొందడానికి ఇంకో ధనుర్భంగం కావాలి.

'స్వయం' ప్రేమ
మాయయై మనసులో వైకుంఠ మిదేయని
వెన్నునే విష్ణుధనువుగ నుండును!
వెన్నెముక చీల్చుచూ భ్రమల పురికొల్పు
విష్ణుధనుశ్శరములే
భావ తరంగాలు!
భావాంతమున గదా భవ ప్రభాతము!
మేనియం దణగి యణగి
మన సంత 'వయమ్'
అనే అహము చేయు
విష్ణు ధనువు వంచి
చేరవలె సీతదరికి! శివధనువు ఫెళ్ళుమనును!"

ఈ కావ్యం నిండా ఉమామహేశ్వరం తాను చదివిన పురాణగాథలన్నింటిలోని ప్రతీకలను కలగాపులగం చేసి వాడుకొన్నాడు. కేవలం పౌరాణిక సంకేతాలనే కాక చరిత్రను కూడా తలుచుకొంటాడు. తన కాలంలో ఇతర కవులు రాష్ట్రగానంతో ఆంధ్రప్రశస్తీ, దేశభక్తీ ప్రబోధిస్తూ ఉంటే తన ప్రేమలోనే వాటిని ఇముడ్చుకోగలడు.

"చెప్పవోయ్ చూదాము ఏమాయ రూపముగ
సమృద్ధ సామ్రాజ్య శిల్పకళా కోవిదులు
శాతకర్ణీ రాజు లేదారి పోయిరో!
శౌర్యోదారులై రాష్ట్ర కూటులూ వీర పల్లవులూ,
సాహసధైర్య స్థైర్యోపాసకులా ఓరుగంటి ఒంటరులు,
వాఙ్మయ పోషక విజయనగరాధిపతులు, పల్నాటివీరులు
చాళుక్య సింహాలు, బొబ్బిలీ బెబ్బులులు, నాయక ప్రభువులు
నిరుడు నిష్ఠతో నిలబెట్టిన, నీటిలో నీరైన సంక్రాంతి దేముడేడీ?
ఏవోయ్ శత్రుమనస్తంభితాకారాలు దుర్గప్రాకారాలేవీ!
శోణితపు వాహినీ అల్లకల్లోలానంద రూపిణౌ
కృష్ణవేణీ ఉదకంబు కన్నీటి జలకంబులాయె నేమోయ్?
ఒకచే పురాణంబు నొకచే త్రిశూలంబుతో వీరశంఖారావ
ప్రచండ వాయువుల పురిగొల్పు దోర్వీరశైవులేరోయ్?
నిరుడు నీటుతో నిలబడిన నీటిలో నీరైన సంక్రాంతి దేముడేడీ;
సౌమిత్రీ!
నిరుడు మడిగట్టి నిలబడియు మట్టిలో మట్టియైన సంక్రాంతి దేముడేడీ?
విశ్వమా!
నిరుడు, ఆక్రిందటియేడా క్రిందటియేడు, సంక్రాంతి దేముడేమయ్యె?
సౌందర్య నిశీథమూర్తీ!
నిరుడు నిష్ఠతో నిలబడిన నీటిలో నీరైన సంక్రాంతి దేముడే కాష్ఠానపోయె?"

ఈ కావ్యంలో నాయిక నిశీధ సౌందర్యమూర్తి అయినా అది వెన్నెల రేయి అయితే ప్రేయసి చెంత నుండకపోతే ఈ వెన్నెలంతా వృధా.

"ఇటువెన్నెల
నడిశిరసుకు
ఇటువెన్నెల
చిరునవ్వుల
ఇటువెన్నెల
విరులల్లిన
ఇటువెన్నెల
చెంగల్వల
ఇటువెన్నెల
ఈశ్వరునికి
ఇటువెన్నెల
ఆకాశము
ఇటువెన్నెల
మనసుల్లో
ఇటువెన్నెల
ఎటుచూచిన
ఇటువెన్నెల

అటువెన్నెల
శ్రీవెన్నెల
అటువెన్నెల
కలవెన్నెల
అటువెన్నెల
జడవెన్నెల
అటువెన్నెల
జిగివెన్నెల
అటువెన్నెల
తలవెన్నెల
అటువెన్నెల
మొలవెన్నెల
అటువెన్నెల
మరువెన్నెల
అటువెన్నెల
కనువెన్నెల
అటువెన్నెల

పిచ్చైత్తే వళ్ళంతా వెర్రెత్తేదిక్కులకై పరుగెత్తే నామనసున
వెన్నెల్లో ప్రేయసి లేక
అమావాస్య! అమావాస్య! అమావాస్య!
మహాలయ అమావాస్య!"

అందుకే 'వెన్నెల్లో వడగండ్లు రాలినై, వెన్నెల్లో వడగాడ్పు' వీచింది. ఈ ప్రణయకవిత్వం రాయడం వృధా అని కవికి తెలుసు. ఆ సంగతి తన గుండెకు ఇలా చెప్పుకొంటాడు:

"హృదయమా! ఈ నీ పద్యరచన లామెకు చేరవు!
చేరినను ఆమె చదువబోదు! పిమ్మటనైన
నిర్మల ప్రణయోష; పీయూషధారలచే
ఉప్పొంగు నిన్ను తెలుసుకొనజాల దిస్సీ!
బాధలు పొందుచునైన విడువక వ్రాయు
రచనలివియేల! ఏల యీ ముప్వ జవ్వనము!? "

అయినా రాయక తప్పదు. అందుకే ఉమామహేశ్వరం ఈ కావ్యాన్ని రచించాడు. శివశంకరశాస్త్రిగారూ, విశ్వనాథ సత్యనారాయణ వంటి వారు దీనిపై అభిప్రాయాలిచ్చారు. సమకాలికులు ఈ కవితలను చదివో, వినో సంతోషించారు. అయితే విస్తృత ప్రచారం లభించలేదు.

విశ్వనాథ సత్యనారాయణగారు తన సమీక్షలో చెప్పినట్టు ఈ కావ్యంలో

మనోహర కవితాశక్తి గల వాక్యాలనేకం ఉన్నాయి. కవి గొప్ప ప్రతిభావంతుడు. ఈ కావ్యంలోని రచనా విధానం గురించి విశ్వనాథ ఇలా అన్నారు:

"ఈయన కవిత్వములో మాత్రాప్రస్తావన లేదు. పాద నియమమూ లేదు. క్రొత్త పాదము మొదలు పెట్టినపుడు సర్వత్ర విశేషార్థద్యోతకముగా మొదలు పెట్టబడిందని చెప్పటకు వీలులేదు. కాని ప్రతిగీతంలోను ఒక వూపు ఉంటుంది. ఆ వూపు మధ్య మధ్య విరిగిపోతూ వుంటుంది. కొన్ని చోట్ల పూర్వకవుల వృత్తములను తలపించే భాగాలు కూడా వుంటవి చూడండి.

"లలనా వెన్నెల వేళ తీయని" – ఇది మత్తేభవృత్తము యొక్క మొదలు. "ఝుంఝూ మారుత ఝుర్ఝరీధ్వనులు" – ఇది శార్దూలము యొక్క మొదలు. "ఆ బ్రహ్మమున్నాదినే ఏలా వ్రాయగ లేదు నిన్నుదుటిపై" – ఇది శార్దూలము. ఒక పాదములో యతి దగ్గర నుండి రెండవ పాదములో యతి వరకూ "ఏ మహాటవిజొచ్చెనో నామనస్సు" – ఇది తెటగీతి పాదము. ఈయన లక్షణమెరుగునో ఎరుగకనో ఎరిగి తిరస్కరించెనో? ఎరుగక వీనిని సంస్కారము చేత పొదగు కొన్నాడో!"

ఇక్కడ ఒక ముఖ్య విషయాన్ని గుర్తు పెట్టుకోవాలి. అక్షర గణబద్ధ ఛందస్సులను వదిలి గద్యం రాస్తున్నప్పుడు మన పూర్వకవులు ఆ గద్యపు ఎత్తుగడలలో వృత్తగంధి వచనాలే రాశారు. ఉదాహరణకు: నన్నయ్యగారి వచనాలనే తీసుకొని చూద్దాం. (మనం నేడు 'వచనము' అనే వాటిని పూర్వం గద్య అనే వారు.)

*"అని యడిగి వాని యనుమతంబున సోమ*
*శ్రవసుందనకుం బురోహితుం గావించు*
*కొని వాని నభీష్ట సత్కారముల సంతుష్టు*
*నిం జేసి తదుపదేశంబున" (ఆది –1–89)*

ఈ వచనంలో ఎత్తగడ కందపద్య పాదంగా ఉంది. చూడండి

*"అని యడిగి వాని యనుమత*
*మున సోమ శ్రవసు...."*

ఇంకొక ఉదాహరణ చూద్దాం.

*"అని నిశ్చయించి గొంతిని మాద్రినింజూచి*
*మీర లిందుండి నవయక హస్తిపురంబు*
*నకుం జని...." (ఆది–5–61)*

ఇది సీస పద్యపాదం. చూడండి–

*"అని నిశ్చయించి గొంతిని మాద్రినింజూచి*
*మీరలిందుండి నవయకహస్తి..."*

నన్నయగారు సాధారణంగా ఆశ్వాసప్రారంభమున వచనాలను సీసపద్య పాదాలుగానే రాసేవారని పరిశోధకులు చెప్తున్నారు.[1] ఆదిలో నన్నయ్యగారు వచనాలకు వాడిన టెక్నిక్కునే ఆధునిక కవిత్వంలో ఉమామహేశ్వరం అవలంబించాడు. భారత కవుల

---

1 నిడుదవోలు వెంకటరావు–తెనుగు కవుల చరిత్ర–పుట 121

అక్షర గణబద్ధ ఛందస్సుల శృంఖలాలు తెంచుకొనడం కష్టం అవి కవికాళ్ళకు చుట్టుకొన్నట్టు ఫీలవగానే వృత్తపాదాన్ని ఖండించి, వచనం జోడించే విలక్షణమైన ధోరణిని ఉమామహేశ్వరం మొదలు పెట్టాడు. పద్యం గద్యంలోనికి పరిణామం చెందుతున్న దశలో ఇది సహజం. జీవకోటి పరిణామ క్రమంలో ఎన్నెన్నో ఆకారాల జంతు జాలం జనించక తప్పలేదు. పద్యాల నుండి నేటి వచన పద్యం అవతరించే లోపున ఎన్నో అవతారాలెత్తింది. ఉమామహేశ్వరం విష్ణు ధనువులో వాడినది ఒక మజిలీలోనిది. భాష చాలా వరకు గ్రాంథికమే. ఏలపదాలు, స్త్రీల పదాలు మొదలైనవి కవి వాడుకుంటున్నప్పుడు కొంత రిలీఫు కనపడుతుంది. భావకవుల కావ్యవస్తువుకే దుస్తులు మార్చి ఇందులో కవి ప్రదర్శించాడంటే అది యుగధర్మం. తెలుగు ధోవతిలో టక్ చేసిన తెల్లవాళ్ళ షర్ట్సూ, నెక్టైౖ, కోటూ, తలమీద తలపాగా వంటి వేషం ఒక నాటి పెద్ద హోదాలలో ఉద్యోగస్తులు ధరించిన ఆహార్యమే. విష్ణు ధనువులోని కవితల భాషా, ఆహార్యం ఇవాళ ఏదోలా కనబడవచ్చుగాని అనాడు కొత్త పోకడల ప్రారంభాలను సూచిస్తుంది.

విష్ణుధనువు తర్వాత 1938లోనే ఉమామహేశ్వరం ప్రచురించిన ఇంకో కావ్య సంకలనం 'నవమి చిలుక' ఈ పుస్తకంలో తనపేరు 'ఉమా విజయ మహేశ్వర వినాయక్' అని ప్రకటించుకొన్నాడు. ఆదిలో ఒక మున్నుడి, చివరగోపీచంద్ గారి విమర్శగల ఈ 64 పుటల పుస్తకంలో 18 ఖండికలు ఉన్నాయి. 'కొన్ని పద్యపాదాలు, కొన్ని బందో బస్తయిన గీతికలు, కొన్ని నారాయణదాసుగారి నడకల వంటి నడకల రచనలు ఇందులో కనబడతాయి. ప్రతి ఖండిక 'మధురంగా, పలకడానికి అనువుగా ఉంద'ని విమర్శకులు భావిస్తున్నారు.

విష్ణుధనువులో ఉమామహేశ్వరం ప్రేమ అంటే ఏమిటో నిర్వచనం చేశాడు గాని, 'నవమి చిలుక'లో తన కవిత్వం ఏమిటో చాలా విపులంగా వివరించాడు. 'నవమిచిలుక మున్నుడి' అనే ఖండిక చూడండి.

"నవమిచిలుక కులుకుతూ పలికింది! పలు
కులో నవ్యనవ్య కవిత్వం రాలింది! నవ్య
నవ్య కవిత్వం–ఇది నూతనములో బహునూతన
కవిత్వం! అందుకనే ఇది పూర్వ కవిత్వం
గాదు ఇది నవ్య కవిత్వం గాదు, ఇది భావ
కవిత్వం గాదు!
అజ్ఞము హిరణ్యాకాశ్యపుడు! శంక హిరణ్యా
కాశ్యపుడు! అధైర్యము హిరణ్యాకాశ్యపుడు
అస్థిమితము హిరణ్యాకాశ్యపుడు!
మూలము సమూలముగా త్రెంచి హృదయ
సభామంటప స్తంభము పగిల్చి మనస్సు
విజృంభించి నరసింహమూర్తిత్వము తాల్చును!
అప్పుడే ప్రహ్లాద 'కవిత్వమాహ్లాదముగా
ఉద్భవిస్తుంది.

అందాము ప్రహ్లాద కవిత్వమిది అని
అందాము అందుకొని ఆదరిద్దాము!
నవమి చిలుక పలికింది ప్రహ్లాద కవిత్వము!
ప్రహ్లాద కవిత్వంలో ప్రౌఢత్వమున్నది
పామరత్వమున్నది! దేశివిదేశికి నేస్తమున్నది!
ప్రహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగు
ల్చుతుంది! పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది!
తాను నిలుస్తుంది!
ప్రహ్లాద కవిత్వములో సావిత్రీ సత్యవంత
జీవితమున్నది!
ప్రహ్లాద కవిత్వములోని గాయత్రి అందరికీ తల్లి!
ప్రహ్లాద బ్రహ్మయే నవమి చిలుక! నవమి
చిలుక పలుకులే ప్రహ్లాదం కవిత్వం! అమూల్య
మూల కవిత్వం!"

'నవమి చిలుక' సంకలనంలో నిజంగా ప్రౌఢత్వం పామరత్వాలు కనపడతాయి. ఈ వాస్తవాన్ని విమర్శకులు ఈ విధంగా వ్యాఖ్యానించారు.2

"తన కవిత్వము ప్రజలలోని పామరత్వమును తొలగించి, స్తబ్దత తుడిచివేసి వారిలో ఆశలు పెంపొందించునని, జాగృతి కలిగించునని; ఈ విధముగా అది ప్రయోజన గర్భితమని కవి అభిప్రాయము. ఈ నిర్వచనమును పురస్కరించుకొనియే దీనికి 'విమర్శ' వ్రాసిన గోపీచంద్ గారు భావకవులపై జరుగుచున్న 'ప్రొలిటేరియన్ విప్లవమున'కీ కవి దారి తీయుచున్నాడని అయినను ఈ కవి కావ్యము అచ్చముగా శ్రామికవర్గ సంబంధికాదని ఈ కవిత్వంలో బూర్జువావాసన ప్రొలిటేరియన్ యాస కనిపించుచున్నదని వ్యాఖ్యానించినారు. గోపీచంద్‌గారి వ్యాఖ్యానము సత్యదూరము కాదు. నవమి చిలుకలోని వస్తువు ప్రజాసామాన్యమునకు సంబంధించినది. ముఖ్యముగా గ్రామ జీవనములోని వివిధ సంఘటనలను గర్భీకరించుకొని ఉదయించినది. వస్తు విషయములో ఇది అచ్చమైన ప్రజా కవిత్వము, తన్నిర్వహణలో మాత్రము అభ్యుదయ కవిత్వ స్థాయినందుకొనలేదు. వస్తువులో, ఛందస్సులో 'నవమి చిలుక' చక్కని ప్రయోగమని చెప్పవచ్చును"

స్త్రీ జీవిత చిత్రణలో ఉమామహేశ్వరం వాస్తవానికి ఎంత చేరువగా వెళ్ళగలడో అంతకన్నా ఎక్కువగానే వెళ్ళాడు. 'ఊట్ల వెంకమ్మ,' 'పుట్టింటిపిల్ల,' 'ఆడవాళ్ళు,' 'జ్ఞాపకాలు' అనే ఖండికలు చెప్పకోదగ్గవి. ఎన్నో నోములు నోచినా చివరకు ఉట్టెక్కి ఉరిపోసుకొనే వాళ్ళూ, ఆశలు అడుగంటిన వాళ్ళూ వీటిలో ఉన్నారు. పుట్టింది మొదలు పోయే వరకూ అందరూ ఉండి ఏకాకి అయిన యువతి జాలిగాథను 'జ్ఞాపకాలు' చెప్పాయి. చూడండి ఆ ఖండిక.

2 సి. నారాయణరెడ్డి—ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు—పుటలు 524–5

"నా పేరు లీల!
ఆ ఊరిగోల పడలేక నేను పారుగూరొ
చ్చాను! అందాలవాడే అడవిలో ముం
చాడు! అందరిని తలచుకొని అల్లాడు
చున్నాను.
ఏకాకినై నేను దూరాన ఉన్నాను. దారినే
పొయే అమ్మలక్కలు జేరి ముండ్లచూపులు
చూచి అడుగుతూపోతారు.
ఏకాకినైనేను నడిజాము వరకూ మేలుకొని
మృత్యువును బ్రతిమాలు కొన్నాను!
అమ్మమ్మ జ్ఞాపకం, అమ్మ జ్ఞాపకం, చెల్లెలు
జ్ఞాపకం! నాన్న జ్ఞాపకం, అన్నలే జ్ఞాపకం,
తమ్ములే జ్ఞాపకం అందరిలో నువ్వే ఆఖరి
జ్ఞాపకం! రావేల! రావేల రాత్రి వచ్చింది!
మధురమౌమగవాడ నాప్రేమనిజమోయి!
ప్రాభాతమౌ వేళ జ్ఞాపకాలొచ్చాయి!
తలిచి తలిచీ నిన్ను జ్ఞాపకాలొచ్చాయి!
పవళింపు సమయాన జ్ఞాపకాలొచ్చాయి!
తలనొప్పి తీర్చుతూ తలగడగ రావోయి!
చలికాలమొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!
చైత్రమాసమొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!
వర్షాకాలమొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!
పిలుపులకు పలకనందుల్లకై ఈఘడియ
ఈక్షణము జ్ఞాపకాలొచ్చాయి! రావేల
మగవాడ! ఒడ్డూ పొడుగూ వాడ!
ఏకాకినై నేను ఏదారిపోయినా, పిలుపు
పిలుపుకు పలికే జ్ఞాపకాలొచ్చాయి! ఏకా
కినై నే ఏ పనిజేసినా తలపు తలపుకు
త్రవ్వి జ్ఞాపకాలొచ్చాయి! మరో పిల్లను
నీవు మరులు గొల్పావో, వేరో
పిల్లకు నీవు ఉరులు వేశావో, రావోయి
రావోయి త్వర త్వరగ రావోయి, నాకన్ను
చెదిరింది పురుషులను జూస్తూ!
బుల్ బులుల హోయికై కిలకిలల జోలకై
పరితపించే మనసు! కన్నీళ్ళ హృదయమా!
బుల్ బులుల మన్నా కిలకిలల మన్నా
ముత్తైదు ముద్దుటుయ్యాలకే కద్దు!
బులుబులు బులాహోయి యీా

హోయమ్మ, నెవ్వరూ పురిగొల్పినా వారు?
పురిగొల్పినావాడు పురుషుడేకాడు! మగ
పిల్లవాడవో, ఆడపిల్లవోనీవు, మగవాడవై
నీవు మాయదారివవకుండ, ఆడపిల్లవై నీవు
అర్ధాన్న మవకుండ ఎన్నెమ్మయ్యే వచ్చి
పురుడు పోసింది! కొత్తెమ్మయే వచ్చి ఉగ్గు
కలిపింది! పోతరాజే వచ్చి చేదవేశాడు!
కొత్తెమ్మ యే వచ్చి చాటపరిచింది!
బులు బులుబులు బులాహోయీూ, యీూ!
హోయమ్మ నెవ్వరో చంకెత్తి కెళ్ళారు! నా
చన్నులో పాలు చేపుతున్నాయే! ఉయ్యా
లలో పిల్ల ఉబుసులే లేవు! నా చన్నులో
పాలు జున్ను లెత్తాయే!
హోయమ్మ కెవ్వరూ హోయన్నవారూ!
నీళాల సంద్రములో నిప్పుచ్చురము నేలపై
రాయినై యాహల్యనైనాను శ్రీరామ
చంద్రమూర్తీ! రామ! రామ! నా పేరు లీల!"

ఉమామహేశ్వరానికి మన నుడికారాలూ, జాతీయాలూ, సంప్రదాయాలూ చాలా బాగా తెలుసు. 'విష్ణుధనువు' లోనూ, 'నవమి చిలుక'లోనూ తెలుగు దేశపు పండుగలు, మదన పంచమి, రథసప్తమి, నాగుల చవితి, దేవీ నవరాత్రులు కనపడతాయి. అలాగే ఎన్నెమ్మ, కొత్తెమ్మ, పోతరాజు కనపడతారు. తన ప్రహ్లాద కవిత్వంలో పామరత్వం కూడా ఉంధని చెప్పడానికి దాఖలాగా 'బీదమందు' అనే కవితను, పామరుల భాషలోనే రాశాడు. చూడండి :

"తూర్పు తెల్లారింది, వానవెలిసింది! అమ్మ
పోయే మందెట్టుకు రాయే!
కాండబ్బైనా లేదు, కాసైనా లేదు! కాత్తె
కూత్తెకైతే డాక్టేరు రాడే!
సందేళ సలిజరం ఊర్కే పోదే! సందొచ్చిన
పిల్లోడు ఉలుకుతుండాడే!
ఏయాకో తింటుంది గజ్జెట్టిన కుక్క! నేపాళం
మాత్రెయ్యే, లేత్తాడు పిల్లోడు!
పాతాళం బలిసెక్రవర్తీ! సంకురాంతి పం
డక్కు నేపాళం సెట్టెక్కిరా! జబ్బులన్నీపోతాయి"!

ఉమామహేశ్వరం కవితలలోనే కాక ఆనాటి కొత్త కవులందరిలోనూ ఉన్న దోషాలు గురించి 'విష్ణుధనువు' సమీక్షలో విశ్వనాథ వారు ఇలా రాశారు.

"కొత్త కవిత్వంలో అర్థ దోషాలు ఎక్కువగా ఉంటవి. ప్రాత మార్గమున పోయెడి వారి కవిత్వము నిరర్థకత్వం వుండవచ్చు. కాని కొత్త కవుల వాక్యాలలో అపార్థం

వుంటోంది ... ... ... సంప్రదాయ భిన్నమై పోవుట, పూర్వ సంప్రదాయము తెలియకపోవుట, తెలియకుండ తెలిసినట్లు వ్రాయుట. తెలిసియో తెలియకయో దానిని నిందించుట. పరసంప్రదాయములను చొప్పించుట. ఇవి సంప్రదాయగతమైన దోషాలు. సంప్రదాయ మంటే మత సాంఘిక భాషాది సర్వ విషయాల్లోను.

"ఇన్ని దోషాలు వున్నవి అని చెపితే ఈ దోషాలు అన్నీ ఒక కవిలో మూటకట్టుకొని పడి వున్నవి అని కాదు. భిన్న కవులలో భిన్న భిన్న స్థలాలల్లో ఒక్కొక్క చోట కొంచెమెక్కువగా వున్నవని అర్థం. మేము గ్రాంథిక వాదులము అని అనుకునే వాళ్ళల్లో కూడా ఇందులో కొన్ని దోషాలు కుప్పతెప్పలుగా వున్నవి. కాని ఆదోషాలని అలంకార శాస్త్రం నిర్ణయించి చెపుతుంది. క్రొత్త కవులలో వున్న కొన్ని దోషాలు వ్యాకరణ శాస్త్రమే చెబుతుంది. వ్యాకరణ శాస్త్రాన్ని కాదంటే తెలుగుదేశంలో శబ్దాన్ని ప్రయోగించే పద్ధతి తప్పని చెపుతుంది. వాడుకలో సమాసాలు కొద్దిగా వేస్తాం. క్రొత్త కవులు వాడుకను దాటవేస్తాం. అప్పుడు వ్యాకరణం రాక తప్పదు. కాదనటానికి వీలులేదు. కనుక శబ్దము నందు అర్థమునందు దోషాలు వస్తున్నవి".

దీనికి జవాబుగా అన్నట్టు విష్ణుధనువు చిట్టచివర పుటలో ఉమామహేశ్వరం 1938 ఫిబ్రవరి 14వ తేదీనాడు ఇలా ప్రకటించాడు:

"మాటకు మాటాను మాటల అర్థం ఉండాలి! ఉంటుంది! సమాసాలు సందర్భానుసారంగా కొంత వదులుతో పరవాలేదు!

"వ్యాకరణంతో వ్యభిచరించడము కూడదుగాని Poetry లో కొంత స్వేచ్ఛ అవసరం! న్యాయం!

"రమ్యత అనేది రంజింపచేయుట అనేది కావ్యానికి ముఖ్యము. రమ్యత అనగా ఎరుపు పచ్చన రంగులుగల రామచిలుక వలె భావమూ రసమూ సరసగా కనబడుచూ—కలిగించుటే!"

ఉమామహేశ్వరం ఈ వాక్యాలు తన ఒక్కడి కవిత్వం గురించే కాక తన సమకాలిక యువకవులందరి తరఫునా చెప్తున్నట్టుంది. అయితే శివశంకరశాస్త్రి గారు అతణ్ణి, అందరితో కలపరు. ఆయన 'విష్ణుధనువు' పీఠికలో ఇలా రాశారు:

"ఊరందరిదీ ఒకతోవ. ఉమామహేశ్వరానిది ఒకతోవ! నాకు తెలిసినంతలో అతి నవీన మార్గంలో మొదట నడిచిన వాడు ఇతనే. రమారమి ఏడు సంవత్సరాల క్రిందట ఇతని రచనలు చూచి చకితుణ్ణి అయినాను. కావ్యవస్తు సంగతి విడిచి కావ్య శరీరం సంగతి ఆలోచిస్తే ఈ ఒంటి తీరే వేరు. తరువాత కొన్నాళ్ళకు పూడిపెద్ది వెంకటరమణయ్య, శ్రీశ్రీ, నారాయణబాబు, పురిపండా అప్పలస్వామి, రుక్మిణీనాథశాస్త్రి, కొడాలి ఆంజనేయులు మొదలయిన కవుల రచనలు బయలు దేరినవి. రమణయ్య Inter Rhyming కోసం యత్నించినట్టు కనపడుతుంది. శ్రీశ్రీ, నారాయణబాబూ Pattern verse పద్ధతిని వెళ్ళారు. కొంతమంది Vers libre వ్రాశారు. ఎలాగయినా వీటిలో ఎక్కువ భాగం Formal గా వుంటుంది. ఈ కవులకు సంగీతంలో అట్టే ప్రవేశం వున్నట్టు తోచదు. కొంత Ear for malody వుండటం చేత అల్లిక బాగానే సాగింది. 'ఉమా' మన సంగీతమూ, తెల్లవారి సంగీతము తెలిసినవాడు కావటం చేత కొంత విపరీత మార్గంలో విహరించినాడు.

రచనలో Formal beauty ఇతనికి ఇష్టం కాదు. ఎంతసేపటికి ఇతను వక్రగతులలో, ఊపులో, లయలో లాస్యం చేస్తాడు".

శివశంకరశాస్త్రిగారు అతి నవ్యకవిత్వానికి ఉమామహేశ్వరమే ఆద్యుడని చెప్పడం చారిత్రక సత్యమే. శ్రీశ్రీయే ఒకచోట ఒక ప్రశ్నకు సమాధానం చెప్తూ ఇది అంగీకరించాడు.[3] ఆ ప్రశ్న జవాబులు చూడండి.

ప్రశ్న: శిష్ట్లా ఉమామహేశ్వరరావుగారు మిమ్మల్ని Influence చేసినట్లుగా విన్నాను. ఎంత వరకు? నిజమా? వచన కవితలో మీరు ముందా? ఆయనా?

జవాబు: నామీద గురజాడ ఇన్‌ఫ్లుయన్స్ ఉంది. చింతా దీక్షితులు, బసవరాజు వీళ్ళు నన్ను గురజాడ దగ్గరకు చేర్చారు. ముద్దుకృష్ణ, నేనూ అదే దార్లో వెళ్తుండేవాళ్ళం. శిష్ట్లాని చూసినపుడు – I was really inspired నా కంటే ముందు శిష్ట్లాయే Start చేశాడు. ఇద్దరమూ ఒక్క దారంట వచ్చిన వాళ్ళమే".

ఈ ఒక్క సందర్భంలోనేకాక మరొకసారికూడా శిష్ట్లా ఆదిమస్థానాన్ని శ్రీశ్రీ అంగీకరించాడు. తాను రచించిన 'నేనుసైతం' అనే గేయం సంగతి చెప్పాక అతడు ఇలా అన్నాడు.[4]

"దీన్ని 1933 జూన్ 2న రాశాను. అప్పటికే శిష్ట్లా ఉమామహేశ విలక్షణమైన ఒక నవీన ధోరణిలో రచన సాగిస్తున్నాడు. కాని సరాసరిగా అవి నా రచనను ప్రేరేపించలేదు. శిష్ట్లా ప్రభావంతో ముద్దు కృష్ణ వ్రాస్తున్న వచన గీతాలు ఎప్పటికప్పుడు ముద్దుకృష్ణముఖతానే నేను వినేవాడిని".

ఒక్క శ్రీశ్రీయేకాక ఒకనాటి యువకవులందరూ ఉమామహేశ్వరానికి ఇవ్వవలసిన స్థానాన్ని ఇచ్చారు. శ్రీరంగం నారాయణ బాబు ఇలా రాశాడు.[5]

"ఈనాడు అతినవీనులమని బోర విరుచుకు తిరుగుతున్న అతి నవీనులకు కూడా నవీనుడు శిష్ట్లా ఏనాడో అతి నవీనమైన మార్గంలో కవిత్వం రాసి లోకం చేత విస్మరింపబడ్డాడు. అతి నవ్య కవిత్వం ఎన్ని కొత్త పోకడలు పోగలదో అన్నిటినీ పోయి చూచాడు. భావకవిత్వం నుంచి అధివాస్తవికత వరకు. కవిత్వంలో యీాయన ప్రత్యేకత ఏమిటంటే పదాల పునఃసృష్టి (Re-creation) కోసం ప్రయత్నం చేశాడు. ఆదిని పదాలు స్ఫటికాల (craystals)లాగ, బహుముఖాలతో, జీవన చైతన్యంతో, నిండుగా కవులను పులకితం చేసేవి. రానురాను పాతబడి, అరిగిపోయి, అందరినోళ్ళాపడి, అర్థం తూచుకొనే గుండు రాళ్ళలా తయారయాయి. ఈ మర్మం తెలుసుకున్నది శిష్ట్లా కవిత్వం".

'విష్ణుధనువు,' 'నవమిచిలుక' వెలుగు చూశాక ఉమామహేశ్వరం యుద్ధం రోజుల్లో మిలట్రీలో చేరాడు. ఏ ఉద్యోగంలో చేరాడో తెలియదుగాని ఎందరు సిపాయిలతోనో కలసి మెలసి వాళ్ళ అనుభవాలను అధ్యయనం చేశాడు. సైన్యం నుండి తిరిగి వచ్చాక 'సిపాయికథలు' అనే పుస్తకాన్ని రాశాడు. ఇవి వేటికీ అనువాదాలుకావు. స్వతంత్ర రచనలు, సొంత వర్ణనలు. ఈ కథల్లో తెలుగు సిపాయిల బతుకులు,

---

3 సృజన–1970 ఫిబ్రవరి. పుట 147

4 అనంతరం–పుట 183

5 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు'లో ఉదాహృతం. చతుర్థభాగం–పుట 737–8

ఆశలు అనుభవాలు చక్కగా చిత్రించాడు. ఈ కథల సంకలనాన్ని యువ బుక్‌డిపో వారు ప్రచురించారు. దీన్ని భారతిలో నారాయణ బాబు సమీక్షించాడు. అందులో ఇలా రాశాడు.[6]

"...శిష్ట్లా వ్రాసిన 'సిపాయికథలు' వస్తువులోను, కథనములోను నవ్యమార్గానికి చెందినవై ఆంధ్ర కథానికా సాహిత్య విచార సందర్భాన మంచి స్థానము గడించి పెట్టేవిగా ఉన్నవి. ఈతడు వ్రాసిన 'కాళింగి పాటలు'న్ను తెలుగుపద కవిత్వానికి నూత్నాలంకారాలనదగినవి. పిల్లల కోసమని ఈయన వ్రాసిన పాటలు, కథలు పత్రికలలో ఎన్నో ప్రచురితమైనవి గణింపదగినవి. అయితే ఏమి? నవ్యత ఉన్నంతగా నాజూకు లేకపోవడము మూలాన, ప్రతిభ ఉన్నంతగా భాషా పాటవం, ప్రాపకమూ లేక పోవడము మూలాన ఇతనికి ప్రాచుర్యము తన జీవిత కాలానే లభించక పోయినదని చెప్పవలె".

సిపాయిల్లాగే సమాజంలో ప్రత్యేకత గల ఇంకొక తరగతి వ్యక్తులు ఉన్నారు. వాళ్ళు ఆంగ్లో ఇండియన్‌లు. వీరి ఆచార వ్యవహారాలు, జీవన విధానాలు విలక్షణమైనవి. భారతదేశంలోని ప్రజానీకంలో తమది అంటూ ఒక ప్రత్యేకమైన సంస్కృతి గల ఆంగ్లో ఇండియన్ స్త్రీ–పురుషులను ఉమామహేశ్వరం చాలా చేరువలో పరిశీలించాడు. సిపాయిల కథల్లాగే 'ఆంగ్లో ఇండియన్ కథలు' అనేపేరుతో ఎన్ని కథలు రాశాడో కాని కొన్ని 1946లో 'ఢంకా' అనే మాసపత్రికలో ప్రచురణ పొందాయి. వీటిని ఎవరూ సంకలనం చేయలేదు. గ్రంథ రూపంలో రాలేదు. ఇవి సైన్యంలో ఉన్నప్పుడు రాశాడో తర్వాత రాశాడో తెలియదు.

ఉమామహేశ్వరం సైన్యం నుండి తిరిగి వచ్చాక కొన్నాళ్ళు 'ఆంధ్రపత్రిక'లో పనిచేశాడు. దాని అధిపతి శివలెంక శంభుప్రసాద్ గారు అతని సహాధ్యాయి. మద్రాసులో ఉమామహేశ్వరం, బెల్లకొండ రామదాసు, అబ్బూరి వరదరాజేశ్వరరావులతో వాళ్ళగదిలో ఉండేవాడు. ఆంధ్రపత్రికలో ఉద్యోగం ఆట్టేకాలం చేయలేదు. అతడు ప్రచురించిన ఇతర రచనలు బహుస్వల్పం. పిల్లల కోసం 'గోరింట రాక్షసుడు' అనే కథ చెప్పాడు. కాళింది పాటలు, దసరాదళం అనే నాటిక అనాటి పత్రికల్లో అచ్చుపడ్డాయి. 'ఆకాశవాణికథలు' మరో ప్రక్రియ. థియడోర్ డ్రెయిజర్ శేముషీ విశేషాలపై ఒక వ్యాసం భారతిలో రాశాడు. ఇంతకు మించి రచనల వివరాలూ, అతని జీవిత విశేషాలు పూర్తిగా తెలియవు.

ఉమామహేశ్వరం గురించి కొన్ని విడ్డూరపు కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇతనికి శ్రీశ్రీకి ఒక రకమైన Love-Hate భావాలు ఉండేవి. శ్రీశ్రీ ఒక చోట ఇలా ఒక అనుభవం కథనం చేశాడు[7] (ఉమామహేశ్వరాన్ని శ్రీశ్రీ ఉమ్మయ్య అంటాడు).

"...ఉమ్మయ్య అజానుబాహుడు నన్ను తన ముందు నిలబెట్టి ఒకే ఒక ప్రశ్న వేశాడు. ఇవాళ తెలుగు దేశంలో నిన్ను కమ్యూనిస్టు పార్టీ వాళ్ళు మహాకవి అంటూ

---

6 భారతి–జూన్ 1946

7 అనంతం–పుట–242–3

దుమారం రేగిస్తున్నారు. నిజమైన మహాకవిని నేను! ఇది నువ్వు ఒప్పుకుంటావా లేదా అని నిలదీసి అడిగేడు.

"నేను ఒప్పుకున్నాననుకో! నీకేం జరిగింది? లోకం ఒప్పుకోవద్దా? అన్నాన్నేను."

... ... ...

"శష్ట్లా నన్ను అమాంతంగా ఎత్తుకొని గిర్రున తిప్పడం మొదలు పెట్టాడు. అరడుగుల మనిషేమో, నేను ఆకాశంలో రంగుల రాట్నం మీద తిరుగుతున్నట్లు అనిపించింది. ఎదురు గుండా ఒక గడ్డి వామును భావించుకొని తన 'ఊహల్లోనే' దానికి నిప్పంటించి అందులో నన్ను పడేశాడు. అక్కడే నన్ను వదిలేసి కుర్రాళ్ళను వెంటబెట్టుకొని ఇంట్లోకి వెళ్ళిపోయాడు".

ఈ కథను శ్రీశ్రీ ఎందరికో చెప్పాడు. ఒకనోటి నుంచి ఇంకోనోటికి వెళుతున్నప్పుడు ఈ కథ కొద్ది మార్పులు సంతరించుకొంది. ఇదే కథను అబ్బూరి వరద రాజేశ్వరరావు కథనం చేశాడు. ఒకసారి ఒక వివాదంలో ఉమామహేశ్వరం శ్రీశ్రీతో "నిన్ను చంపేదాకా ఊరుకోనురా!" అని బల్లగుద్ది అన్నాడట. ఆ తర్వాత వరద మాటలు ఇలా ఉన్నాయి.[8]

"ఆ తరువాత కొన్నేళ్ళకి ఉమామహేశ్వర రావు అన్నంతపనీ చెయ్యటానికి ప్రయత్నించాడట. శ్రీశ్రీని గుంటూరు దగ్గర పొలాల్లో గడ్డివాముకు కట్టి కాల్చెయ్యపోయాడట. అదో పెద్ద కథ. శ్రీశ్రీ నాకు ఆ కథ చెబుతున్నప్పుడు అతనికళ్ళల్లో వెనుకటి భయం కనిపిస్తుండేది. అతణ్ణి కాల్చటానికి ప్రయత్నిస్తున్నప్పుడు "మారో మారో మారో" అని ఉమామహేశ్వరరావు పాడాడట".

శ్రీశ్రీ అనంతంలో చెప్పిన కథలో "ఒక గడ్డి వామును ఊహించుకొని తన ఊహల్లోనే దానికి నిప్పంటించి అందులో నన్ను పడేశాడు" అన్న మాటలు వరద రాజేశ్వరరావు కథలో "గుంటూరు దగ్గర పొలాల్లో గడ్డివాముకు కట్టి కాల్చెయ్య బోయాడు" అనే మార్పుకు లోనయ్యాయి. ఇదే కథను మరికొందరు చెప్పుకొనడం కూడా నేను విన్నాను. కథలకు కాళ్ళూ చేతులు వచ్చేటప్పటికి ఎన్నెన్ని పుట్టుకొచ్చాయో లెక్కకట్టడం సాధ్యం కాదు.

ఉమామహేశ్వరం మనస్సంచారాలు తొలి దగ్గర నుంచీ విచిత్రమైనవి. అవి దాగుడుమూతపడనివి. కత్తెరపెట్టినా తెగవు. అతని నడవడికి ఒక వరవడి లేదు. అవాంఛనీయమైన అలవాట్లూ, అభ్యంతరకరమైన తిట్లూ అలవర్చుకొన్నాడు. నిలకడ లేని జీవితంలో రానురాను తాగుడు, వాగుడు ఎక్కువైపోసాగింది. అందుకే నలభయ్యేళ్ళు దాటీ దాటగానే అతనికి నూరేళ్ళూ నిండిపోయాయి. అతని గ్రంథాలు నేడు గ్రంథాలయాల్లో అలభ్యాలు. అతని పేరు కొందరు సాహితీపరులకే తెలిసినదైపోయింది. ఇక కొన్నాళ్ళు జీవించి, అతడు చేయవలసిన కృషి చేస్తే రావలసిన పేరు వచ్చేదేమో అనిపిస్తుందిగాని సాహిత్య చరిత్రలో అతడు విడిచిపోయిన కొద్ది రచనల వల్లనే అతని సముచిత స్థానం చెక్కుచెదరదు.

(సమగ్ర ఆంధ్రసాహిత్యం – XIII)

---

8 కవన కుతూహలం – పుట 40–41

# మార్పుకు అంకురార్పణ

కాల్పనిక యుగం తన ముందు యుగంపై తిరుగబడినట్లే, కాల్పనిక కవితా యుగంపై ఆధునికయుగం తిరుగుబాటు చేసి విప్లవ పరివర్తనలను తీసుకొచ్చింది. ఈ మహోదయ ప్రథమరేఖలు శ్రీశిష్ట్లారచనలలో కనుపించాయి. కాల్పనిక యుగంపై విముఖత్వము, నూతనత్వం కోసం ఒక అవ్యక్త వేదన ప్రస్ఫుట మౌతాయి. అధునాతన పాశ్చాత్యసాహిత్య రీతులననుసరించడానికి, భాషను పునఃసృష్టి చెయ్యడానికి ఈయన ప్రయత్నించాడు. పురాతన రీతులనుంచి విడివడి, నూతన పథాన్ని అవలంబించి, రానున్న మార్పుకు అంకురార్పణ చేసిన ప్రథముడీయన.

- అవసరాల సూర్యారావు

[చింతన "కల్పన" ఆధునిక కవితా సంపుటి (1953)]

# ఉద్భాంత ప్రేమ ప్రవక్త

- డా॥ సోమసుందర్

1930తో భారత రాజకీయ చరిత్రకే ఒక గొప్ప మలుపు సంభవించింది. తెలుగులో నవ్యకవిత్వానికి ఒక దశాంతం ఏర్పడింది.

శిష్ట్లా ఉమామహేశ, శ్రీశ్రీలు 1930 నాటికి నవ్యకవిత్వంలో ఆత్మాశ్రయ ధోరణికి, ప్రణయ కవిత్వానికీ స్వస్తి చెప్పారు. ఆధునిక కవితాధోరణికి ఆద్యకృషి సల్పారు. వీరిరువురిలో ఆద్యులెవరు? అనే అంశం వివాదరహితం కాలేదు. కాలనిర్ణయమూ నిర్దిష్టంగా జరగలేదు. కాని రీతిగతమైన ఆధునిక ధోరణికి ఆద్యుడు శిష్ట్లాయేనని శ్రీశ్రీ కూడా అంగీకరించాడు.

శిష్ట్లా కావ్యనిర్మాణంలో ప్రాచీనతను పూర్తిగా విసర్జించుకోలేదు. వాక్య నిర్మాణంలోగాని, కవితాభివ్యక్తిలోగాని సంప్రదాయ బంధాలతో పెనుగులాట నుంచి ముక్తిపొందలేదు. ఆధునిక హేతువాద దృష్టికీ పూర్ణవికాసం కలగలేదు.

కావ్యవస్తువు వ్యష్టినుంచి సమష్టికి మారినా, ఆధునిక బూర్జువా యుగ వైలక్షణ్యమైన పీడిత వర్గ ప్రాతినిధ్యం మాత్రం శిష్ట్లా కవిత్వంలో ఛాయా మాత్రంగానైనా ప్రథమ దర్శనం చేయలేదు.

వేయేళ్ళ తెలుగు కవిత్వ చరిత్రలో అభావానికీ, ఆధునిక రీతికీ సంపూర్ణ సుస్పష్టరూపం శ్రీశ్రీ కవిత్వమే కలిగించిందనడం వివాదరహితమే!

శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీశ్రీ పుట్టిన రెండేళ్ళకి, 1912లో గుంటూరు జిల్లా మంచాళ అగ్రహారంలో జన్మించాడు. స్వామీ శివశంకరుల సాక్ష్యం ప్రకారం 'ఉత్తమ వైదిక కుటుంబంలో' జన్మించినట్లు విష్ణుధనువు పీఠికలో తెలుస్తోంది.

"మహేశ్వర్, వినాయక పండితుడు, విజయ మహేశ్వర మొదలైన ఎన్నో పేర్లతో ఎన్నో రచనలు చేశాడు" అంటూ పిల్లలమర్రి హనుమంతరావు నవ్యాంధ్ర సాహిత్య వీధులు (పు.734)లో పరిచయం చేశారు. "ఈతని జీవితం చిత్రమైనది. విశృంఖల విహారం, ఎక్కడా నిలకడ అంటూ లేకపోవడం, కారణాలుగా యువకులలో ఎవరికీ లేనన్ని స్వేచ్ఛా జీవితానుభవాలు యితనికి లభించాయి. ఈతని ప్రతిభ అద్వితీయమైనది. హాస్యప్రియుడు మంచి మాటకారి.

కళాశాలల్లో పనిచేసి విద్యార్థులతోనూ, బొంబాయి ఫరమ్స్‌లో పనిచేసి ప్రజలతోనూ, మిలిటరీలో పనిచేసి సిపాయిలతోనూ, ఇంకాయితరులతోనూ ఈతడు సంపాదించిన అనుభవం విచిత్రమైనది. అది యితని రచనలలో సర్వత్రా కనిపిస్తూనే ఉంటుంది. నూతన ఛందస్సులతో, ఇతడు కొత్త భాషతో సులభంగా అందరికీ అంతుపట్టని కవిత్వం చెప్పినాడు. ఆంగ్లంలో ఎం.ఏ. అయి, ఆ ఆంగ్ల కవితా రీతులన్నిటినీ, పరిశీలించి జీర్ణించుకున్నాడు. 1931 నుంచే అతడా ధోరణులలో రచన సాగిస్తున్నట్లు తెలుస్తుంది. 1938 వరకూ అజ్ఞాతంగానే ఉన్నాడనవలె... ఇతనికి తగిన ప్రసిద్ధి

రాకపోవడానికి  తాను అందుకు ప్రయత్నించక పోవడమే కారణమనవలె!" అంటూ అతని కవిత్వ, జీవిత విశేషాలు  పిల్లమర్రి వారే విశదీకరించాయి.

(శిష్ట్లా రచించిన అసంఖ్యాక ప్రకీర్ణ రచనలు కాక విష్ణుధనువు సంపూర్ణ కావ్యం. అంతకుముందే రచించిన* నవమి చిలుక రీతినిబట్టి ప్రకీర్ణ కావ్యమే. అందలి రచనలు విడివిడిగా  కొన్ని లభిస్తున్నాయే తప్ప, ఆగ్రంథం ఇంతవరకు ఎక్కడా లభించలేదు.)

నవమి చిలుక మున్నుడిలో అతను విశ్వసించిన నూత్న కవితాసిద్ధాంతాలను యిలా వివరించాడు; అతనికి సాక్షాత్కరించిన కవితాస్వరూపమే నవమి చిలుక, అది కులుకుతూ పలుకుతుంది. పలుకులలో  నవ్యకవిత్వం రాలుస్తుంది. నవ్యకవిత్వం అంటే నూతనత్వంలో బహునూతన కవిత్వం. అంటే యిది  పూర్వకవిత్వం కాదు. ఇంతవరకూ ఏది నవ్యకవిత్వమని పిలవబడుతున్నదో అదీకాదు. భావకవిత్వం అసలేకాదు.  అంటూ ఇన్ని మాటలతో అతను వివరించడానికి ప్రయత్నించినా అధునిక పదాన్ని మాత్రం  ఎందువల్లనో అతను సాధించలేక పోయాడు.

వర్తమాన లోకానికి హిరణ్యాకాశ్యపుడే అడ్డం అంటాడు. అంటే బంగారమనే రాక్షసుడేనని కవి భావన. ఆ హిరణ్యాకాశ్యపుడే వర్తమాన సమాజంలోని అస్థిమితానికి, అధైర్యానికీ కారణభూతుడవుతున్నాడు. ఆ హిరణ్యాకాశ్యపుని సమూలంగా త్రెంచడానికి, హృదయ సభామంటపస్తంభం పగిల్చి, మనస్సు వీర  నరసింహమూర్తిగా అవతరించక తప్పదని భావిస్తాడు.

అప్పుడే ప్రాహ్లాద కవిత్వం ఉద్భవిస్తుందని విశ్వాసం ప్రకటిస్తాడు. ఐతే ఈ అతినవ్యకవిత్వం  ఏపేరుతో పిలవబడాలి? అదే కవి విచారంలో నలిగిన సమస్య! దానిని అందరూ అందుకొని ఆదరించవలసి  ఉన్నది కనక ప్రాహ్లాద కవిత్వమని అందామన్నాడు. అలాంటి ప్రాహ్లాద కవిత్వాన్నే  నవమి చిలుక పలుకుతుందని కవి ఉద్ఘాటించాడు. ఈ కవిత్వంలో ప్రౌఢత్వం ఎంత ఉంటుందో, పామరత్వమూ అంతే ఉంటుంది. దేశికీ విదేశికి నేస్తమూ ఉంటుంది.

ఇది ఆరిపోయే దీపాన్ని రగుల్పుతుంది. వెర్రిగా పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది; తానూ  నిలుస్తుంది. అదీ శిష్ట్లాకు దర్శనమిచ్చిన నవమి చిలుక పలికే ప్రాహ్లాద కవితా స్వరూపం!

ఆ సందర్భంలోనే ఈ కవి ఒక విచిత్ర ఉద్ఘాటన చేస్తాడు. "ప్రాహ్లాద కవిత్వంలో సావిత్రీ సత్యవంత  జీవితమున్నది" అని. విగత ప్రాణుడైన భర్త ప్రాణాలను సాధించడానికి సావిత్రి దీక్షవహించింది.  మృత్యునాధునితో సంఘర్షించి విజేతగా సాక్షాత్కరించింది. జడమయ భౌతిక స్వరూపాన్ని  భాగ్యతమొనర్చే ఆత్మచైతన్యానికి సావిత్రి ప్రతీక!  సత్యవంతుడు భర్తగా తాను సాధించింది  ఏమీలేకపోయినా భార్య సిద్ధివల్ల పునరుజ్జీవితుడయ్యాడు. ఈ సత్యవంత శబ్దం ద్వారా  బాహిరమైన వాస్తవికతను స్ఫురింప చేశాడు కవి. సావిత్రీసత్యవంతులనూ వ్యక్తికీ సమాజానికీ

* విష్ణుధనువు తర్వాతే  నవమి చిలుక వచ్చింది. అందులో ప్రచురితకావ్యంగా విష్ణుధనువును పేర్కొన్నాడు. ॥సం॥

ప్రతీకలుగా భాసింప చేశాడు. సవితృ సంబంధి సావిత్రీ శబ్దం ద్వారా సముజ్జ్వల ప్రాణశక్తికి ప్రతీకగా నిలిపాడు.

బాహ్యావాస్తవికత, అంతశ్చైతన్యమూ అవినాభావదాంపత్యంగా తాను ప్రారంభించే ప్రాహ్లాద కవిత్వానికి రూపరేఖలను ప్రసాదించాలని కవి ఉద్దేశిస్తున్నాడు.

"ప్రాహ్లాద కవిత్వంలోని గాయత్రి
అందరికీ తల్లి!"

అన్నకవి వాక్కులో శరీరమును రక్షించే గాయత్రి సహజంగా సర్వులకూ మాతృత్వశక్తిగా భాసిస్తుందనీ, అది ప్రాహ్లాద కవితాశక్తిగా రూపాంతరం పొందాలనీ కవిసంకల్పం!

అలాంటి ప్రాహ్లాద కవితా బ్రహ్మయే నవమి చిలుక అంటూ తాను సందర్శించిన వినూత్న కవితా స్వరూప స్వభావాలను భావన చేస్తాడు. అది అమూల్యమైనదే కాక, మూలద్రవ్యం వంటిది కూడానని కవి భావిస్తాడు.

శిష్ట్లా ఉమామహేశ ఆంధ్రకవితా సంప్రదాయాలనన్నిటినీ ఆకళించుకొన్నాడు. వైదేశిక కవితా సంప్రదాయాలను అర్థంచేసుకొన్నాడు. దేశిరీతులను వంట పట్టించుకొన్నాడు. ఇంతనేపథ్యంతో అతినవ్యకవితా స్వరూపాన్ని భావించాడు. దాని అంతస్తత్వాన్ని నవమి చిలుక మున్నుడిలో అభివ్యక్తం చేశాడు. కనక శిష్ట్లా ప్రారంభించిన నవ్యతర కవితకు యిదే ప్రారంభం కావలసి వచ్చింది. ఈ కవితా నిర్వచనాల ప్రసక్తి విష్ణుధనువులో లేదు. కనక నవమి చిలుక శిష్ట్లా రచించిన తొలికావ్యంగా మనం నిస్సందేహంగా తేల్చుకోవచ్చు.

## ప్రాహ్లాద కవిత్వం

అది* 1946–47 ప్రాంతం. మనదేశానికింకా స్వాతంత్ర్యం లభించలేదు. ఒకనాడు తెలుగు దినపత్రికలో పడిన వార్త చదివి మ్రాన్పడిపోయాను. అనుమానాస్పదమైన పరిస్థితులలో శిష్ట్లా ఉమామహేశ్వరరావు భౌతిక కాయం పోలీసులకు స్వాధీనమైందని గుంటూరు విలేఖరి కథనమది. నాటికీ నేటికీ ఈ అనుమానాస్పద సన్నివేశం గురించి ఎక్కడా వెల్లడికాలేదు. అంతకన్న వివరాలూ తెలియలేదు.

దాదాపు ముప్పయ్యైదేళ్ళ ప్రౌఢ వయస్కుడు శిష్ట్లా శోచనీయ పరిస్థితుల్లో తనువు చాలించాడు. మనిషిని లోబరుచుకున్న అరాచక పరిస్థితులు ఎలాంటి దుష్ఫలితాలిచ్చాయో శిష్ట్లా జీవిత పరిసమాప్తి తేటతెల్లం చేస్తోంది. గుంటూరులో అతనికి మిత్రులు సన్నిహితులూ, అనుయాయులూ ఎందరో ఉన్నారు. మాడభూషి వెంకటాచారి వంటి మిత్రులూ ఉన్నారు. కాని వారెవరూ శిష్ట్లా జీవన్మరణాల గురించి ఎక్కడా వివరించక పోవడం విచారకరమే!

శిష్ట్లా గుంటూరు నుంచి శాంతిని అనే పత్రిక కొద్దికాలం పాటు నడిపినట్లు తెలుస్తోంది. ఆ పత్రిక ప్రతులెక్కడైనా లభ్యమయితే మరింత సమాచారం

* ఇది బహుశా 1956–57 కావచ్చు. ||సం||

అందుతుంది. అనాటి పత్రికలన్నింటా కథలు, పాటలు, నాటికలు ప్రచురించాడు. ప్రతిభలో ప్రచురితమైన కొన్ని రచనలు మాత్రమే లభిస్తున్నాయి. 1938లో ప్రచురించిన నవమి చిలుక, విష్ణుధనువు అనే రెండు కవితా సంకలనాలలోనూ విష్ణుధనువు విచిత్రకావ్యం.

నవ్యకవితకు అనూచాన సంప్రదాయంగా పరిఢవిల్లిన ప్రణయమే దీని యితి వృత్తము; కాని ఆ ప్రణయం పూర్వకవుల ప్రణయంతో పోల్చిచూస్తే సాదృశ్యత కన్న విభేదాన్ని అధికంగ భజించింది. ఈ కావ్యంలోని ప్రేమ – ఉద్భ్రాంత ప్రేమగా విశ్వనాథ సత్యనారాయణగారు పేర్కొన్నారు.

ఈ కవి దృష్టిలో ప్రేమ అంటే – ఆత్మనిర్యాణము నారాధించడమేనని పిల్లలమర్రి వారు వివరించారు (రచన ముందా వెనకా అనే విచారం ఎట్లా ఉన్నా "సంపూర్ణమైన నవ్యత్వమున్న కవి యితడే"నని నోరి నరసింహ శాస్త్రిగారన్నారు. కాని సంపూర్ణమైన నవ్యత్వం అంటే వారి దృష్టిలో ఎటువంటిదో మాత్రం నిర్వచించ లేదు).

నవమి చిలుక కూడా సమగ్ర గ్రంథ రూపంగా లభిస్తే తప్ప కవిగా శిష్ట్లా విశిష్టతను, అతను నిర్వహించిన చారిత్రక ప్రాధాన్యతనూ పరిపూర్ణంగా అంచనా వేయలేము. అంతవరకూ అతని కవితా విశిష్టతను వివరించుకుందుకు విష్ణుధనువొక్కటే ఆధారభూమి కావలసివస్తుంది. ఏమైనా తెలుగు సాహిత్యానికి జరిగిన దుర్ఘటనలలో శిష్ట్లా వంటి చిరస్మరణీయకవి విస్మృతుడు కావడం కూడా ఒకటి! ఆధునిక కవితా పరంపరలో ఈ దురదృష్టం రసజ్ఞులను సదా గేలిచేస్తుంది.

ప్రకీర్ణంగా లభిస్తున్నంత వరకూ నవమి చిలుకలోని కవితల మాధుర్యాన్ని వాచవిగా అందించడమే ప్రధానం. అందలి జ్ఞాపకాలు, బీదమందు అనే కవితలు హృద్యమైనవీ, వ్యాఖ్యాపేక్షలూను.

సామాన్య పదాల బలహీన శరీరాలకు అమేయ కవితాశక్తి నూది సశక్తీ కుంజరాలుగా నడిపిస్తాడు శిష్ట్లా. ప్రతి వాక్యమూ సమగ్ర కవితా మూర్తిగా మలుస్తాడు. అతను శైలిలోనూ, రీతిలోనూ, సాధించిన విశిష్టత వల్లనే నాటికీ నేటికీ తెలుగు కవిత్వంలో ప్రత్యేక స్థానాన్ని కేటాయించుకోగలిగాడు. అతని ఇడియోసింక్రసీ అనితర పూర్వమేకాక, అననుకరణ సాధ్యమూ అయింది. అతని అభివ్యక్తి వ్యంజనావైఖరీ, సంవిధాన చాతురీ అపూర్వ సహజకాంతులుగా అమరాయి.

బీదమందు అనే లఘు కవిత యిలా సాగుతుంది.

*"తూర్పు తెల్లారింది, వానవెలిసింది!*
*అమ్మపోయే మందెట్టుకు రాయే!*
*కాండబ్బైనా లేదు, కాసైనా లేదు!*
*కాత్తె కూత్తైకైతే డాక్టేరు రాడే!*
*సందేళ సలిజరం ఊర్కే పోదే!*
*సందొచ్చిన పిల్లోడు ఉలుకుతున్నాడే!*
*ఏయాకో తింటుంది గజ్జెట్టిన కుక్క!*

*నేపాళం మాత్రెయ్యే, లేత్తాడు పిల్లోడు!*
*పాతాళం బలిసెక్రవర్తి! సంకురాంతి*
*పండక్కు నేపాళం సెట్టెక్కిరా! జబ్బులన్నీపోతాయి"!*

మొత్తం ఆకవిత అంతే! ఇంత లఘుకవితలో అనంత జీవన విషాదం యిమిడ్చాడు కవి. ఇది ఎక్కడ ప్రారంభమవుతున్నదో అక్కడనుంచే ఒక వ్యధార్త జీవనగాథ పరిసమాప్తమవుతోంది.

బీదలకు జబ్బుచేస్తే, కుక్కలకు మల్లే నక్కలకు మల్లే ఏ ఆకో అలమో మ్రింగడం కూడా మిగుల కుండా పోయింది. జంతువులకా కిటుకు ప్రకృతి నేర్పుతోంది. మనిషైపుట్టి ప్రకృతి అందించే జ్ఞానాన్నీ కోల్పోయాడు. అదీ యిందలి వ్యంగ్యం!

పోతే అందరికీ తెలిసిన వైద్యం నేపాళం ఉండనే వుంది. పాతాళలోకానికి త్రొక్కబడిన బలిచక్రవర్తి సంక్రమణ సమయంలో నేపాళం చెట్టెక్కి వస్తాడనీ, అప్పుడది సర్వరోగ నివారణి కాగలగుతుందనీ, ఆ అమాయక నిరాధార పక్షుల మూఢవిశ్వాసం! దీనినే ఎత్తి చూపుతూ ఈ లఘుకవిత ముగుస్తుంది.

ఈ కవితారీతిపైనా, శైలిపైనా కవికొండల వెంకటరావు గారి ప్రభావం లీలగా కనిపిస్తోంది.

జ్ఞాపకాలు అనే శీర్షికతో మరో కవిత 'కల్పన'లో సంకలితమైంది. ఇది విష్ణుధనువులోనిది కాదు. విష్ణుధనువులోని కవితలు కూడా వివిధ పత్రికలలో ప్రచురితమైనపుడు వివిధ శీర్షికలతోనే ప్రచురిత మయ్యాయి. కనక ఈ జ్ఞాపకాలు నవమి చిలుకలోని దేనని ఊహించడానికి అస్కారం కలుగుతోంది.

ఈకవిత అభివ్యక్తం చేసే జీవిత చరిత్ర మాత్రం హృదయ విదారకమైంది.

లీల అనే ఒక అభాగ్య 'నా పేరు లీల' అంటూ తన కథ చెప్పుకుంటుంది. తాను 'ఊరిగోల పడలేక పొరుగూరికి' వచ్చేసింది. ఒక అందాలవాడిని నమ్మింది. అతనితో సొంతూరిలోనే అక్రమసంబంధం సాగిస్తూ గడిపింది. ఊరుదూరింది. గోలపెట్టింది. కాని తీరా యిల్లు విడిచి వచ్చేసరికి ఆ అందాల మగరాయుడు ఆమెను అడవిపాలుచేసి పరారీఅయ్యాడు. ఇప్పుడామె నిరాధార. అయిన వాళ్ళనీ కానివాళ్ళనీ తల్చుకొని దురపిల్లుతోంది. అశలతో అల్లాడుతోంది.

ఇలాంటి యితి వృత్తం సాధారణమైనదే. కవి ప్రత్యక్షంగా ఎరిగో అనుభవించో స్వీకరించ వలసింది కాదు. ఒకానొక లీల జీవిత కథా కానక్కరలేదు. వలపుల వలలో తగుల్కొన్న కొత్త తరంలో ఏ ఆవేశపరురాలైనా కావచ్చు! ఇది ప్రతినిత్యం జరుగుతున్న దినగాథే! కనకనే కవి సార్వజనీన జీవనేతి వృత్తంగానే దీనిని సాధించాడు.

తల్లి తండ్రుల్నీ, తోడ బుట్టిన వారినీ, యితర బంధుకోటినీ విడిచి అతన్ని నమ్ముకొని వచ్చిందామె. ఏకాకిగా బ్రతకవలసిన దుర్ఘటనకి గురైంది. అనాథ అందరికీ లోకువే! దారినిపోయే అమ్మలక్కలు జేరి ముళ్ళ చూపులు విసురుతున్నారు. కొందరు తెగించి భోగట్టాలడుగుతున్నారు. బుగ్గలు నొక్కుకుంటున్నారు. చెంగులు

చాటేసుకుని తన మొగంమీదే, కిసుక్కున నవ్విపోతున్నారు.

ఆమె ఆ ముళ్ళచూపుల అవమానాలు భరించలేక పోతోంది. ఒకనాడు నడిరాత్తిరి వరకూ మేల్కొని కూర్చుంది. "మృత్యువును బ్రతిమాలుకుంది". తాను తెగించి సాహసం చేయలేక పోయింది. కారణం లేకపోలేదు. అమ్మమ్మ జ్ఞాపకం వచ్చింది. అమ్మ జ్ఞాపకం వచ్చింది. చెల్లెలు జ్ఞాపకం వచ్చింది. నాన్న జ్ఞాపకం వచ్చాడు. అన్నలూ, తమ్ములూ అంతా జ్ఞాపకాల్లో వేధించారు.

అమ్మమ్మ తీగలాగితే డొంకంతా కదలిపోయింది. మమకారాల తాళ్ళు పట్టువిడవడం లేదు. తనకా చావురాదు. తానుగా చావనూలేదు. ఇన్నిజ్ఞాపకాలకీ ఆఖరి జ్ఞాపకం తన అందాలవాడే!

కాని అతను రాడు, దగాచేసి ఎటో వెళ్ళిపోయాడు. ఆమె శూన్యాన్ని అడుగుతోంది. "రావేల రావేల! రాత్రివచ్చింది!" అంటూ ఆక్రోశించింది. ఆవరించిన శూన్యం వికవికానవ్వింది. నిలువునా అతని జ్ఞాపకాలే, ఏంచేయగలుగుతుంది మరి! నిరంతరమూ అతని ధ్యాసే – "ప్రాభాతమౌవేళ జ్ఞాపకాలొచ్చాయి!" తలచి తలచి ఆమె ఆర్తిగా మారింది.

పవళింపు సమయం వచ్చిందంటే అతని జ్ఞాపకాలే వేధిస్తాయి. తలనొప్పి తీర్చే తలగడగా తనకాతని బాహువు అమిరేది. అదిప్పుడు కరువై, తలనొప్పితో తిరిగిపోతుంది. చలికాలం వచ్చిందంటే చాలు – అతని జ్ఞాపకాలు వేధిస్తాయి. చైత్రమాసం వచ్చినా అతని జ్ఞాపకాలే తట్టి తట్టి పిలుస్తాయి! తన రక్తాన్ని తప్పించుకోవడమేలాగ? రక్తంలో రక్తమై పోయిన అతని నీడల్ని తప్పించుకోవడం ఎలాగ? ఏది దారి?

తానెన్ని మార్లు పిలిచినా అతను పలకనే పలకడు. తనకా జ్ఞాపకాలు వైదొలగవు. అతనే తన కేడుగడ అనుకుంది. అతని ఒడ్డూ, పొడువూ చూసి కొండంత నిబ్బరం చెప్పుకుంది. కాని ఆ కొండే విరిగి తన తలమీద పడిపోయింది.

ఏకాకిగా మిగిలింది తాను. ఎక్కడికి పోయినా గుండెనెలా విడవడం? ఎలా తప్పించుకోవడం? అతగాడు మరోపిల్లను మరులుగొని ఉరులుబిగిస్తున్నాడు కాబోలు! ఎందుకో తెలియదు; తన మనసు నిండా అతనే ఉన్నా పురుషుల్ని చూస్తే మాత్రం కనులు చెదురుతున్నాయి!

అతని పొందులో బులుబులు పోయికోసం పరితపించింది. పసిపాప నవ్వుల కిల కిలల కోసం వేగిపోయింది. ముద్దులుయ్యాలలో తన కల పరుంటే – ఊపుతూ జోలపాడింది. తన కలలోనే మిగిలిన ఆ పసిపాప ఆడదో, మగవాడో, తెలియదు. మగరాజే అయితే – వాడూ తండ్రిలాగే మాయదారిగా మారిపోతాడేమో! ఆడపిల్లే అయితే తనలాగే అర్ధాంతరంగా బ్రతుకును అడవి పాల్జేసుకుంటుందేమో! అందుకే తనకా బాధంతా లేకుండానే పోయింది!

తాను పొందని గర్భానికి ఎన్నెమ్మపురుడు పోసింది. పురిటిబిడ్డను చంపి ఎత్తుకు పోతుందని మనవాళ్ళు చాలాకాలంగా నమ్మే క్షుద్రదేవత ఎన్నెమ్మ! దాని పరివారం, కొత్తెమ్మా పోతరాజున్ను! ఆ కొత్తెమ్మే ఉగ్గు పోసింది కాబోలు తన పుట్టని బిడ్డకు!

పోతరాజు స్వయంగా వచ్చి కొత్తచేద నూతిలో వేసి, నీళ్ళుతోడి దిగ తుడిచాడు కాబోలు! ఇవన్నీ ఎన్నెమ్మకు పీడ తగలకుండా ముత్తైదువలు చేసే లాంఛనాలు!

లీల హృదయంలో మాత్రం లీలగా మాతృత్వం ఒక ఆశగా గుబులు కొంటూనే వుంది. తన పాపనెవరో చంకన పెట్టుకుని తీసుకుపోయారల్లేవుంది. అందుకే తనకు పాలు చేపుకువస్తున్నాయి. తన బ్రతుకు అర్ధరాత్రి గడవకముందే – అడవిపాలయి పోయింది. నీలాలసముద్రం బావురుమంటోంది. నేలనిప్పచ్చరంగా నోరు తెరుస్తోంది. తనగుండె రాయిగామారి పోయింది.

శాపగ్రస్త అహల్య అయినా బాగుండేది. అతడు శ్రీరామ చంద్రుడై వచ్చి పాదధూళి సోకినాచాలు. తనకా యోగమూలేదు. బ్రతుకు బండలపాలయి పోయింది. అందుకే – "రామ రామ! నాపేరు లీల!" అంటూ తన స్వగత కథనం ముగిస్తుంది! దానితో ఆ కవితా ముగిసిపోతుంది.

ఇందలి కథాంశం కవితాశక్తిని యినుమడింప చేయడానికే వినియోగమైంది. విషాదజీవన వృత్తాంతం కరుణరస భావాన్ని ప్రోది జేసింది. మూడుదశాబ్దాల కాలం పాలించిన భావకవితా యుగాన్ని చీల్చుకుని మరో ఆధునిక అధ్యాయం ప్రారంభమయ్యే యుగసంధిలో శిష్ట్లా ఉమామహేశ ప్రయోగశాలిగా కొత్త పంటలు పండించిన కవిధీరుడుగా నిలచాడు. ప్రౌఢ వయఃపరిపాకాన్ని అందుకోకుండానే ఆ కవి మృత్యువాత పడ్డాడు.

విధి ఇలా వక్రించకుండా ఉంటే మరెన్నో బంగరుపంటలు పండించే ప్రతిభావంతుడన్న సత్యాన్ని భాసింపచేసే ఆశారేఖలే అతని కవితలన్నీ!

* * *

## విష్ణుధనువు

శిష్ట్లా ఉమామహేశ్వరరావు గుంటూరు నవ్యసాహిత్య పరిషత్ పక్షాన విష్ణుధనువును గ్రంథంగా ప్రచురిస్తూ, గ్రంథకర్త నామాన్ని ఉమా విజయ మహేశ్వరంగా పేర్కొన్నాడు. నాటికీ నేటికీ ఏకైక ప్రథమ ముద్రణగా మిగిలిన ఈ కావ్యం – ఎందువల్లనో 128 ప్రతులు మాత్రమే ముద్రింపబడ్డాయి. 1930 జనవరిలో విడుదలైన 61 పుటల గ్రంథం ముద్రించడానికి రెండు ప్రెస్సులు కావలసి వచ్చాయి. పుస్తకం కూడా విచిత్రమైన సైజు, 1/4 క్రౌనులో వాక్యాలు ముద్రించబడటం అరుదు. కృష్ణ పక్షం, ఆ సైజులో ముద్రింపబడినా మిగల్చబడిన తెల్లకాగితమే అధికం. ఇది అలాకాదు – కాగితం నిడివినంతా ఆక్రమించే దీర్ఘ పాదాలతో సాగింది. అక్కడక్కడ మాత్రా బద్ధ ఛందస్సులకు లొంగిన పాదాలు మాత్రం పొట్టిగా దర్శనమిస్తున్నాయి.

విష్ణుధనువు కావ్యమంతా సార్వత్రికంగా ముక్తచ్ఛందంలోనే ప్రయుక్తమైంది. ఫ్రీవెర్స్ సంవిధానంలో వెలువడిన ఆదికావ్యం కుందుర్తి తెలంగాణా కాక – విష్ణుధనువే!

నాలుగవ పుటమాత్రం ఒకే వాక్యం ఐదుపాదాలుగా ముద్రించబడి మిగిలిన కాగితమంతా కాళీగా విడిచిపెట్టబడింది.

జన్మనక్షత్రమే అహంకారమనే
విష్ణుధనువే
వెన్నెముకనంటియే
ఉంటుంది...."

ఈ వాక్యం ద్వారా కవి కావ్యనామాన్నీ, కావ్యోద్దేశాన్నీ, సూచిస్తున్నాడు. తాను కవిగా జన్మించిన నాటి నక్షత్రం అహంకారము. అది విష్ణు ధనువు. అది జీవితాంతం తన వెన్నెముకను అంటి పెట్టుకునే వుంటుంది. ఆ విచిత్రమైన అభిజన్యంతో ఈకావ్యం ఆవిష్కారం పొందుతోంది. కనకనే ఈ కావ్యం విశిష్టాభివ్యక్తుల కాలవాలమైంది. వైచిత్రిని ప్రధాన స్వరూపంగా సంతరించుకుంది. ఈకవి ప్రధానంగా అదే ఉద్దేశిస్తున్నాడన్న విషయం అనేక రీతులుగా అభివ్యక్తమైంది.

మన పౌరాణిక అభిదలలో శివధనువు ప్రఖ్యాతమైందే! రామాయణ కధాసార మంతటినీ శివధనువు భజించింది. ఆ విధంగా భారతీయ కావ్య ప్రపంచంలో స్థిరపడివుంది. కాని విష్ణుధనువుకు అలాంటి ప్రఖ్యాతి లేదు. పూర్వగాధా సమన్వయత (ఎలిగారికల్ అసోసియేషను) కానరాదు. కవి ఆశించినదీ అదే కావచ్చు. పూర్వగాధా సంస్పృహతో తనకావ్య పథాన్నీ స్ఫూర్తినీ కంగాళీ చేయదలచలేదు. కనకనే ఒక వినూత్న సంజ్ఞతో తనకావ్యాన్ని నిర్మించదలచాడు.

కావ్యావేశాన్నీ ప్రవాహగమనాన్నీ నడుమనడుమ చుక్కలలో విభాజ్యం చేశాడేతప్ప ప్రకరణాలుగా సైతం వింగడించలేదు. ఆవేర్పాటయినా గతిమార్పును, రస భావాదుల పరిణామాన్నీ సూచించేందుకు మాత్రమే.

ఈ కావ్యానికి పీఠకను, నవ్యసాహిత్య పరిషత్ సభాపతి తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి రచించారు. ఇ.బిలో అచ్చుపడిన ఆనాలుగు పుటల విపుల పీఠికనూ వారు తెనాలిలో ఉండి రచించారు. రచన పూర్తిచేసిన తేదీ 1938 జనవరి 26వ. జనవరి 26వ తేదీనే గుర్తించడం బహుశా యాదృచ్ఛిక సంఘటన కాకపోవచ్చు. సార్వత్రిక స్వేచ్ఛా సంకేతంగానే ఈతేదీ స్వయం అభివ్యక్తమే కదా!

పైగా ఈ కావ్యం ప్రచురణ నాల్గవ దశాబ్దిలో ఎనిమిదేళ్ళకు జరిగిందే తప్ప – మూడవ దశాబ్ది చివరికే సంసిద్ధమైందని అభిజ్ఞులు అనేకులు సాక్ష్యమిస్తున్నారు. అలాంటి సాక్షులు పక్షపాత దృష్టితో యిచ్చారనడానికి వీలులేదు. ఆధునిక కవితా హృదయాన్ని త్రికరణ శుద్ధిగా ప్రచలితం చేస్తున్న శ్రీరంగం నారాయణబాబు సైతం ఆకాలంలోనే ఉద్ఘాటించి ఉన్నాడు. కనుక ఆధునిక కవిత్వ చరిత్రలో ప్రయోగవాదాన్ని హృదయ పూర్వకంగా స్వాగతించిన శివశంకరుల పీఠికలోని అంశాలను సంశయరహితంగా స్వీకరించవచ్చు.

"ఆధునిక కవిత్వం అనేక ముఖాలుగా ప్రవహిస్తున్నది. కొంతమంది కవులు అప్రయత్నంగా నిరంకుశులై, నిజేచ్ఛానుసారం నడుస్తున్నారు. సంప్రదాయానికి సంబంధించినంతవరకూ దేనికైనా ఆదరము. మామూలు మార్గం మంచిగా

కనబడినట్లు కొత్తమార్గం గోచరించదు. రంజనకోసం రాత్రింబగళ్లు కష్టపడే కవుల వలెకాకుండా నవీనులకు ఆదరంకావలెననే అభిలాష కూడా లేదు. నిజాశయం వ్యక్తం చేసే కొద్దిమంది కవికుమారుల కృషి సఫలమయిందా లేదా అని చూస్తుంటే కొంతవరకూ ఫలవంతమైందని తోస్తుంది. గతానుగతికంగా కవితావాహినిని కదల నివ్వక పెడత్రోవల తొక్కినవారి వల్లనే కావ్యక్షేత్రాలు కళ పెళ లాడుతున్నవి".

అంటూ తను పీఠికను ప్రారంభించిన శివశంకరులు విశాలహృదయంతో, సమాదరణ పూరిత ఆర్ద్రమనస్కతతో ప్రయోగవాద కావ్యాలకు స్వాగతం పలికారు. సంప్రదాయబద్ధమైన గతానుగతిక ధోరణులవల్ల కావ్యక్షేత్రానికి కొత్తకళ చేకూరడం లేదని నిస్సంశయంగా వెల్లడించారు.

"ఊరందరిదీ ఒక తోవ ఉమామహేశ్వరానిది ఒక తోవ అంటూ ప్రారంభించిన రెండోపేరాలో శివశంకరులు ప్రయోగవాదులలో ఈ కవే ఆద్యుడని తెలుపుతూ ఇలా ఉద్ఘాటిస్తున్నారు :

"నాకు తెలిసినంతలో అతి నవీన మార్గంలో మొదట నడచినవాడు ఇతనే. రమారమి ఏడు సంవత్సరాల క్రిందట ఇతని రచనలు చూచి చకితుణ్ణి అయినాను. కావ్యవస్తువు సంగతి విడిచి కావ్యశరీరం సంగతి ఆలోచిస్తే ఈ ఒంటి తీరేవేరు. తరువాత కొన్నాళ్ళకు పూడిపెద్ది వెంకటరమణయ్య, శ్రీశ్రీ, నారాయణబాబు, పురిపండా అప్పలస్వామి, రుక్మిణీనాథ శాస్త్రి, కొడాలి అంజనేయులు మొదలయిన కవుల రచనలు బయలు దేరినవి".

అన్న శివశంకర మాటల్లో వెల్లడయిన కొన్ని సత్యాలు మనసాహిత్యాభిమానుల సందేహాలను తొలగించగలవు. అయితే వారి ఉద్ఘాటనలో తెలిపిన పూడిపెద్ది వెంకటరమణయ్య, కొడాలి అంజనేయులుగార్లు ప్రదర్శించిన నవీన మార్గం ఎలాంటిదో సాహిత్యాభిమానుల కింతవరకూ అంతుచిక్కలేదు.

శ్రీశ్రీ ఆధునికాంధ్రకవితామరజ్యోతిగా జగత్ ప్రఖ్యాతుడయ్యాడు. నారాయణబాబు రుధిర జ్యోతి ద్వారా అజరామరస్థానం పొందేవున్నాడు. పురిపండా తన పులిపంజాను పశ్చిమ తీరంలో సైతం ప్రదర్శించి శాశ్వత యశస్విగా ఉన్న సాహిత్య భాగ్యవిధాత! రుక్మిణీనాథ శాస్త్రి కవితలనూ, శిష్ట్లా విశిష్ట వ్యక్తిత్వాన్నీ జాతికందించడానికి ఎంతో శ్రమపడవలసి ఉంది.

కాని పూడిపెద్ది, కొడాలి గార్ల సంప్రదాయ కవితలు మాత్రమే సంకలనాలలో లభ్యమవుతున్నాయి. వారి నవీనమార్గ కవితలు ఎక్కడా లభ్యం కావడంలేదు. నవీన మార్గమే ప్రధాన ఆధునిక కవితా మార్గంగా స్థిరపడిన వర్తమాన సందర్భంలో నాల్గవ దశాబ్దిలో వచ్చిన ప్రయోగశాలి కవిత్వాన్నంతా పరిశోధించి పరిశీలించుకోవడం అత్యవసరం. ఈ సత్యాన్ని శివశంకరుల పై వాక్యాలు హెచ్చరిస్తున్నాయి.

మన విశ్వ విద్యాలయాల పరిశోధనా సంరంభం పితృదేవతల ఉనికిపట్ల నుంచి వెలికి రాలేకపోతోంది. కనకనే మన ఆశారేఖలకు గమ్యస్థానం విశ్వవిద్యాలయాల పరిశోధనా భాండారం కేంద్రీకరించలేక పోతోంది. మన మొగాలు వేరొక దిక్కుకు తిప్పకోక తప్పడం లేదు.

శివశంకరుల దృష్టిలో నవీన మార్గం అంటే ఏమిటో ఇలా స్పష్టం చెయబడింది. "రమణయ్య ఇంటర్ రైమింగుకోసం యత్నించినట్లు కనపడుతుంది. శ్రీశ్రీ నారాయణబాబు పేట్టర్న్ వెర్స్ పద్ధతిని వెళ్ళారు. కొంతమంది వెర్స్ లిబ్రె రాశారు. ఎలాగయినా వీటిలో ఎక్కువభాగం ఫార్మల్‌గా ఉంటుంది" అంటూ అనాటి ప్రయోగవాద కవుల రీతుల్ని స్పర్శించారు. కవితాత్మను పరామర్శించడం పీరికాపరిధిలోనిది కాకపోవడంవల్ల కాబోలు విడిచారు. అకవులెవరికీ సంగీతంలో అట్టే ప్రవేశం లేదని భావించారు. కాని 'కొంత శ్రవణ సుభగత తెలియకపోలేద'ని అంగీకరించారు. నిజమైన కవికి అమాత్రం తెలియడంతో ఎందుకు సరిపోదో వారు వివరించలేదు.

సంగీతంతో బాగా ప్రవేశం ఉన్నవారంతా ఉత్తమ కవితా రచన చేయగలిగారా అనే సామాన్య ప్రశ్న వీరి కెందు కెదురుకాలేదో? ఐనా మిగిలిన అనాటి కవుల మాట ఎలా ఉన్నా – నారాయణబాబుకు సంగీతంతో గాఢ పరిచయం ఉన్న సంగతి అందరికీ తెలిసిందే!

"ఉమా మన సంగీతమూ, తెల్లవారి సంగీతమూ తెలిసినవాడు కావడంచేత కొంత విపరీత మార్గంలో విహరించినాడు. రచనలో ఫార్మల్ బ్యూటీ యితనికి ఇష్టంకాదు. ఎంత సేపటికీ యితను వక్రగతులలో, ఊపులో, లయలో – లాస్యం చేస్తాడు. ఆంధ్రభాషలో ప్రథమంనుంచీ పద్యం బందోబస్తుగా వస్తూన్నది. వెనకటి కవులు కావ్యశరీరం మీదనే ఎక్కువ కస్రత్ చేసినట్లు కనపడుతుంది. ఛందో విషయాలు కాని యతి ప్రాసలు తెచ్చిపెట్టారు. యతి ఒక ప్క్షాన తెనుగు భాషకు అనుగుణం అనవచ్చు. ప్రాసమాత్రం పరాయి వాళ్ళదే! అక్షర రమ్యత అంటూ విరామస్థానంలో తరచుగా విరుపులేకుండా చేసి సదృశాక్షరాన్ని సంఘటించారు. అక్కిరాజు ఉమాకాంతం, అస్మదాదులం వీటిని శబ్దాలంకార విషయంగా ఎంచుతున్నాము. ఇంచుమించు వేయి సంవత్సరాల నుంచీ జాతి చెవికి పట్టిపోయిన ఈ అభ్యాసం అసహజం కానట్టే అందరూ అనుకుంటున్నారు. కసరత్ చేసిన కాయంవలె పద్యం గట్టి పడిపోయింది..." అంటూ శివశంకరులు ఛందస్ చర్చకావించారు.

"ఆధునిక కవులు సమ వృత్తాలు మానినేసి దేశీయచ్ఛందస్సులు స్వీకరిస్తున్నారు. వీటిలో కూడా చాలా వరకు సమత ఉండటంచేత మరి కొంతమంది ఇవి కూడా మానివేసి, గేయగుణం ప్రధానంగా ఉండే ప్రణాళిక అవలంబిస్తున్నారు" అంటూ వివరించారు. దేశిరీతులు తెలుగు హృదయాన్ని తేట తెల్లంగా తెలియపరచగల శక్తికలవి కావడంవల్ల అతి ఆధునిక కవులు దీన్ని ప్రధానంగా పరిపోషించారు. ఈ సత్యాన్ని శివశంకరులూ గుర్తించారు. అంతేగాక అనాడే వారు మరో సత్యాన్ని గుర్తించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. 'అత్యంతాధునికత మనకీ ఇంగ్లాండుకీ ఒకేసారి సంభవించడాన్ని' చక్కగా గమనించారాయన. 'మనకు వచ్చినట్టే 1911లో ఇంగ్లాండులో కూడ కవిత్వంలో కొత్త దృష్టి ఏర్పడ్డది. అదేం చిత్రమోగాని, వారికీ మనకీ సమానంగా కవితా స్రవంతిలో గమన వైచిత్ర్యం కనపడుతుంది. 1914, 22

29, 33 సంవత్సరాలలో అక్కడా ఇక్కడా ఒక మోస్తరు ప్రయత్నాలే జరిగినవి" అంటూ 'ప్రదేశ భేదం లేకుండా భావతరంగాలు ప్రపంచం అంతా ప్రసరించడం జరుగుతుందేమో' నని గట్టిగా అనుమానించారు.

ఎజ్రాపొండు, టి.ఎస్. ఎలియట్ సిట్‌వెల్లు మొదలగు వారి మతం మనవాళ్ళు ఎలా స్వీకరించారో సభాపతి తెలిపారు.

## ప్రణయకవిత

విష్ణుధనువు అనే సుదీర్ఘకావ్యానికి యతి వృత్తం నవ్యకవితను అనూచానంగా పాలిస్తున్న ప్రణయమే! కాని ఇందలి ప్రణయాన్ని తత్పూర్వకవుల ప్రయణతత్త్వంతో పోల్చిచూస్తే మాత్రం సాదృశ్యత కన్న విభేదమే అధికంగా ద్యోతకమవుతోంది. ఈ కావ్యానికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సింహావలోకనం రాస్తూ* "ఈ కావ్యంలోని ప్రేమ ఉద్భ్రాంత ప్రేమ" అని పేర్కొన్నారు. ఈ కవి దృష్టిలో మాత్రం ప్రేమ అంటే ఆత్మ నిర్వాణము నారాధించడమేనని పిల్లలమర్రి వెంకటహనుమంతరావుగారు వివరించారు.

నవమి చిలుకకూడా సమగ్ర గ్రంథరూపంగా లభిస్తేతప్ప కవిగా శిష్ట్లా విశిష్టత గురించి సమాలోచించడం కష్టమే! శిష్ట్లా నిర్వహించిన చారిత్రక ప్రాధాన్యతను పరిపూర్ణంగా అంచనావేయడానికి నాకు లభించిన ఈ విష్ణుధనువు ఒక్కటే సరిపోవడం లేదు. ఐతే ఉత్తమకావ్యంగా విశిష్టసత్తాకను విశదం చేసుకునేందుకు మాత్రం విష్ణుధనువు వొక్కటే ఆధారభూమి కాగలదు.

ఏమైనా తెలుగు సాహిత్యానికి జరిగిన దుర్ఘటనలలో శిష్ట్లావంటి చిరస్మరణీయ కవి అకాల మరణానికి గుర్త్తై విస్మృతుడు కావడం ప్రధానమైనదే! అతి స్వల్పప్రతులు మాత్రమే ముద్రించడం వల్ల అతని కావ్యాలు విస్తృత ప్రచారం పొందకపోవడం కూడా మరొకటి! ఆధునిక కవితా పరంపరలో ఈ దురదృష్టం రసజ్ఞుల హృదయాలకు నిరంతరం వేదన కలిగిస్తూ మిగిలి వుంటుంది.

శిష్ట్లా విశిష్ట కావ్యం విష్ణుధనువు గురించిన రేఖామాత్ర పరిచయమే తప్ప ఆ కావ్యగత సౌందర్యాలను వివరించుకుందుకు ప్రస్తుతం అవకాశం లేదు. గ్రంథరచన ద్వారా తప్ప – ఆ పనికి న్యాయమూ చేకూరదు.

★ ★ ★

* ఉద్భ్రాంతప్రేమ అన్నమాట శివశంకరశాస్త్రిగారన్నారు ॥సం॥

# శిష్ట్లా కవనప్రాశస్త్యం

- బొమ్మకంటి శ్రీనివాసాచార్య

1938లో శిష్ట్లా ఉమామహేశ్వరరావు ప్రచురించిన 'విష్ణుధనువు,' 'నవమి చిలుక' అనే ఖండ కావ్య సంపుటాలు తెలుగు సాహిత్య జగత్తులో సంచలనం సృష్టించాయి. ఆ సంపుటాలను చూసి ఆనాటి నవ్య సాహిత్య సభాపతి తల్లావఝుల శివశంకరశాస్త్రి ఇలా ఇన్నారు

"అందరిదీ ఒక త్రోవ, ఉమామహేశ్వరరావు ఒక త్రోవ. నాకు తెలిసినంతలో అతి నవీన మార్గంలో మొదట నడచిన వాడు ఇతనే. ఒక విధంగా ఇది వింత సృష్టి. ఉపజ్ఞ, ఉద్రేకం, అభినవత్వం అభిలషించే వారికి ఈ కావ్య సముచ్చయం వల్ల కడుపునిండి తీరాలి.

"ఇటు వెన్నెల ... అటు వెన్నెల
నడి శిరసుకు ... శ్రీ వెన్నెల
ఇటు వెన్నెల ... అటు వెన్నెల
విరులల్లిన ... జడ వెన్నెల"

అంటూ ప్రారంభించి అలా పదహారు చరణాలు వ్రాసి,

"ఇటు వెన్నెల ... అటు వెన్నెల

పిచ్చెత్తే వళ్ళంతా వెర్రెత్తే దిక్కులకై పరుగెత్తే నా మనసున వెన్నెల్లో ప్రేయసి లేక

అమావాస్య! అమావాస్య! అమావాస్య!
మహాలయ అమావాస్య"

కవిత్వ రచనలోనే కాక పద్యాలను అచ్చువేయించిన తీరులో కూడా నవ్యత ప్రదర్శించిన వాడు శ్రీ ఉమామహేశ్వరరావు. తన 'విష్ణుధనువు' కావ్యం 368 ప్రతులు మాత్రమే అచ్చువేయించినట్లు పేర్కొని అన్నిప్రతులే ఎందుకు వేయించావు? - అంటే "రాష్ట్ర, రాష్ట్రేతర ఆంధ్రులందరిలోను నా కవిత్వం అర్థం చేసుకోగలవారు 368* మందే లెక్క తేలారు గనకా!" అని జవాబు చెప్పాడు ఉమా. పత్రికలలో పద్యాలు ప్రకటించేటప్పుడు మహేశ్వర, వినాయక పండితుడు, ఉమ, విజయమహేశ్వరం వంటి వేరు వేరు పేర్లతో వాటిని ప్రకటించేవాడు.

గుంటూరు జిల్లా 'మంచాళ' అగ్రహారానికి చెందిన ఒక శిష్ట్లా కుటుంబంలో 1912లో ఉమామహేశ్వరరావు జన్మించాడు. బాల్యంలో పురాణ గాథలు, జానపద సాహిత్యం జీర్ణించుకున్నాడు. ఆంగ్ల సాహిత్యంలో 'ఎమ్మే' పట్టాపొంది ఇంగ్లీషులోని నూతన కవితా ప్రస్థానాలను ఆకళింపు చేసుకున్నాడు. కొన్నాళ్ళు దివ్య జ్ఞాన

* ఆరుద్ర, సోమసుందర్ ల లెక్క 128 ప్రతులు

సమాజంలో చేరాడు. మరి కొన్నాళ్ళు ఒక యతి వద్ద శుశ్రూష చేశాడు. జ్యోతిషం, సంగీతం కూడా అభ్యసించాడు.

మొదట ఒక కళాశాలలోనూ, తరువాత ఒక Firmలోనూ పనిచేసి చివరికి సైన్యంలో చేరి చిత్ర విచిత్రాలైన అనుభవాలు సంపాదించాడు. ఆ అనుభవాలనే బహుళ జనాదారణ పొందిన తన 'సిపాయికథల'లో శిష్ట్లా ప్రకటించాడు.

తన కావ్యాలలో తాను ప్రకటించిన ప్రేమ 'ఉద్భ్రాంత ప్రేమ' అంటాడు శిష్ట్లా. అతడు రచించిన 'కాళింగి పాటలు' తెలుగు కవిత్వానికి వినూతనమైన అలంకారాలు. 'గోరింట రాక్షసుడు' వంటి పిల్లల కథలూ, ఎన్నో వ్యాసాలూ కూడా ఉమామహేశ్వరరావు వివిధ పత్రికలలో ప్రకటించాడు. కాని అవి అన్నీ గ్రంథరూపం దాల్చినట్టు లేదు.

ఉమామహేశ్వరరావు కవిత్వం చదివి శ్రీ విశ్వనాథ ఇలా తన అభిప్రాయం ప్రకటించాడు.

"కవి గొప్ప ప్రతిభావంతుడు.... మనస్సులో జరుగు కొన్ని వికారములు, ఉన్మేషములు ఇంత చక్కగా ఆరోపించి చెప్పుట మిక్కిలి కష్టమైనది... చూడండి.

'దాగుడుమూత పడవీ మనస్సంచారములు
కత్తెర పెట్టినన్ తెగవు. ఎక్కడ కేగుచుంటిరని
పోవునపుడడిగిన నవి పక పక నవ్వు అక్కడ
ఏమి చేసితిరన సిగ్గుచే లోనికి
జొత్తురు, వెంటనే యుప్పెన వచ్చినట్లు మహా
ర్ణవమి పిల్లల వలె అల్లరి చేతురు'.

ఈయన కవిత్వములో మాత్రాప్రస్తావన లేదు. పాదనియమము లేదు. క్రొత్త పాదము మొదలు పెట్టినపుడు సర్వత్ర విశేషార్థ ద్యోతకముగా మొదలు పెట్టబడిందని చెప్పుటకు వీలులేదు. కాని ప్రతిగీతంలోను ఒక వూపు వుంటుంది ఆ వూపుమధ్య మధ్య విరిగిపోతూ వుంటుంది.... ఈయన భావములు, ఈయన సంస్కారం ఈయన భావనాశక్తి, ఈయన కవితాశక్తి పరమోత్కృష్ట స్థితిలో వున్నవి. కాని వీనినన్నింటికి భాషాలోపము ఒకటి వున్నది....."

విశ్వనాథ దృష్టినే కాకుండా ఆనాడు ప్రముఖు లెందరి దృష్టినో ఆకర్షించాడు ఉమామహేశ్వరరావు.

శ్రీరంగం నారాయణ బాబు ఇతనిని గూర్చి ఇలా అంటాడు. "ఈనాడు అతి నవీనులమని బోర విరుచుకు తిరుగుతున్న అతి నవీనులకు కూడా అతినవీనుడు శిష్ట్లా. ఏనాడో అతి నవీనమైన మార్గంలో కవిత్వం వ్రాసి లోకంచేత విస్మరింపబడ్డాడు. అతినవ్య కవిత్వం ఎన్ని క్రొత్త పోకడలు పోగలదో అన్నిటినీ పోయి చూచాడు - భావకవిత్వం నుంచి అధివాస్తవికత వరకు".

శిష్ట్లా నవ్యత ఇతర నవ్యకవుల నవ్యత వంటిది కాదు. అంటూ శ్రీ నోరి నరసింహశాస్త్రి ఇలా అంటాడు. "ఇతనిది శ్రీశ్రీ, నారాయణబాబు ఇత్యాదులది

వలె ఎక్కడ్నుంచో వచ్చిన కవిత్వం కాదు. తెలుగు గడ్డలో పుట్టి తెలుగు జీవితంలో పెరిగిన నవ్యకవిత్వం ఇతనిది".

అనాటి తెలుగు సాహితీ రసజ్ఞుల కెందరికో ఎన్నెన్నో ఆశలు కల్పించిన శిష్ట్లా ఉమామహేశ్వర రావు తన 41వ ఏటనే 1953లో అకాలమరణం చెంది తెలుగు కవితారంగంలో ఎవ్వరూ పూరించలేని లోటును కల్పించి పోయాడు.

*(రేడియో ప్రసంగం)**

★ ★ ★

* తెలుగువిజ్ఞాన సర్వస్వంలో శిష్ట్లాను గురించి శ్రీ బొమ్మకంటివారు ఇదే అభిప్రా-యాలతో ఓ వ్యాసంకూడా రాశారు. ॥సం॥

# కవిత్వంలో రౌడీ వేషం

- అబ్బూరి వరదరాజేశ్వరరావు

ఆంధ్ర విశ్వవిద్యాలయం వాల్తేరులో ఏర్పడ్డ మొదటి మూడు నాలుగు సంవత్సరాలూ సెలవుల్లో బెజవాడ, గుంటూరు పోతుండేవాణ్ణి. బెజవాడలో గుడిపాటి వెంకటచలం గారింట్లో మకాం. గుంటూరులో మా తాతగారింట్లో. అక్కడ కొన్నాళ్ళు కాలక్షేపం. ఓ సంవత్సరం గుంటూరులో మా మేనత్త కొడుకు వాడపల్లి లక్ష్మీనరసింహారావు. అతను లక్నోలో లా చదువుతూ సెలవులకి ఇంటికొచ్చాడు. నన్ను తనతో తన స్నేహితులతోపాటు సాయంకాలం షికారుకు తీసుకుపోతూండేవాడు. ఒక రోజున అమరావతి రోడ్డుమీద పోతున్నాము. కొంత దూరం నడిచిన తరవాత అరండల్‌పేట సరిహద్దుపైన రోడ్డు కానుకుని పెద్ద వటవృక్షం. దానికి దరిదాపున పెద్ద భవంతి.

అందులో కుడివేపున పెద్దగది. మా బావా, స్నేహితులూ అక్కడ ఆగి గది తలుపు తట్టారు. తలుపు తెరుచుకుని లోపల్నించి మంచి యవ్వనంలో ఉన్న ఓ పెద్ద విగ్రహం వాకిట్లోకి వచ్చి, ఏం మాట్లాడకుండా నవ్వటం మొదలు పెట్టాడు. ఓ నిమిషం అయిన తరవాత అతను మా బావతో – "మీరు లోపలికి వస్తారా, నన్ను బయటికి రమ్మంటారా? ఏదోటి ఏడవండోయ్!" అన్నాడు. అతను లాల్చీ, పైజమాలో ఉన్నాడు. మా బావా, అతని స్నేహితులిద్దరూ, నేనూ గదిలో ప్రవేశించాము. ఆ గదిలో ఓ మూల ఓ చాప, ఆ చాపమీద మాసిపోయిన దిండూ, గోడకి మేకులమీద వేళ్ళాడుతున్న లాల్చీలూ, తువ్వాళ్ళూ, గదినిండా తెల్ల కాగితాలు ఈగల్లా గాలి కెగురుతున్నాయి. అందరికన్న వెనక నిలబడిన నేను అలా ఎగురుతున్న ఓ కాగితం కేసి చూశాను. పద్యాల్లా ఆ కాగితం మీద ఎవరి దస్తూరిలోనో ఉన్నాయి. ఇంతలోకి మా బావ నన్నతనికి పరిచయం చేస్తూ "మా మామయ్య కొడుకు వరద. వీడూ కవిత్వం రాస్తాడుట!" అని నవ్వుతూ అన్నాడు. అంతే. అమాంతం అతను నేలమీద సాష్టాంగపడి నాకు నమస్కరించాడు. లేచి "మహాకవిని చూసినట్టే లెక్క. రామకృష్ణారావు గారిని చదివాను: వాళ్ళబ్బాయిని చూశా" నన్నాడతను.

అతని పేరు శిష్ట్లా ఉమామహేశ్వరరావనీ, మా బావకు సహాధ్యాయి అనీ, అప్పుడు బెనారస్ విశ్వవిద్యాలయంలో చదువు ముగించుకుని వచ్చేశాడనీ, మేధావంతుడనీ విన్నాను. ఎందువల్లనో అతణ్ణి చూసీచూట్టంతో అదో రకం వ్యక్తిగా కనిపించాడు. అతని వాలకంలోనే ఏదో విశేషం ఉన్నట్టు తోచింది. అతని గదిలోనే ఓ గంట సేపు అందరూ నేలమీద కూర్చుని అవీ ఇవీ మాట్లాడారు. మధ్య మధ్య మా బావ ఉమామహేశ్వరరావు కవిత్వం రాస్తాడని అంటున్నాడు. అయితే, అతని పేరు నేను చదువుకున్న సాహిత్యంలో ఎక్కడా తటస్థపడలేదు. ఊరుకోక "శ్రీరంగం శ్రీనివాసరావు పేరు విన్నారా?" అని ఉమామహేశ్వరరావు కేసి

చూస్తూ అడిగాను. నా వంక తీక్షణంగా చూసి – "అతనెవ"రన్నాడు. నాక్కోపం వచ్చింది. అయినా "విశాఖపట్నం. కవిత్వం బ్రహ్మాండంగా రాస్తాడు" అన్నానో లేదో అతను మొహం అటుపెట్టి "రాయనీ" అంటూ మళ్ళీ అందరి ధోరణిలో పడ్డాడు.

నా కాశ్చర్యం వేసింది – మా నాన్నగారి పేరు విని నా ముందు సాష్టాంగపడ్డవాడు కవిత్వం అంటే కించిత్తు అసక్తి చూపించడేం అని. కాస్సేపయిన తరువాత అందరం లేచాం. బయటికివస్తూ గాలికెగురుతున్న కాగితాలకేసి మళ్ళీ చూశాను. అలాచూస్తున్న నన్నుచూసి "అదంతా నా కవిత్వం– చదవాల్నుందా?" అని రెండు కాగితాలు తీసి చూపించాడు. కవిత్వంలాగే ఉంది. అందులో ఒక కాగితాన్ని తిరిగీ చూసుకొని నాకిచ్చేసి ఉంచుకోమన్నాడు.

మర్రోజున బ్రాడీ పేట మొదట్లో ఉన్న అమంచర్ల శేషాచలపతి గారింటి ముందు తల్లావఝల శివశంకరశాస్త్రిగారు కనిపించారు. ఆ రోజుల్లో నేనంటే ఆయనకి అభిమానం. ఎదురుగా ఉన్న హోటల్లోకి తీసుకుపోయి కాఫీ ఇప్పించి అవీ ఇవీ మాట్లాడుతూ "మీరంతా శ్రీనివాసరావ్గా, శ్రీనివాసరావు అంటారు. మా ఉమామహేశ్వరరావు పోలిక్కిరాడు. అతను అద్భుతంగా కొత్త పద్ధతిలో కవిత్వం చెప్పబోతున్నాడు" అని సభాపతి ధోరణిలో చెప్పారు. శాస్త్రిగారికి వ్యక్తిగతంగా అనేక అభిమానాలు. ఏ అభిమానంతో అలా మాట్లాడుతున్నారో నాకర్థం కాలేదు.

గుంటూరులో నేనున్న పది రోజుల్లోను మరోసారి ఉమామహేశ్వరరావును యాదృచ్ఛికంగా కలుసుకోవటం జరిగింది. వేదుల సత్యనారాయణగారితో కలిసి వెళ్ళాను. ఆరోజుల్లో వేదుల మా మేనమామకు సంస్కృతం చెప్పేవాడు. అప్పుడే మొదటిసారిగా ఉమామహేశ్వరరావు తన కవిత్వాన్ని పాడి వినిపించటం చూశాను. అతను బాగా పాడగలడనే అభిప్రాయం కలిగింది నాకు. సత్యాగ్రహులమీద పోలీసుల లాఠీ దౌర్జన్యంమీద రాస్తున్న ఓ గేయాన్ని వేదులకి వినిపించాడు.

"మారో మారో మారో
ఒకటీ, రెండూ, మూడూ....."

ఇలా సాగుతుంది. అతను పాడుతుంటే ఉత్తేజితులై వేదుల తెగ మెచ్చుకున్నారు. నాది మరీబాల్యం కనక మరింత తన్మయుణ్ణయిపోయిన మాట వాస్తవం. ఉమామహేశ్వరరావు సామాన్య కవి కాదని నాకనిపించింది. తన గదిలో అంతకుపూర్వం నాకిచ్చిన కాగితంమీద రాసిన పద్యం పాడాడు. నా కర్థం కాలేదు. వేదులకీ అనుకుంటాను. ఆయన కనుబొమలు ముకుళించారు. పాడే తీరు అద్భుతం.

ఇంటికొచ్చిన తరవాత ఆ కాగితం ముక్క చూశాను. పద్యంలా వుంది. ఛందస్సు అర్థం కాలేదు. అంతా అయోమయంగా వుంది.

నేను విశాఖపట్నం చేరీ చేరగానే శ్రీనివాసరావుని కలిసి గుంటూరు వ్యవహారం పూసగుచ్చినట్టు చెప్పాను. నేను పట్టుకొచ్చిన 'పద్యం' చూపించాను. అతనికీ ఆశ్చర్యం వేసింది. అతణ్ణి ఒకసారి చూడాలని అన్నాడు – అలాగేనని చెప్పి మా బావకు ఉత్తరం రాశాను. ఓ నెల రోజుల తరవాత ఉమామహేశ్వరరావు కలకత్తా పోతున్నాడనీ, వాల్తేరు స్టేషనులో కలవమనీ మా బావ ఉత్తరం రాశాడు. నిర్ణీత

సమయానికి నేనూ, శ్రీనివాసరావూ స్టేషనుకి వెళ్ళాము. కలకత్తా మెయిలు ఆగగానే వెతికి గుర్తు పట్టి ఉమామహేశ్వరరావుని దించాను. శ్రీనివాసరావుని పరిచయం చేశాను. ఉమామహేశ్వరరావుకి ఓ పాడలవాటుంది. అందర్నీ 'ఒరే' అనేవాడు. శ్రీనివాసరావుని చూసి "నీ గురించి విన్నానురా – మనం తీరిగ్గా కలవాలి" అన్నాడు. "కవిత్వం యాంత్రికంగా వుంటోంది. దాన్ని తాంత్రికంగా నడిపిస్తాను. కుండలాలనూ, శ్రీ చక్రాలనూ పరిశోధిస్తున్నాను. నాలో మిమ్మల్నందర్నీ చేర్చుకుంటానులే – భయపడకు" అన్నాడు.

నేను జేబులోంచి అతను లోగడ ఇచ్చిన కాగితం ముక్క తీసి చదివి వినిపించు అన్నాను. స్టేషను గడియారం చూస్తూ పాడాడు. ఒక్కొక్కప్పుడు అమ్మవారంత గొంతు – దూరంగా వున్న ప్రయాణీకులు మా వంక చూస్తున్నారు.

"దాగుడు మూత పడ వీమనస్సంచారములు
కత్తెర పెట్టినన్ తెగవు. ఎక్కడ కేగుచుంటిరని
పోవునపు డడిగిన నవి పక పక నవ్వు. అక్కడ
ఏమి చేసితిరన సిగ్గుచే లోనికి
జొత్తురు. వెంటనే యుప్పెన వచ్చినట్లు మహా
ర్ణవమి పిల్లలవలె అల్లరిచేతురు...."

రైలు కదిలిపోయింది. శ్రీనివాసరావుకి అతని వైఖరి రుచించలేదని తెలిసిపోయింది. అయితే, ఉమామహేశ్వరరావుని గురించి ఇంకా తెలుసుకోవాలనే కుతూహలం శ్రీనివాసరావుకి పట్టుకుందని తెలుసుకున్నాను. మా నాన్నగారి అభిప్రాయం కనుక్కోమన్నాడు శ్రీనివాసరావు. నేను చెప్పినదంతా విని, నేను చూపించిన 'పద్యం' చదివి "కవిత్వంలో వీడిది రౌడీ వేషంలా ఉందిరా!" అన్నారు నవ్వుతూ మా నాన్నగారు.

★ ★ ★

యుద్ధకాలంలో విశ్వవిద్యాలయాన్ని వాల్తేరు నుంచి గుంటూరు తరలించటంతో మా కుటుంబం అక్కడికే వచ్చింది. అప్పుడు రాజకీయాల్లో ఎమ్.ఎన్.రాయ్‌గారి అనుచరుణ్ణిగా ఉండేవాణ్ణి.

మా ఇంటి పక్కనే జంధ్యాల వారిల్లు. జంధ్యాల వెంకటప్పయ్య శాస్త్రిగారు వెల్కం ప్రెస్సు నిర్వహిస్తుండేవారు. నేను తోచనప్పుడు వెంకటప్పయ్య శాస్త్రిగారి ప్రెస్సుకు వెళ్ళి ఆయనతో మాట్లాడుతుండేవాణ్ణి. అక్కడే శిష్ట్లా ఉమామహేశ్వరరావు 'శాంతిని' అనే పత్రికను అచ్చేయించేవాడు. కాని, నన్ను గుర్తుపట్టలేదు. అప్పుడతను – కవిత్వంలో ఏదో ఎవరికీ అర్థంకాని 'ప్రాహ్లాద' కవిత్వం అంటూ ఓ ఉద్యమాన్ని లేవదీయటానికి ప్రయత్నించాడు. యుద్ధ సంక్షోభంలో నేనంతగా ఉమామహేశ్వరరావు ప్రయత్నాన్ని పట్టించుకోలేదు. ఎన్నాళ్ళో కాలేదు. అతను అన్నీ మానేసి సైన్యంలో చేరాడు. నేను గుంటూరు వదిలి మదరాసు వెళ్ళిపోయాను.

నేను మదరాసులో మకాం పెట్టిన మరుసటి సంవత్సరం నేనూ, బెల్లంకొండ రామదాసూ కలిసి తిరువళ్ళిక్కేణిలో ఓ గదిలో ఉండే వాళ్ళం.

ఒక రాత్రి స్నేహితులతో పోయి మర్నాడు పొద్దునే గది కొచ్చాను. గది తలుపులు బార్లగా తీసి ఉన్నాయి. గడపకి ముందుగా ఒకతను అర్ధనగ్నంగా తలకింద మిలటరీ సంచి పెట్టుకుని నేలమీద పడుకుని ఉన్నాడు. లోపలికి అతణ్ణి దాటుకుపోవటం కష్టం. అతనెవరో గుర్తుపట్టలేని స్థితిలో ఉన్నాను. గదిలోంచి సారా వాసన!

ఏం చెయ్యాలో తోచక వరండాలో పచార్లు చేస్తుండగా రామదాసు వచ్చాడు నవ్వుతూ.

"ఉమాయ్ రాత్రొచ్చాడు. ఇక్కడే ఉంటానన్నాడు. సరే అన్నాను".

అలా మా దగ్గర నెలరోజులున్నాడు. అతనితో మేం వేగలేక పోయాము. మదరాసులో ఆంధ్రపత్రిక సంపాదక వర్గంలో ఉమామహేశ్వరరావు చేరాడు. అతనూ, ఆ పత్రికాధిపతి శివలెంక శంభుప్రసాద్‌గారూ సహాధ్యాయులని విన్నాము. పొద్దున ఆలస్యంగా లేచి, ఏ రాత్రి పన్నెండు గంటలకో వచ్చేవాడు. నేనూ, రామదాసూ గాఢనిద్రలో ఉండగా లేపేవాడు. ఒకంతట ఉమాయ్‌కి నిద్రపట్టేది కాదు. ఏదో మాట్లాడమనేవాడు. చిత్తుగా తాగిన మైకంతో ఉండేవాడు. గది అంతా వాసన, వరండా అంతా వాసన.

వరండాలో మా ఇంటాయన మొదలియారు పడుకుని ఉండేవాడు. ఆయనది యమగురక. ఆ గురకకుతోడు ఉమాయ్ వాగుడు, వాసన, మాకు దుర్భరంగా ఉండేది. ఈ విషయం మీద ఓ రోజు నేనూ రామదాసూ ఘర్షణకూడా పడ్డాము. ఉమాయ్‌ని ఎలా సంస్కరించాలో మాకు బోధపడలేదు. వయస్సులో అతనికన్నా చిన్నవాళ్ళం. అతనికీ, మాకూ సాహిత్యమే ఒక లంకెలా ఉండేది. అదే మా బలహీనత అని గుర్తించాము. ఓ రోజున ఉమాయ్‌తో వేరేగది చూసుకోమని చెప్పాము. సరే నన్నాడు కాని, ఆ ప్రయత్నం చేస్తున్నట్లు మాకు తోచలేదు. రాత్రిళ్ళు తొందరగా ఇంటికి రావటం మొదలు పెట్టాడు. రావటంతోటే మాతో కవిత్వం మీద చర్చ ప్రారంభించేవాడు. తను ఎలాంటి వినూత్న ప్రయోగాలు చేస్తున్నాడో సోదాహరణంగా చెప్పేవాడు. రాత్రి పన్నెండయ్యేది. అప్పుడు తన గేయాలను పాడేవాడు. మాకు నిద్ర వస్తోందనీ, మర్నాడు ఉద్యోగానికి పోవాలనీ చెప్పినా వినేవాడుకాదు. మేం నిద్రనటించేవాళ్ళం. అతడు పాడుతూనే ఉండేవాడు. మేం నిద్ర నటించినా ధ్యాస అంతా అతని పాటమీదే ఉండేది.

"నాపేరు లీల!

ఆ ఊరి గోల పడలేక పారుగూ రొచ్చాను!"

మేం నిద్రలోనే ఉండేవాళ్ళం. అతను పాట ముగించి నిద్రపోయేవాడు. పొద్దున్నే లేచి నేనూ, రామదాసూ ఎవరి మానాన వాళ్ళం వెళ్ళిపోయే వాళ్ళం. మళ్ళీరాత్రిదాకా ఉమాయ్ కనిపించేవాడు కాదు.

ఆ రోజుల్లో అతను కవిత్వం రాయటం పూర్తిగా మానేశాడు. ఓ నవయుగానికి తనో ద్రష్ట ననుకునేవాడు. ఆ విషయాన్ని ఎక్కువగా ఎవరూ పట్టించుకోలేదని

కొంచెం కోపంగా కూడా ఉండే దతనికి. ముఖ్యంగా శ్రీరంగం శ్రీనివాసరావుని అలాంటి సందర్భాల్లో ప్రస్తావించటం అతనికి కొంచెం కష్టంగా ఉండేదని మేము గ్రహించేవాళ్ళం. దానికో కారణం ఉంది. 1933 మార్చిలో అభినవాంధ్ర కవి పండిత సభ బరంపురంలో జరిగింది. ఆ సభలో మొదటిసారి ఉమామహేశ్వరరావు కవిగా యావదాంధ్రానికీ పరిచయమయాడు. అతను రాసిన 'మారో మారో మారో' అనే గేయాన్ని ఆ సభా సమక్షంలో ఉమామహేశ్వరరావే పాడాడని నాకనిపించేది – శివశంకరశాస్త్రిగారు చదివారని తరవాత శ్రీశ్రీ రాశాడు. అప్పటికి శ్రీశ్రీ 'మరోప్రపంచం' రాయలేదు. మిత్రులందరూ ఆ పాటను విన్న తరువాతనే శ్రీశ్రీ తత్ప్రోద్బలం మీద 'మరో ప్రపంచం' రాశాడని అనేవారు. అందులో నిజం లే[illegible] నాకు తెలుసు. శ్రీశ్రీకి తెలుసు. మా మదరాసు రోజుల్లో శ్రీశ్రీ సుతరామూ అందుకు ఒప్పుకొనేవాడు కాదు. శ్రీశ్రీకి నేను నచ్చచెప్పచూశాను గీతాలు వేరు, ఎత్తుబడిలోనే కదా నీ అనుకరణ, ఆమాత్రం ఒప్పుకుంటే తప్పులేదన్నాను. అతను వినలేదు. తరవాత ఎన్నాళ్ళకో అన్నాడు. ఇప్పుడు ఉమామహేశ్వరరావు గీతం పూర్తి పాఠం దొరకటం దుర్లభం.

మదరాసులో డేవిడ్ కఫే అనే మధుశాల ఉండేది. ఓసారి నేనూ, శ్రీశ్రీ – మల్లాది రామకృష్ణశాస్త్రిగారితో కలిసి అందులోకి పోయాము. అదే సమయంలో దారిన పోతున్న ఉమామహేశ్వరరావు మమ్మల్ని అనుసరించాడు. తీరా మేం బల్లదగ్గర కూర్చోగానే ఎదుట ప్రత్యక్షమయ్యాడు. అవీ ఇవీ మాట్లాడుతూ కాలక్షేపం చేస్తున్నాము. కొంచెం తలకెక్కితే ఉమామహేశ్వరరావు సంస్కృతంలో పలకరించటం రివాజు. మేం పట్టించుకునేవాళ్ళం కాదు. ఆ రోజున శ్రీనివాసరావుకు ఒళ్ళుమండి పోయినంత కోపం వచ్చింది. "మా అమ్మనంటావురా?...." అని లేచాడు. ఇద్దరూ ఒకరిచొక్కా ఒకరు పట్టుకున్నారు. శాస్త్రిగారు కిమ్మనకుండా కూచున్నారు. నేను కలగజేసుకోబోతుంటే కనుసైగ చేసి ఊరుకోమన్నారు. ఇంతలోకి అక్కడి బేరర్సువచ్చి వాళ్ళను విడదీశారు. అంతటితో వాళ్ళిద్దరూ ఆగలేదు. ఒకళ్ళనొకళ్ళు నోరారా ఆడిపోసుకున్నారు. అప్పుడే ఉమామహేశ్వరరావు "నిన్ను చంపేదాకా నిద్రపోనురా!" అని బల్లగుద్ది అరిచాడు. అప్పుడు శాస్త్రిగారు ఆపేయమన్నారు.

ఆ తరువాత కొన్నేళ్ళకి ఉమామహేశ్వరరావు అన్నంతపనీ చెయ్యటానికి ప్రయత్నించాడు. శ్రీశ్రీని గుంటూరు దగ్గర పొలాల్లో గడ్డివాముకు కట్టి కాల్చెయ్య పోయాడు. అదో పెద్ద కథ. శ్రీశ్రీ నాకు ఆ కథ చెబుతున్నప్పుడు అతని కళ్ళల్లో వెనకటి భయం కనిపిస్తుండేది. అతణ్ణి కాల్చటానికి ప్రయత్నిస్తున్నప్పుడు "మారో మారో మారో" అని ఉమామహేశ్వరరావు పాడాడట!

ఇంతకీ నేనూ, రామదాసూ మేం తీసుకున్న గదిని వదిలేసి వెళ్ళిపోయాం. ఉమాయ్ అందులోనే కొన్నాళ్ళున్నాడు. ఇంటి యజమాని మొదలియారుతో దెబ్బలాట పెట్టుకుని ఉమాయ్‌కూడా ఖాళీ చేశాడు. వెంటనే ఆంధ్రపత్రికలో ఉద్యోగం కూడా పోయింది.

★ ★ ★

ఉమామహేశ్వరరావు విచిత్రమైన వ్యక్తి. మనిషి శుభ్రత పాటించేవాడు. మాటాడినంత సేపూ బాగానే వున్నట్లుండి – హఠాత్తుగా మారిపోయే వాడు. అక్కడే అందరికీ అతనంటే బాధాకరంగా వుండటం. అంతేకాక వ్యక్తిగత జీవితంలో కొన్ని అవాంఛనీయమైన లక్షణాలు అందరికీ అర్థం అయేరకంగా ప్రవర్తించేవాడు.

'వెర్స్ లిబ్రే' అనే ప్రక్రియ తెలుగులో అతనితోనే ఆరంభం. అందులో పరిపూర్ణ ప్రావీణ్యం సంపాయించకుండా ప్రయోగాలు చెయ్యటం ప్రారంభించాడు. ఆంగ్లసాహిత్యంలో అతనికి దొరికినంత ప్రవేశం తెలుగులో దొరక్కపోవటంవల్ల అతనికి తగిన పేరు రాలేదు. భాషమీద అతనికున్న అధికారం అత్యల్పం. దానికితోడు సంక్లిష్టమయిన భావ శబలత. అయితే, ఒక నవీన మార్గాన్ని తెలుగు సాహిత్యంలో నిర్దేశిస్తున్న అహంభావాన్ని తన సంభాషణల్లో ప్రస్ఫుటం చేసేవాడు. అతను నవీన మార్గదర్శిగానే వుండిపోయాడు. ఆ మార్గాన పయనించ లేకపోయాడు. అలాంటి మార్గాన పయనించి కొంతవరకు కృతకృత్యుడయినవాడు శ్రీరంగం శ్రీనివాసరావని మనందరికీ తెలుసు.

శిష్ట్లా ఉమామహేశ్వరరావుని వినూత్న మార్గదర్శిగా ప్రచారం చేసేందుకు శివశంకరశాస్త్రి ప్రభృతులు చాలా దోహదం చేయటం జరిగింది. విశ్వనాథ సత్యనారాయణగారిచేత కూడా యోగ్యతాపత్రం ఇప్పించే ప్రయత్నమూ జరిగింది. వారి ఆశయాల కనుగుణంగా ఉమామహేశ్వరరావు కవిత్వంలో పురోగమించలేకపోయాడు. దానికి తోడు అనతికాలంలోనే కవిత్వానికి స్వస్తి పలికాడు.

అంతమాత్రాన ఉమామహేశ్వరరావుకి తెలుగు సాహిత్యంలో సముచిత స్థానం లేకపోలేదు. అతను రాసిన ఒకటి, రెండు గీతాలు కలకాలం చెప్పుకోదగ్గవి. అందులో 'జ్ఞాపకాలు' అన్న గీతం 'వెర్స్ లిబ్రే'లో తలమానికంలాంటిది. అది చదువుతున్నప్పుడల్లా 'ఎజ్రాపౌండ్' గుర్తుకు రాకమానడు. అతడు ఎనిమిదో శతాబ్దంలోని చైనా కవి రిహేకు రాసిన పాటల్ని ఆంగ్లంలో తర్జుమా చేశాడు. అందులో ముఖ్యంగా నదీ వ్యాపారి భార్య – ఉత్తరం – అనే గేయం, ఉమామహేశ్వరరావు 'జ్ఞాపకాలు' చదువుతుంటే, గుర్తుకు రాక మానదు. ఉమామహేశ్వరరావు నాతోనూ, రామదాసుతోనూ కలిసి వున్న రోజుల్లో ఈ గేయాన్ని తరచు పాడుతుండేవాడు. గుండె కదిలి కరిగిపోయేది. అమాంతం ఒళ్ళు కంపించేది. ఇప్పటికీ ఆ పాటా, అతని గానమాధుర్యమూ నాకు స్ఫురణకు వస్తుంటాయి.

(కవనకుతూహలం అన్న గ్రంథంనుండి)

* * *

# తొట్టతొలి వచన కవితా రచయిత

- కుందుర్తి

శ్రీశ్రీ, శిష్ట్లా, నారాయణబాబు అద్యులుగా ఆవిర్భవించిన యీ (వచన కవిత) సాంప్రదాయచ్ఛందోరహిత కవితారూపం కూడా నేటివరకు ఖండికలకు మాత్రమే పరిమితమై నడుస్తున్నది.

శ్రీశ్రీగాని, శిష్ట్లాగాని, నారాయణబాబుగాని చేసిన రచనలు వచనకవిత వికాస ప్రారంభ రచనలు మాత్రమే. అవి పునాదులుగా మార్గదర్శకాలుగా మా యుగంవారు మరింత కృషి చేయవలసిన చారిత్రక అవసరం ఏర్పడిందని అనాడు మేము భావించాము...

అధునిక కవిత్వానికి కవిత్రయంగా శ్రీశ్రీ, శిష్ట్లా, నారాయణబాబులను చెప్పుకుంటున్నా వచనకవితకు ఆద్యుడుగా శిష్ట్లాను చెప్పుకోవాలి. అయన ప్రతిపాదించిన ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయేదీపాన్ని రగుల్చుతుందనీ, పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుందనీ ఆయన చెప్పుకున్నాడు. కవిత్వంలో పామరుడికి సంబంధించిన స్పృహను ఆయనే మొదటిసారిగా ప్రవేశపెట్టాడు. అంటే భావకవిత్వంపై జరిగిన ప్రొలిటేరియన్ విప్లవానికి ఆయన మార్గదర్శకుడు. ప్రయత్న పూర్వకంగా ఛందస్సును వికృతం చేయడం, విశృంఖలంగా రాయడం, వ్యాకరణాలపట్ల నిర్లక్ష్యత ప్రదర్శించడం వంటి కొత్తమార్గాలను తొక్కడమే కాకుండా వచన కవితలో మొట్టమొదటి కావ్యసంపుటిని కూడా అయనే ప్రకటించాడు. అయితే శిష్ట్లాకు అభ్యుదయ కవిత్వానికి కావలసిన మార్క్సిస్టు అవగాహనలేదు. అందువల్ల వచనకవితకు ప్రారంభకుడైనా అభ్యుదయ కవితాయుగంలో విస్మృత పథంలో పడిపోయాడు. శ్రీశ్రీ వచ్చి ఆయన ప్రారంభించిన వచనకవితను మాత్రాచ్ఛందోమార్గాల వైపున నడిపించాడు.

శిష్ట్లా, శ్రీశ్రీ, నారాయణబాబులను అలా వదలి వేద్దాం. వీరు అధునిక యుగానికి అద్యులు. కవిత్రయం...

కవితా రూపంలో కొత్త కోసం తాపత్రయపడి – ఓంప్రథమంగా కొన్ని ప్రయోగాలు చేసి చూపినవాడు శిష్ట్లా... అయితే యీయుగ కర్తృత్వం శిష్ట్లాకు రాక శ్రీశ్రీకి రావడానికి కారణం కావ్యవస్తువులో శ్రీశ్రీ తెచ్చిన విప్లవమే!....

కవితా రూపాన్ని అరంభంలో మార్చినది శిష్ట్లా. ఆయన ఫ్రీవర్స్‌లో 'విష్ణుధనువు', 'నవమి చిలుక' వంటి కావ్యాలను ప్రచురించాడు...

సైకలాజికల్‌గా తొలిరోజుల్లో శిష్ట్లా, శ్రీశ్రీల ఉద్యమస్ఫూర్తి నన్ను ప్రభావితుణ్ణి చేసి ఉండవచ్చు...

తెలుగులో మొట్టమొదటి వచన గేయం శిష్ట్లా రాశాడు ముప్ఫయిల్లో. కవిత్వంలో వ్యవహారిక భాష, వచనకవిత – యిప్పుడున్న రూపానికి రావడానికి నాలుగు దశాబ్దాలు పట్టింది...

['కుందుర్తి వ్యాసాలు' – అన్న గ్రంథం ఆధారంగా వివిధ సందర్భాల్లో శిష్ట్లాను గురించి కుందుర్తి ప్రకటించిన అభిప్రాయ శకలాల సమాహారం ఈ వ్యాసం ॥సం॥]

# ప్రాహ్లాద కవితా ప్రయోక్త

– ఆచార్య సి. నారాయణరెడ్డి

'నవమి చిలుక,' 'విష్ణుధనువు' అను కావ్యసంపుటులద్వారా భావకవిత్వముపై తిరుగుబాటు చేసిన అతినవ్యుడు శిష్ట్లా. 'నవమిచిలుక మున్నుడి' అను గేయములో 'ఇది పూర్వకవిత్వంగాదు, ఇది నవ్యకవిత్వం గాదు, ఇది భావకవిత్వం గాదు,' 'ఇది నూతనములో బహునూతన కవిత్వం' అని భావకవిత్వ వ్యతిరేకతను స్పష్టముగా ప్రకటించెను. తన నూతన కవిత్వమునకు 'ప్రాహ్లాదకవిత్వ'మను పేరుపెట్టుకొనెను. ప్రాహ్లాదకవిత్వములో ప్రౌఢత్వమున్నదని, పామరత్వమున్నదని 'దేశికి విదేశికీ నేస్తమున్న'దని స్పష్టపరిచెను. అనగా తన కవిత్వము పండితపామర రంజకమని, అది దేశీయ సంప్రదాయములతోపాటు విదేశరీతులను మేళవించుకొన్నదని ఈకవి అభిప్రాయము. ప్రాహ్లాదకవిత్వమనగా ప్రహ్లాదునికి సంబంధించిన కవిత్వమని ఈతడు వ్యక్తీకరించెను. శంక, అధైర్యము, అస్థిరత, అవరోధము, హిరణ్యాకశిపుడని – మనస్సు నరసింహామూర్తియని – అది హృదయ సభామంటపస్తంభమును పగిల్చి బయటికి విజృంభించగా 'ప్రాహ్లాదకవిత్వము' 'అహ్లాదము'గా ఉద్భవించునని భాష్యము చెప్పెను. ప్రాహ్లాద కవిత్వప్రయోజనము నీ విధముగా ప్రకటించెను.

"ప్రాహ్లాదకవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పరుగెత్తే పామరుణ్ని నిలేస్తుంది"(నవమిచిలుక : మున్నుడి: ప్రచు. 1938).

తన కవిత్వము ప్రజలలోని పామరత్వమును తొలగించి, స్తబ్దతను తుడిచివేసి వారిలో ఆశలు పెంపొందించునని, జాగృతి కలిగించునని, ఈ విధముగా అది ఉత్తమ ప్రయోజనగర్భితమని కవి అభిప్రాయము. ఈ నిర్వచనమును పురస్కరించుకొనియే దీనికి 'విమర్శ' వ్రాసిన గోపీచంద్‌గారు భావకవులపై జరుగుచున్న 'ప్రోలిటేరియన్ విప్లవమున'కీ కవి దారితీయుచున్నాడనీ, అయనకు ఈ కవి కావ్యము అచ్చుముగా శ్రామికవర్గ సంబంధికాదని, 'ఈకవిత్వంలో బూర్జువా వాసన, ప్రోలిటేరియన్ యాస' కనిపించుచున్నవని వ్యాఖ్యానించినారు. గోపీచంద్‌గారి వ్యాఖ్యానము సత్యదూరము కాదు. నవమి చిలుకలోని వస్తువు ప్రజాసామాన్యమునకు సంబంధించినది. ముఖ్యముగా గ్రామజీవనములోని వివిధ సంఘటనలను గర్భీకరించుకొని ఉదయించినది. వస్తువు విషయములో ఇది అచ్చమైన ప్రజాకవిత్వము; తన్నిర్వహణలో మాత్రము అభ్యుదయ కవిత్వస్థాయి నందుకొనలేదు. వస్తువులో, ఛందస్సులో, 'నవమి చిలుక' చక్కని ప్రయోగమని చెప్పవచ్చును.

శిష్ట్లా ప్రచురించిన ఇంకొక కవితాసంపుటి 'విష్ణుధనువు'(1938 జనవరిలో ప్రచురితము). ఇది 'నవమి చిలుక'కు కొంచెము ముందే ప్రచురింపబడినది. పీఠికకు ముందుగానే కవి యిట్లు వ్రాసికొన్నాడు.

'జన్మనక్షత్రమే
అహంకారమనే

విష్ణుధనువే
వెన్నెముకనంటియే
ఉంటుంది'.

ఈ సంపుటిలోని చివరిగేయములో ఈ వాక్యమునకు లక్ష్యరూపమున్నది.

'మేనియందణగి యణగి
మనసంత 'వయమ్'
అనే అహముచేయు
విష్ణుధనువు వంచి
చేరవలె సీతదరికి! శివధనువు ఫెళ్ళుమనును'.

మేనిలోని వెన్నెముకయే విష్ణుధనువు అదే 'అహము'. విష్ణుధనువు వంచినప్పుడే సీతాసాన్నిధ్యము లభించును. ఎట్లు? అహమును విష్ణుధనువు వంగుటతో శివధనువు ఫెళ్ళుమని విరుగును. శివధనుర్భంగముతో సీతాప్రాప్తి కలుగును. విష్ణుధనువు అహమునకు సంకేతము కాబట్టి, అహము విరిగినప్పుడే సీతాసాన్నిధ్యము–అనగా ముక్తిసీమంతినీ సాన్నిధ్యము లభించునని దీనితాత్పర్యము. ఈ లక్ష్యముతోనే ఈ సంపుటికి విష్ణుధనువ ను నామకరణము జరిగినది.

ఈ కావ్యసంపుటిలోని వస్తువులో చెప్పుకొనదగిన నవ్యతలేదు. ప్రేమసిద్ధాంత ప్రవచనమే ఈ సంపుటిలోని ముఖ్యధ్యేయము. అయినను పురాణవ్యక్తులను సంగ్రహించి, వారిని సరిక్రొత్తరీతిలో సమన్వయించుకొనుటలో నవ్యతకలదు. కవి తానే రాముడుగా, తనప్రేయసి సీతగా భావించుకొన్నాడు. సీతారాముల ఆత్మసందర్శనమే ప్రేమయోగముగా కల్పనచేసినాడు. కృష్ణుడు, నరసింహుడు, శివుడు మున్నగుదేవతలు; ప్రవరుడు మున్నగు సత్పురుషులు; అభిమన్యుడు, ఉదయనుడు మున్నగు క్షత్రియవీరులు తన రామునిలో ఉన్నట్లు భావించుకొన్నాడు. సీతయే పరాశక్తి, అలివేలుమంగ, చెంచీత, నిశీథమూర్తి – చివరకు ఆంధ్రదేవి గూడ. రాముడాంధ్రుడు, అతని సీతానురక్తియే దేశభక్తి. అనగా తన ప్రియానురక్తి దేశభక్తి యన్నమాట. ఈవిధముగా ప్రేమయోగమును పరిణద్ధదృష్టితో పరిశీలించి ఈ సంపుటిలో ప్రపంచించినాడు. సాంప్రదాయికమైన పదబంధములను, విశ్వాసములను తీసికొని దానిని పునస్సృష్టి చేసి నవ్యత సాధించినాడు ఈ పునస్సృష్టివలన అస్పష్టతయనులోపము ఇతని కవిత్వములో ప్రవేశించినదను విషయము మాత్రముపేక్షింపరానిది.

ఛందస్సు విషయములో శిష్ట్లా అద్భుతమైన ప్రయోగములు చేసినాడు. విష్ణుధనువు లో ప్రయత్నపూర్వకముగా ఛందస్సును వికృతమొనర్చినాడు. కొన్ని పద్యపు తున్కలను, కొన్ని మాత్రాబద్ధ గేయఖండములను, కొన్ని వచనపుతుంటలను ఇష్టమువచ్చినట్లు పేర్చి విశృంఖల మనస్తత్త్వమును ప్రదర్శించినాడు. ప్రాచీనగద్యమువలె స్ఫురించు వాక్యములు కొన్ని, జానపద గేయఖండములు కొన్ని చేర్చి – తన గేయములను, వచనగేయములకు మాత్రాగేయములకు మధ్య – ఊతగొట్టించినాడు. 'ఝంఝామారుత ఝర్ఝరీధ్వను'లని శార్దూలములవలె సాగిపోయిన గేయము వెంటనే 'జముకుచు జముకుచు అలలై' అని చతురస్రగతిలో పరుగులు దీయును.

భాషావిషయములో గూడ శిష్ట్లా కొంత నిర్లక్ష్యతను, విశృంఖలతను కనబరిచినాడు. 'మోయుచున్నది, వచ్చితిని, చిత్రితముజేసి' వంటి గ్రాంధికరూపములు ప్రయోగించి, వెంటనే 'కూలుతూ' వంటి ప్రయోగములు చేసినాడు. 'పోయినయ్యి,' 'ఊపుతున్నయ్యి,' 'వెన్నెల్లో' వంటి వ్యావహారిక రూపములను యథేచ్ఛగా వాడుకొన్నాడు. భావకవు లీరీతిగా గ్రాంధికవ్యావహారిక రూపములను 'కలగాపులగము' చేయలేదు. పైగా ఈ కవి 'సుదిన ఉదయ', 'సదన ఉద్యాన,' 'మందార చెక్కిళ్లు,' 'కేయూర వయ్యారి' వంటి అపరూపములను యథేచ్ఛగా ప్రయోగించినాడు. 'శ్రీకుచోపరిచేలాంచలము' అన్న పోతన్న ప్రయోగమును నడుమ విరిచి 'శ్రీ పరిచేలాంచలము' అని గుప్పించినాడు. అట్లే 'గజప్రాణావనోత్సాహియై' అన్నదానిని 'గజప్రాణోత్సాహియై' అని మార్చివేసినాడు. ఇవి తెలియక చేసిన తప్పులనుటకు వీలులేదు. భాషను ప్రయత్నపూర్వకముగా వికృత మొనర్చవలెనను తిరుగుబాటు మనస్తత్వమిది. 'సింబాలిజము'లో శబ్దార్థముకన్న వాతావరణకల్పనము ప్రధానము. పైని ప్రయోగించిన అపప్రయోగము లర్థరహితములైనను ఒక విచిత్రార్థ స్ఫురణము కలిగించుచున్నవికదా! – యనుభావముతో కవి ఈ చమత్కారములు చేసియుండును. పురాణ సంబంధి పాత్రలను తీసికొని క్రొత్తభావములను వెల్లడించుటలో ఈ కవిపై టి.యస్. ఇలియట్ ప్రభావమున్నది. కొన్ని సంకేతముల ద్వారా అర్థస్ఫురణము కన్న వాతావరణ స్ఫురణము కలిగించుటలో ఇతనిపై సింబాలిజము ప్రభావమున్నది. వచనగేయములో సమగ్రమైన కావ్యసంపుటిని ప్రచురించుటలో ఇతడే ప్రథముడు. వచనగేయము విషయములో శ్రీశ్రీ ప్రభృతులకితడు మార్గదర్శకుడైనాడు. 'నవమిచిలుక'లోని వచనగేయములు చక్కని వ్యావహారికశైలిలో, శయ్యా సారళ్యముతో, మంద్రగతిలో, లలితమైన అంతర్లయలో నడచిపోవును. గేయములు పాదములుగా కాక ఖండము (Para)లుగా విభక్తమై 'గీతాంజలి'లోని గేయములను తలపించుచుండును. ఇతడు భావకవిత్వముపై తిరుగుబాటు చేసెనేకాని క్రొత్తబాట వేయలేదని ఒప్పుకొనక తప్పదు.

---

[సిద్ధాంత గ్రంథం; గ్రాంథికంలో రాయాల్సిన కాలంలో – సి. నారాయణరెడ్డిగారి ఆధునికాంధ్ర కవిత్వం – సంప్రదాయములు ప్రయోగములు అంటూ రాసిన గ్రంథం నుండి – ||సం||]

★ ★ ★

# గ్రామీణ జీవిత చిత్రణ కవి

- జి. నాగయ్య

వచనకవితకు ఆద్యుడుగా పేర్కొనదగినవాడు శిష్ట్లా ఉమామహేశ్వరరావు* (16–5–1906, 2–1–1965). అతడు 1930 నుంచి రచించిన వచనగీతములు 1933లో 'నవమి చిలుక', 'విష్ణుధనువు' అను రెండు కావ్యసంపుటములుగా రూపొంది వెలువడినవి. శిష్ట్లా తన కవిత్వమును 'ప్రాహ్లాద కవిత్వమని పేర్కొనినాడు. ప్రహ్లాద కవిత్వం పూర్వ కవిత్వం కాదు. భావ కవిత్వం కాదు. నూతనములో బహు నూతన కవిత్వం' అని నవమి చిలుకకు వ్రాసిన మున్నుడిలో ప్రకటించుకొన్నాడు. 'ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగల్చుతుంది, పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది' అని తన కవిత్వ లక్ష్యమును శిష్ట్లా నిర్దేశించినాడు. 'నవమిచిలుక' గ్రామజీవితములోని వివిధ సంఘటనలను గర్భీకరించుకొని ఉదయించిన కావ్య సంపుటము. 'విష్ణుధనువు'లో ప్రేమ సిద్ధాంత ప్రవచనము ముఖ్యధ్యేయము. అయినను పురాణ వ్యక్తులను సంగ్రహించి వారిని సరిక్రొత్త రీతిలో సమన్వయించు కొనుటలో ఇందు నవ్యత వ్యక్తమగుచున్నది. 'విష్ణుధనువు'లో శిష్ట్లా ప్రయత్నపూర్వకముగా ఛందస్సును వికృత మొనర్చినాడు. కొన్ని పద్యఖండములను మరికొన్ని మాత్రాబద్ధగేయ ఖండములను, కొన్ని వచనములను ఇష్టము వచ్చినట్లు పేర్చి విశృంఖలతను కనపరచినాడు. వచనగేయము విషయములో శ్రీశ్రీ ప్రభృతులకితడు మార్గదర్శకుడైనాడు. ఇతడు భావకవిత్వముపై తిరుగుబాటు చేసెనే కాని క్రొత్తబాట వేయలేదని ఒప్పుకోక తప్పదు – అని డాక్టర్ సి. నారాయణరెడ్డి శిష్ట్లా తిరుగుబాటును గురించి అభిప్రాయపడినారు. ఆరుద్రగారు శిష్ట్లాది గొప్ప విప్లవారంభముగా భావించినారు. 'శిష్ట్లా చేసిన సాహితీసేవ ఏమిటి అంటే వేలకొలది సంవత్సరాల నుంచీ అందరి నోటాపడి అరిగిపోయి వాటంచెడిన నిస్సారమైన మాటలను పునస్సృష్టి చేయడానికి ప్రయత్నించినాడు' అని శ్రీరంగం నారాయణబాబు 'సంఘర్షణ'కు వ్రాసిన 'ప్రవర'లో చెప్పినాడు. కవిత్వమార్గమును సుగమము చేసిన శిష్ట్లా అభినందనీయుడు. శిష్ట్లా కవితలో 'సింబాలిజము' ప్రభావమున్నట్లు చెప్పవచ్చును.

★ ★ ★

---

* ఈ జననమరణాల సంవత్సరాలు ఎలా సేకరించారోకానీ పొరపాటు తేదీ – నెలల విషయం సరైనవి నాకు తెలియలేదు. ॥సం॥

# వచన కవితా ఉద్యమ ఆరంభకుడు

- కడియాల రామమోహన్‌రాయ్

వచన కవితకు ఆద్యుడుగా పేర్కొనదగిన కవి శ్రీ శిష్ట్లా ఉమామహేశ. ఆయన 1930 ప్రాంతాలనుండి రాసిన వచన గీతాలు 1938లో 'విష్ణుధనువు; నవమిచిలుక' కావ్యరూపాలు ధరించాయి. శ్రీ శిష్ట్లా తన గీతాలను వచన గీతాలని పిలవలేదు; 'ప్రాహ్లాద కవిత్వ'మని పిలుచుకున్నారు. "ప్రాహ్లాద కవిత్వం పూర్వకవిత్వం కాదు, భావకవిత్వం కాదు, నూతనములో బహునూతన కవిత్వం" అని ప్రకటించుకున్నారు. "ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది" అని తన కవిత్వ లక్ష్యాన్ని నిర్దేశించుకున్నారు. "ఇతడు భావకవిత్వముపై తిరుగుబాటు చేసెనేకాని క్రొత్తబాట వేయలేదని ఒప్పుకోక తప్పదు" అని శ్రీ సి. నారాయణరెడ్డి శిష్ట్లా తిరుగుబాటు గురించి అభిప్రాయబడ్డారు. "దుర్గమారణ్యంలో ప్రవేశించడమే ఒక సాహసిక కృత్యం. తనకు తాను బాట వేసుకోనిదే ఎవడూ కారడవిలో ముందుకు సాగలేడు. శిష్ట్లాది గొప్ప విప్లవారంభం"గా తలచారు శ్రీ ఆరుద్ర. శ్రీ శిష్ట్లా కవిత్వ మార్గాన్ని సుగమం చేశారు. అందుకైనా ఆయన్ను ఆద్యులుగా సంభావించాలి.

వచన కవిత్వం ప్రారంభమైన తొలిదశలో పండితులు యీ ఉద్యమాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఛందోబద్ధంగా రాయటం చేతగాక యీ విధంగా రాస్తున్నారన్నారు. వచన కవిత రాసిన వారిలో కొందరు పద్యరచయితలు గూడ వుండటంతో ఆ వాదం చాలించి, మరొక మార్గంలో ప్రతిఘటించారు. కవిత్వం వచనంలో వుండటం క్రొత్త సంగతేమీ కాదన్నాడు. సింహగిరి నరహరి 'వచనాలు,' 'తాళ్ళపాకవారి 'విన్నపాలు' ఇంకా ఎందరో కవులు పూర్వకాలంలోనే యీ ప్రక్రియలో రచనలు చేశారన్నారు. తాళ్ళపాకవారి 'వృత్తగంధి' వచనం ఆధునిక వచన కవిత్వం వొకటేనన్నారు. కాని ఉడుకు రక్తంతో ఉరకలు వేసే యువకులు వింటారా? తమ కవిత్వం పాత పద్ధతులకు వ్యతిరేకమని ప్రకటించారు. "వేదాంతులు జీవితాన్ని, ప్రకృతిని అవగాహన చేసుకున్నారు. మేము లోకాన్ని, జీవితాన్ని, ప్రకృతినికూడ మారుస్తాము" అప్రయత్నంలో భాగంగా కవిత్వ స్వరూపాన్ని కూడ మార్చదలచారు.

ప్రపంచంలో ఆర్థిక సంక్షోభం ముసురుకువచ్చి ఆంధ్రదేశానికి కరువు కల్పించింది. ఆ 'గడ్డురోజు'ల్లో (Depression days) కవుల ఆలోచనల్లో మార్పువచ్చి ఛందోరీతుల్లోకూడా తిరుగుబాటు అవసరమైంది. చారిత్రకంగా చూస్తే వచన కవిత్వ ఆవిర్భావం సహజంగానే జరిగింది. కాబట్టే అది ఇప్పటికి ఏపుగా పెరిగి, వనమై విస్తరించి రుచికరమైన ఫలాలను అందిస్తున్నది. అంతేకాని వచన కవిత్వం accidental గా, పడి మొలిచిన విత్తనం మహావృక్షమైనట్లు పెరగలేదు. పూర్వకవిత్వంలో ఏ తాళ్లపాకవారి నుండో అంటుకట్టి పెంచినదీకాదు. "Language like consciousness, only arises from the need, the necessity, of intercourse with other men" [The following words are crosed out in the manuscript;

"My relation to my surrounding is my consciousness"] అని మార్క్స్, ఏంగెల్స్‌లు భావించినట్లు కవిత్వంలో కూడ భాష అవసరాన్నిబట్టే మారుతుంది.

వచన కవితకు ఆద్యుడు శిష్ట్లా అనటంలో నేటి విమర్శకులు చాల మంది ఏకీభవిస్తారు. వచన కవిత్వాన్ని ఆదరించి, దానికొక వేదిక ఏర్పరచి ప్రోత్సహించింది శ్రీ ముద్దు కృష్ణ నడిపిన 'జ్వాల' పత్రిక . తర్వాత "ఉదయిని, ప్రతిభ, కృష్ణాపత్రిక" మొదలైన పత్రికలు ఆదరించాయి. శ్రీ శిష్ట్లా ప్రచారం చేయబూనిన 'ప్రాహ్లోద కవిత్వం' అనే మాట తర్వాత ప్రచారంలోకి రాలేదు. ఆయన ఉద్యమం మాత్రం ముందుకు సాగింది.

*("తెలుగు కవితా వికాసం" అన్నగ్రంథంనుండి)*

# ఛందోబందోబస్తు తెంపినవాడు

శిష్ట్లా ఉమామహేశ్వరరావు (1909–1953) కవి. ఆంగ్ల కవిత్వంలోని ఆధునిక ధోరణులతో బాగా పరిచయమున్నవాడు. జానపద గానరీతులతో సహా సంగీతం బాగా ఎరిగినవాడు. అనేక బుర్రకథలను, ఆధునిక పదాలను చాలా రాసి పాడేవాడు. సాంప్రదాయకంగా ఉన్న ఛందస్శృంఖలాల నుండి తెలుగు కవిత్వాన్ని విముక్తి చెయ్యాలనుకున్నాడు. తన కవిత్వాన్ని "ప్రాహ్లాద కవిత్వం" అని పేర్కొంటూ భాషలోనూ భావంలోనూ తిరుగుబాటు లేవనెత్తాడు. నవమిచిలుక (1938), విష్ణుధనువు (1938) అతని ప్రసిద్ధ రచనలు. ఇంటర్‌నేషనల్ ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ ఇండియన్ లిటరేచర్, వా.5, తెలుగు. సంపాదకుడు: గంగారాం గర్గ్, మిత్తల్ ప్రచురణలు, ఢిల్లీ–35: 1988. ఆంగ్లంలో ప్రచురితం అయిన ఈ విజ్ఞాన సర్వస్వం గిడుగు సీతాపతి గారు తయారుచేశారు. డా॥ బూదరాజు రాధాకృష్ణ గారు సరిచూసి నవీనంచేసి సంక్షిప్తంగా చక్కని పీఠిక రాశారు.

సం॥

★ ★ ★

# భావచిత్రవాద కవి

బహుముఖమైన ప్రజ్ఞఉన్న అభ్యుదయ కవి, పత్రికా రచయిత, హాస్యప్రియులు. భావకవిత్వంపైన తిరుగుబాటుగా కొత్త ఛందస్సులతో కొత్త భావాలతో కవిత్వం చెప్పారు. 'శాంతిని' పత్రికా సంపాదకులు, పురాణగాథలు, ఆధ్యాత్మ కీర్తనలు భిన్న దృక్పథంతో విశ్లేషించారు. సంకేతి తార్థస్ఫురణం, భావిభావన వీరి రచనలలో కనిపిస్తాయి. భావచిత్రవాద ప్రభావం కూడా వీరిపై ఉంది. కొన్ని రచనలు పఠితలకు యధాదర్శన భావన కలిగిస్తాయి. బాలసాహిత్యంలో కూడా వీరు కృషిచేశారు. పిల్లలకోసం మంచిపాటలు, నాటికలు రాశారు. ఈయన తన నూతన కవిత్వానికి 'ప్రాహ్లాద కవిత్వము'ని పేరు పెట్టుకొన్నారు. తన కవిత్వంలో నూతనత్వం దేశికీ విదేశికీ నేస్తం ఉన్నవనీ ప్రజలలోని స్తబ్ధత తుడిచివేసి వారిలో ఆశలు రేకెత్తిస్తుందనీ, జాగృతి కలిగిస్తుందనీ వీరు చెప్పుకొన్నారు. 'నవమి చిలుక', 'విష్ణుధనువు' పేర్కొనదగిన రచనలు, విచిత్రమైన అర్థ స్ఫురణను కలిగించే నూతన ప్రయోగాలు, భాషలో విశృంఖలత, చమత్కారం వీరి ప్రత్యేకత. వచనగేయాలతో సమగ్రమైన సంపుటి ప్రచురించిన వారిలో వీరే ప్రథములని పండితాభిప్రాయం. వీరి రచనాశైలి విలక్షణమైనది. వీరు గ్రాంథిక వ్యావహారికపద రూపాలను కలగలిపి ప్రయోగించారు. సుదినఉదయ, మందార చెక్కిళ్ళు, కేయూరవయ్యారి వంటి ప్రయోగాలు తరచుగాచేశారు. ప్రయత్నపూర్వకంగా ఛందస్సును వికృతం చేసిరాయటం, పద్యపు తునకలు, మాత్రాఛందస్సులోని గేయాలు, ఇష్టంవచ్చినట్టు పేర్చి రాయటం వృత్తపద్యాలను మధ్యలో ఆపి చతురస్రగతిలో రాయటం వంటివి చేశారు. వీరిది భావకవిత్వంపై తిరుగుబాటేగాని కొత్త బాటకాదని విమర్శకుల అభిప్రాయం.*

- సంపాదకులు, తెలుగు సాహిత్యకోశం
తెలుగు అకాడమీ

* శిష్ట్లా జన్మదినం 2-11-1909 అని ఈ సంకలనకర్తలు నమోదు చేశారు. ॥సం॥